





ముఖచిత్రం : 'శ్రీ'

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

## విజయవంతంగా ప్రదర్శింపబడుతున్న





# దేవుడు మావయ్య

దర్శకత్వం: కె. వాసు నిర్మాతలు: దేవినేని వెంకట్రామయ్య, త్రినాథ్

నిర్మాణ సారథ్యం: జి. రాజేంద్రప్రసాద్ సంగీతం: చక్రవర్తి

## 1981లో సూపర్ హిట్

### విజయవంతంగా ప్రదర్శింపబడుతున్న చిత్రం!



# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 43 ఫిబ్రవరి 1981 సంచిక 2


**1980** సంవత్సరం ప్రజలనూ, ప్రభుత్వాలనూ అనేక విధాలుగా పీడించి వెళ్ళిపోయింది. 1981 ఎలా వుంటుందో తెలియదు. కాని, జనవరి మాసపు ధోరణి చూస్తే 1981లో కూడా ప్రజలు సుఖపడతారనే సూచన కనపడడంలేదు. ఏ విధంగానైనా ప్రజల అవస్థలను తగ్గించడానికి ప్రభుత్వం సత్వరంగా స్థిర ప్రయత్నాలను చెయ్యడం అవసరం. 1980లో జరిగిన ఒక మంచి సంఘటన ఏమిటంటే, కేంద్రంలోనూ, కొన్ని రాష్ట్రాలలోనూ స్థిరమైన ప్రభుత్వాలు ఏర్పడడం. అందువల్ల, ప్రజాహిత కార్యక్రమాలపై దృష్టి కేంద్రీకరించి పరిపాలన సాగించడానికి ఆ ప్రభుత్వాలకు అవకాశం ఏర్పడింది. తమలో తాము పోటీపడి పార్టీ వ్యవహారాలలో నిమగ్నమై, పరిపాలనను సరిగా చూడలేని పరిస్థితి ప్రభుత్వాలకు లేదు.

కేంద్ర ప్రభుత్వమైతేనేమి, రాష్ట్ర ప్రభుత్వాలైతేనేమి, ముఖ్యంగా చెయ్యవలసిన పని, ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించడము. ప్రభుత్వ వ్యయాన్ని భరించేది ప్రజలే. ప్రభుత్వ వ్యయం తగ్గిందంటే, ప్రజలమీద పడే ఆర్థికభారం తగ్గుతుంది. ప్రస్తుతం పన్నులభారమే కాకుండా, రోజురోజుకూ పెరిగిపోతున్న

ధరలవల్ల సామాన్య కుటుంబీకుల జీవితం దుర్భరమౌతున్నది. ఈ మాట ప్రతి నెలా, ప్రతి వారమూ, ప్రతి రోజూ చెప్పవలసి వస్తున్నది. తెల్లవారి లేస్తే, సాయంత్రం లోపున ఏ వస్తువు ధర ఎంత పెరిగిపోతుందో, ఆ రోజు ఎలా గడుస్తుందో సామాన్య పౌరుడు ఊహించలేకుండా వున్నాడు. ఇలాంటి పరిస్థితి కొనసాగకుండా ప్రభుత్వం గట్టి చర్యలను తీసుకోవాలి.

ఫిబ్రవరి నెలలో 1981-82 సంవత్సర బడ్జెటు వస్తుంది. ఆ బడ్జెటు ప్రజల మీద పన్నుల భారాన్ని పెంచుతుందో, తగ్గిస్తుందో తెలియదు. 1980 బడ్జెటులో ఆదాయపు పన్ను విషయంలో కొంత చిన్న రాయితీ జరిగింది. అంటే, పన్ను చెల్లించనక్కరలేని ఆదాయం, ఏడాదికి 12,000 రూపాయలుగా నిర్ణయించబడింది. కాని, పన్నెండు వేల రూపాయలపైన ఆదాయం వచ్చినవారు, ఎనిమిది వేల నుంచీ పన్ను కట్టాలనే నిబంధన వుంచబడింది. ఇది చాలా చికాకు కలిగించే నిబంధన. ఇలాంటి అసౌకర్యపు నిబంధన, జనతా పార్టీ ప్రభుత్వ కాలంలో చేయబడింది. అది, అంతకు ముందు శ్రీమతి ఇందిరా గాంధి ప్రభుత్వ కాలంలో యివ్వబడిన రాయితీని వమ్ముచెయ్యడానికి చేయబడిన నిబంధన. అలాంటి నిబంధనను, మళ్ళీ అధికారంలోకి వచ్చిన శ్రీమతి ఇందిరా గాంధి ప్రభుత్వం అమలులో వుంచడం చిత్రంగా వుంది. ఈ సంవత్సరపు బడ్జెటులోనైనా, ఆ అవకతవకను తొలగించి, ఏ మెట్టు నుంచి పన్ను వేస్తారో ఆ మెట్టు పైన ఆదాయం మీదే పన్ను వసూలుచేసి, ఆ మెట్టు పైన ఎంత ఆదాయం వచ్చినా ఆ మెట్టు లోపలి ఆదాయం మీద పన్ను వెయ్యకుండా వుండే, పూర్వపు పద్ధతిని మళ్లీ ప్రభుత్వం అమలులోకి తెస్తుందని ఆశిస్తున్నాము.

ఆదాయపు పన్ను వేసే మెట్టునుకూడా, ఏడాదికి పదిహేను వేలకు పెంచడం అవసరం. ఏడాదికి పదిహేనువేల ఆదాయం, యీనాటి ధరల పరిస్థితిలో ఒక పెద్ద ఆదాయం కాదు. మధ్యతరగతి కుటుంబీకులు, యింటిఅద్దె, పిల్లల చదువుల ఖర్చులు, సంసారపు ఖర్చులు, మందులు మొదలైన వాటికి వెయ్యి రూపాయల ఆదాయం చాలక అవస్థపడుతున్నారు. వారికి అప్పు పుట్టదు. వారికి ఉచిత వైద్య సౌకర్యాలు లేవు. జీవితం ఒక నరకబాధ. మధ్యతరగతి కుటుంబాల పరిస్థితులను పరిశీలించడానికి ఒక కమిటీని వేస్తే, ప్రభుత్వానికి ఎన్నో కొత్త విషయాలు తెలుస్తాయి. వెనుకబడిన వర్గాలకు, పేదలకు బాధలను నివారించడానికి ఎన్నో కార్యక్రమాలను అమలు జరుపుతున్న ప్రభుత్వం మధ్యతరగతి కుటుంబాల పరిస్థితులనుకూడా గమనించడం అవసరం. వెనుకబడిన

వర్గాలను కనీసం మధ్యతరగతి కుటుంబాల అంతస్తుకైనా తేవడం అవసరం. అలాంటప్పుడు, మధ్యతరగతి కుటుంబాల బాధలను నివారించకపోతే, ఆ కుటుంబాలుకూడా ఆర్థికంగా వెనుకబడిన వర్గాలలోకి దిగజారిపోతాయి. అలా జరిగిన నాడు, దేశ ఆర్థికవ్యవస్థే దెబ్బతింటుంది. అన్ని వర్గాల మేలునూ గమనించవలసిన ప్రభుత్వం, మధ్యతరగతి కుటుంబాల అవస్థలనుకూడా పరిశీలించాలి.

పన్నుల ప్రస్తావన వచ్చినప్పుడు, ఆస్తిపన్నును గురించి చెప్పకుండా వుండడానికి వీలులేదు. ఇలాంటి పన్ను, మన దేశంలో తప్ప మరేదేశంలోనూ లేదు. ఒక సంవత్సరంలో వచ్చిన ఆదాయంమీద పన్నుకట్టి, తన ఖర్చులుపోను మిగిలిన డబ్బును దాచుకోడానికి ప్రతిపౌరుడూ ప్రయత్నం చేస్తాడు. అలా నాలుగైదు సంవత్సరాలు కూడబెట్టిన డబ్బును, డబ్బురూపంలోనో, వేరే స్థిరాస్తి రూపంలోనో వుంచుకున్న వ్యక్తి, ఒక మెట్టుపైన ఆ ఆస్తివుంటే దానిమీద కూడా పన్ను కట్టాలి. అంటే, పన్ను చెల్లించగా మిగిలినదానిమీద కూడా పన్ను చెల్లించడం అన్నమాట. ఇలాంటి పన్ను మనదేశంలోనే వుంది. ఈ పన్నును తొలగించాలి. అలా చెయ్యడానికి ఆర్థికమంత్రికి చాలా ధైర్యం కావాలి. ఎన్నో సంవత్సరాలుగా అమలులోవున్న యీ పన్నును తీసివెయ్యాలంటే ఆర్థికమంత్రికి ధైర్యం అవసరమే. అయినా, అసహజమైన యీ పన్నును తొలగించడాన్ని గురించి ఆర్థికమంత్రి ఆలోచిస్తారని ఆశిస్తున్నాము.

---

# చిత్ర వార్తలు



రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారి నుండి "మెమెంటో" అందుకుంటున్న దృశ్యం.



సుప్రసిద్ధ గాయకుడు సుందరదాసు శ్రీ ఎమ్ ఎస్ రామారావుగార్కి కళాభారతి ఆధ్వర్యంలో మద్రాసులో సన్మానించారు



మద్రాసు, కళాభారతి ఆధ్వర్యంలో కళాప్రపూర్ణ శ్రీ ఎన్. టి. రామారావు అధ్యక్షతన శ్రీ కొండవీటి వెంకటకవి రచించిన 'శ్రీ పాదుకలు' నాటక కృతి శ్రీమతి అట్లూరి వేంకటసుబ్బమ్మగార్కి అంకితమిచ్చారు



ఆ సందర్భంగా ప్రఖ్యాత ఆడిటర్ శ్రీ యం. యస్. రామమోహనరావు అధ్యక్షులు శ్రీ రామారావుగార్ని సత్కరించి వేదికమీదకు ఆహ్వానించారు

# జరుగుతున్న చరిత్ర

**జాతీయ** అంతర్జాతీయ పరిస్థితి కొంత అదుపులో వున్నట్లు కనిపించినా, విషమంగానే వున్నదని విషయజ్ఞుల అంచనా. అంతర్జాతీయ పరిస్థితిలో ఇటీవలకాలంలో ఆందోళన కలిగించినది పోలాండ్‌లోని వివాదం—అందుకు సంబంధించిన ప్రాపంచిక పరిణామం. దీని వివరం ఎదువరులకు లోగడనే పరిచయమై వున్నది. అతి నిగ్రహంతో, వర్కర్లు ఉద్యమాన్ని జయప్రదంగా నడిపించి, ఉద్యమనాయకులు ప్రభుత్వనాయకులతో, పరిపాలించే పార్టీనాయకులతో సమాధానపడి, ఉభయతారకమైన ఒప్పందాన్ని సాధించారు. ఆ ఒప్పందం ఉభయపక్షాలకు విజయం (Victory to both sides) అని అందరు కీర్తించారు. కాని, మార్పును సహించలేని కొన్ని శక్తులవలన ఆటంకాలు వచ్చినవి. వాటిని ప్రతిఘటించటానికి పూనుకున్న వర్కర్ల చర్యలు సఫలమైనవి.

ఐనప్పటికీ ఇటు ఎర్రటి సీమలలో, ముఖ్యంగా రష్యాలో అపోహలు కొన్ని కలిగినవి. రష్యన్ సేనలు పోలాండ్‌లోకి ప్రవేశించ బోతున్నవని సమాచారం అందగానే అమెరికా నాయకులు —పాశ్చాత్య రాజ్యముఖ్యులు 'అంతపని చేయవద్దు — అపాయకరం — ఆ సవాలును మేము ఎదుర్కొనక తప్పదు' అని హెచ్చరించారు.

జాగ్రత్తగా, సంగతి సందర్భాలను అవగాహన చేసుకుంటే రష్యానాయకులు పోలాండ్‌పై దండయాత్రకు దిగరని కొందరు పరిశీలకులు అభిప్రాయపడ్డారు.

ప్రపంచ పర్యవేక్షకుల దృష్టిలో మాత్రం, పోలాండ్ సంపూర్ణంగా సురక్షితంగా వున్నదని, ఇప్పుడే భావించడం తగదు.

* * *

అఫ్గనిస్తాన్ సమస్యను పరిష్కరించడానికై ఒక సూచన బబ్రాక్ కర్మాల్ ద్వారా కొత్తగా వెల్వడింది. సూచన 'అఫ్గన్‌సీమ, పాకిస్తాన్, ఇరాన్ కలిసి అఫ్గన్ పరిస్థితిని చర్చించుకుని ఒక పరిష్కారమార్గాన్ని అన్వేషించడం ఉత్తమం.' రష్యాసేనలు అఫ్గన్ గడ్డపై వుండగా చర్చలకు తాను సమ్మతించదని ఇరాన్ తెల్పింది. పాకిస్తాన్ సరేసరి. అంతట, ఇప్పటి సవరణ చేయబడినది. సవరణ ఏమనగా, 'ఐక్యరాజ్యసమితి ప్రతినిధుల సమక్షంలో చర్చలు జరిపించండి!'

---

*మండి జగన్నాథం*

మొండిపట్టు వీడి, ఇరాన్ — పాక్ సీసులు ఇందు కంగీకరిస్తే మంచిదని పరిశీలకుల అభిప్రాయం. ఈ పంక్తు లందేలోపల ఏమైనదీ తెలిసిపోతుంది.

* * *

ఇరాన్—ఇరాక్ యుద్ధం ఇంకెంతో కాలం సాగదు. కంపూచియాలో సింహ నాయకునికి పునః 'పట్టాభిషేకం' జరగ డానికి చైనా సమ్మతిని ఆస్ట్రేలియా పొందగల్గితే, ఆ సీమ కల్లోలం నుంచి బయటపడవచ్చునని విషయజ్ఞుల భావన.

* * *

జాతీయంగా మనకు రెండు పెద్ద చిక్కులు వచ్చి పడినవి. ఒకటి వ్యవ సాయకులకు సంబంధించినది. రెండవది మన రక్షక భటులకు సంబంధించినది. మన రాష్ట్రంలో ప్రభుత్వం—ప్రతిపక్షాలు కలిసి చర్చించుకుని వ్యవసాయకులకు చాల రాయితీలను, కొన్ని సౌకర్యాలను అందించినారు. ఉభయులు అభినంద నీయులని భావుకులంటున్నారు. మహా రాష్ట్రంలో ఆందోళన శృతిమించి రాగాన పడేసరికి, ప్రభుత్వం ఒక స్వతంత్రు నితో రాజీపడి, ప్రతిపక్షాలు నడిపిన ఉద్యమాన్ని ఎదుర్కొన్నది. దీని పర్యవ సానం పూర్తిగా ఇంకా ముందుగాని తెలియదు. తమిళనాడులో, అస్సాం టెక్నిక్ అమలు జరిగేసరికి, ప్రభుత్వం విరుచుక పడింది. అంతలోనే పరిస్థితి చల్లబడింది. ఇతర ప్రాంతాలలో కూడా రైతులలో మంచి కదలిక వచ్చింది. కర్నాటకలో వచ్చిన ఇట్టి కదలిక ఎన్న దగినది.

మన రక్షక భటులు సాధారణంగా శ్రమ కోర్చి తమ ధర్మాన్ని నిర్వహిస్తూ వుంటారు. కాని ఇటీవల రెండు విధాల వారిపై ఒత్తిడి వస్తున్నది. ఒకటి:— లూటీచేసి, ఖూనీచేసి, కుట్రచేసి పట్టు బడితే, శాసనాన్ని వంచించి — శాసన పూర్వకంగా నేరవకీళ్ళ సాయంతో 'నిర్దోషులై' పోతున్నారు.

ఇంకొకటి:—సమాజంలో మానవత్వం మృగ్యమైపోతూవుంటే, దాని ప్రభావం పోలీసు జవాన్ల మీద పడకుండా పోదు. సమాజంలో జాగరూకత చాల అధికంగా వున్నప్పుడు కూడా, రక్షకులు కొందరు భక్షకులవుతారు. అది లేనప్పుడు ఇక చెప్పవలెనా?

పై రెండంశాలలో రక్షక భటరంగాన్ని సంస్కరించవలసిన అవసరాన్ని పాలక పక్షం, ప్రతిపక్షాలు, సమాజ సేవకులు గుర్తించినట్లు తెలుస్తున్నది. పోలీస్ కమిషన్ రిపోర్టు ఈ వరకే వచ్చింది. పోలీసుల ఆదాయాలను న్యాయమైన స్థాయిలోకి తీసుకరావలెననే స్పృహ కూడా కలిగింది. శుభం. పర్యవసానం ఎలా వుంటుందో చూదాం.

---



# గురుభక్తి

## కె.లలితాచలం

శివరాత్రి పర్వదినం. భానుని వేడి కిరణాలు తాకి శివశివా అంటూ చలి పులిలా పారిపోతుంది. ఉపవాసలుండేవారు ఇల్లు కదలరు. కాని రామకోటిగారు మాత్రం ఉపవాసం ఉండి కూడా మిట్టమధ్యాహ్నంవేళ మాధవయ్యగారి ఇల్లు వెతుక్కుంటూ రిక్షాలో బయలుదేరారు.

సరస్వతీపురం. మృదంగం ఆకారంలో ఉన్న ఇల్లని చెప్పగానే రిక్షావాడు సూటిగా వచ్చి ఇంటిముందు రిక్షా ఆపాడు.

---

**1980 చక్రపాణి ద్వితీయ అవార్డు పొందిన నవల**

---

వీధి మీద ఇల్లు. ఎత్తుమీద కట్టారు. ఒక్కొక్క మెట్టే లెక్క పెడుతూ ఎక్కి పదో మెట్టుమీద ఆగారు. పెద్దపెద్ద గాజుతలుపులు అడ్డమొచ్చాయి లోపల కెళ్ళకుండా. అద్దాల తలుపులోంచి హాలంతా కలయచూశారు. మనుషుల అలికిడి లేదు. కాని ఎదురుగా ఆరడుగుల తైలవర్ణచిత్రం కనిపించింది.

"అహా! ఏమి హుందా! ఎత్తు. ఎత్తుకు తగ్గ లావు. మాధవయ్యగారు ఆజానుబాహువే! నాలుగు వేదల్లాగా విబూది పట్టెలు. త్రినేత్రుడి మూడవ కన్నులాగా కుంకుమబొట్టు, మెళ్ళో గవడకాయల్లాంటి రుద్రాక్షలు. చెవులకు కుండలాలు, చేతులకు సింహతలాటం. ఎర్రటి జరీ శాలువా!" ఆ తైలవర్ణ చిత్రాన్ని వర్ణిస్తూ చూస్తూ మాధవయ్యగారు తన ఎదుట నిలచినట్లు అనుభూతి పొందారు రామకోటిగారు. చెయ్యెత్తి నమస్కరించారు బైటనుంచే. తలుపు తోశారు. గడియ వేసిఉంది లోపల. తలెత్తి చూస్తే కనిపించిన కాలింగ్ బెల్ నొక్కారు. ఆ మోత విని నిద్రలేచినట్లున్నాడు, కళ్ళు నులుముకుంటూ ఆవలించుకుంటూ వచ్చాడొక వ్యక్తి. పొడుగూ కాదు పొట్టీ కాదు. ఎర్రగా లావుగా గుండులా ఉన్నాడతను. తలుపు తియ్యకుండానే రామకోటిగారిని పరిశీలనగా చూశాడు. ఎర్రగా, పొట్టిగా, బక్కపలచగా, బట్టతల. రామకోటిగారి పంచె ఉత్తరీయం, ముఖాన కుంకుమబొట్టు చూసి, గౌరవనీయునిగా అంచనా వేసుకున్నట్లున్నాడు. తలుపు తీసి, గుమ్మానికి అడ్డంగా నిలబడి "ఎవరు కావాలి?" అని అడిగాడు.

"మాధవయ్యగారున్నారా? వారితో పనుండి...." మాట సగంలో తుంచి "ఆ పనేదో నాకు చెప్పండి." అతని మాటలో గర్వం, అహం గోచరించిందే కాని మృదుత్వం లేదు. తనను దాటిగాని విషయం మాధవయ్యగారికి చేరదన్న ధ్వని వినిపించింది అతని మాటలో. కాస్సేపు ఆలోచించారు.

"నా పేరు రామకోటి. లలితకళా కల్చరల్ అసోసియేషన్ వైస్‌ప్రెసిడెంటుని. అన్నట్లు మీ పేరేమిటో అడగటమే మరిచా సుమండీ."

"నా పేరు నాదబ్రహ్మం. వారి ప్రియ శిష్యుడ్ని. లోపలికి రండి" అంటూ గుమ్మానికి అడ్డుతొలిగి అక్కడే ఉన్న సోఫా చూపించాడు కూర్చోమన్నట్లుగా. రామకోటిగారు కూర్చున్నారు.

ఇద్దరూ కొంతసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నాక, ఇల్లంతా చూపెట్టాడు నాదబ్రహ్మం.

నిలువెత్తు కంచు నటరాజ విగ్రహం ఉన్న చోటు విద్యార్థులు పాఠాలు చెప్పు

కునేచోటు రామకోటిగారు తను కూచున్న హాలుగా గుర్తించారు. ఒకగదిలో అనేక మృందంగాలు పెట్టి ఉన్నాయి. మాధవయ్యగారి గదినిండా ఖరీదైన జేప్‌రికార్డు, టెప్‌లు, రేడియోగ్రాం, రికార్డులు, ఖరీదైన మంచం. ముఖమల్ పరుపు. ఆయన స్థితిగతులను చాటుతున్నాయి. దానికిందే మరో గది. అది ఆయన ప్రత్యేకంగా సాధన చేసుకోవటానికి. ఆయన గదిలో ఒక పక్కగా తగిలించి ఉన్న ఫొటోను చూసి ఒక్కమాటుగా అదిరిపడ్డారు రామకోటిగారు.

"ఈ ఫొటో........"

"అమ్మగారిదిట" నాదబ్రహ్మం అలా అనగానే రామకోటిగారికి అనుమానం వచ్చింది. ఆ అమ్మగారు ఇప్పుడు లేరా? అని. సందేహ నిర్వృత్తికోసం అడిగే శారు.

"అయితే అమ్మగారు, పిల్లలు ఇక్కడుండరా?"

"హూ. అమ్మగారు ప్రసవించి పోయారుట. ఆమె గొప్ప గాయకురాలట. ప్రస్తుతం అమ్మగారు, పిల్లలూ అన్నీ నేనే. ఆమె పోయాక గురువుగారు మరి వివాహమాడలేదు. ఆమెనే ఆరాధిస్తూ కాలం వెళ్ళబుచ్చుతున్నారు. ఆయన్ని వదలలేక నేనూ...."

"అయితే మాదవయ్యగారికి వారసులు లేరన్నమాట. ఈ ఇల్లు వారి సొంత మేనా?" ఆరాగా అడిగినట్లు అడిగారు రామకోటిగారు.

"సొంతమనే చెప్పాలి. కాని ఆయన కట్టించలేదు. ఊరివారంతా ఆయన తమ ఊరివాడు, మహావిద్వాంసుడన్న గౌరవంతో కట్టించి ఇచ్చారట. ఆయన మరో ఊరెళ్ళి స్థిరనివాసం ఏర్పరచుకోకుండా కట్టుబడి చేశారు" అన్నాడు నవ్వుతూ.

"చాలా మంచిపని చేశారు. ప్రతివారూ ఇలా తమ ఊరి కళాకారులకు ఇల్లూ వాకిలీ ఏర్పరచి ఇస్తే, వారు అంత్యకాలం వరకూ ఆ ఊరికి, ప్రజలకు కృతజ్ఞులై, కళాసేవ నిశ్చింతగా చెయ్యగలుగుతారు. వేలాది కళాకారులను నిస్వార్థంగా తయారుచెయ్యగల అవకాశం లేకపోలేదు. అన్నట్లు అప్పుడే నాలుగు గంటలైందే! మాటల్లో పడి కాలాన్ని విస్మరించాను. అన్నట్లు గురువు గారు ఎంతసేపట్లో వస్తారో!" ఎంతసేపటి కొచ్చినా వచ్చిన పని పూర్తి చేసుకే వెళ్ళాలన్న ధృఢనిశ్చయంతో ఉన్నట్లుగా తిరిగొచ్చి సోఫాలో చతికిలబడ్డారు రామకోటిగారు. నాదబ్రహ్మం కూడా పక్క కుర్చీలో కూర్చున్నాడు.

ఇద్దరూ మళ్లీ కబుర్లలోకి దిగారు.

ఎంతో ఆనందం, పరవశం, గర్వంతో మహారాజులాగా ఒకొక్కక్క మెట్టే

హుందాగా ఎక్కుతూ, పరవళ్లతొక్కే ఆనందాశ్చర్యాలను అదుపుపెట్టుకుంటూ వస్తున్న మాధవయ్యగార్ని ఇద్దరూ చూడలేదు. ఎవరీ కొత్త వ్యక్తి? అన్నట్లు చూశారు మాధవయ్యగారు. గీతాబోధ చేస్తున్న కృష్ణుడిలాగా రామకోటిగారు చెప్పుకుపోతుంటే అర్జునుడిలాగా నోరు తెరుచుకు వింటున్నాడు నాదబ్రహ్మం. మాధవయ్యగారికి వారిద్దర్నీ చూస్తుంటే ముచ్చటేసింది. నాదబ్రహ్మానికి కూడా ఇంత కుదురుందా? అనుకుంటూ లోపల అడుగుపెట్టారు. చెప్పుల చప్పుడు విని ఇద్దరూ ఉలికిపడి లేచారు. రామకోటిగారు భయవినయాలు నటిస్తూ "నమస్కారం" అన్నారు. ప్రతినమస్కారం చేసారు మాధవయ్యగారు.

రామకోటిగారిని కూర్చోమని సంజ్ఞచేసి లోపలికెళ్ళి స్నానంచేసి వచ్చారు మాధవయ్యగారు. వస్తూనే నటరాజు దగ్గర దీపారాధన చేసి నమస్కరించి తనకై ఉన్న ప్రత్యేక ఆసనంపైన కూర్చుంటూ, "చెప్పండి" అన్నారు నిండుగా చిరునవ్వులు చిందిస్తూ.

ఆరోజు ఎన్నడూ చూడనంత ఆనందం ఆయన ముఖాన తాండవిస్తోంది. నాదబ్రహ్మం ఆయన్నే పరికించి చూస్తున్నాడు. కాని ఆయన ఆనందానికిగల కారణం గ్రహించలేకపోతున్నాడు. ఆ క్షణంలో ఆయన్ని ఏదడిగినా కాదనక చేస్తారనిపిస్తోంది, ఆయన ముఖాన సంతోషం చూస్తుంటే.

"చిత్తం. మనవిచేస్తాను. నాపేరు రామకోటి అంటారు. లలితకళా కల్చరల్ అసోసియేషన్‌వారి తృతీయ వార్షికోత్సవం ఏప్రిల్ ఒకటిన. ఆ సందర్భంగా వారు కర్నాటక సంగీతకచేరీ ఏర్పాటు చెయ్యాలనుకున్నారు. చినబాబుగారి కుమార్తె శ్రీవాణి గాత్రసంగీతం. కేశవరావుగారి వాయులీనం. మీ మృదంగమైతే కచేరీ రక్తి కడుతుందని...."

మాధవయ్యగారి ముఖంలో గర్వం తొంగిచూసింది. శ్రీవాణి విద్వత్తుని గూర్చి లోగడ చాలామంది ద్వారా వినటం తప్ప ప్రత్యక్షంగా ఆమె విద్యా సామర్థ్యాల్ని తెలుసుకునే అవకాశం రాలేదు మాధవయ్యగారికి. వయసులో చిన్నదైనా అనుభవజ్ఞులైనవారిని కూడా అతి చాకచక్యంతో తలకిందులు చేస్తుందని విన్నారు. ఒక్కమారు అవకాశం దొరికితే ఆ చిన్నదాన్ని, తన విద్వత్‌తో ఓడించాలనే చిలిపి కోరిక కలిగింది ఓమాటు. ఆ సదవకాశం తనకు తానుగా తనను వెతుక్కుంటూ వచ్చింది ఈనాడు. ఈ అవకాశం జారవిడువకూడదని పించింది అరవయ్యో పడిలో పడిన మాధవయ్యగారికి. లోలోపల మహదానందం కలిగింది.

"మా కోరిక మన్నించి మమ్మల్ని కృతార్థులను చెయ్యండి" అంటూ సంచీలో నుండి నోట్ల కట్ట తీసి లెక్కెట్టడం ప్రారంభించారు రామకోటిగారు.

"మన ఊరి కార్యక్రమం. కాదనలేని బలహీనుణ్ణి. కానీ.... ఆరోజు ఖాళీ ఉందో లేదో! నాదం! కాస్త డైరీ చూడు నాయనా?" అంటూ నాదబ్రహ్మానికి పురమాయించి,

"ప్రోగ్రాం ఎక్కడ? టిక్కెట్లా? ఇన్విటేషన్లా? లేక ... "

"త్యాగరాయ గానసభలో ఏప్రిల్ ఒకటవ తేదీని సాయంత్రం 6 గంటలకు. నూటయాభై, నూరు, యాభై ....టిక్కెట్లు. మీకు కూడా ఓ టిక్కెట్ల పుస్తకం ఇవ్వమంటారా?" చిరునవ్వు నవ్వుతూనే చిన్న వ్యాపార అవకాశం పరీక్షించారు రామకోటిగారు.

"అవసరం లేదు. అక్కడికి వచ్చేవారంతా నావారే" అన్నారు మాధవయ్యగారు.

"ఒక్క ఏప్రిల్ ఒకటి తప్ప అన్ని రోజులూ బుక్కైపోయాయండీ" అన్నాడు డైరీ మూసేస్తూ నాదబ్రహ్మం.

రామకోటిగారికి బ్రహ్మానందమైంది.

"నోరుజారి మాట ఇచ్చినా మాట నిలబడింది" ముసిముసిగా నవ్వుకుంటూ సింహతలాటం చేత్తో తిప్పుకుంటూ అన్నారు మాధవయ్యగారు.

"అది మా అదృష్టం. ఇవిగోండి మూడు వేలు ఎడ్వాన్సుగా ఉంచండి. మిగతావి తాంబూలంలో ఇవ్వాలని ప్రెసిడెంటుగారి సరదా! తాంబూలంలో ఎంత ఉంచమంటారు?" సూటిగా మీ రేటు ఎంతని అడగటం సభ్యత కాదని మెత్తని మెలికగా అడిగారు రామకోటిగారు.

కళలు ఎంత వ్యాపారంగా మారినా మాధవయ్యగారు నోరు తెరిచి ఇంతని చెప్పలేకపోతున్నారు. నాదబ్రహ్మం ఆయన అవస్థ అర్థంచేసుకుని "అదో పెద్ద సమస్యగా అనుకోరు మా గురువుగారు. మన ఊరి ప్రోగ్రాం కనుక ఓ మూడు వేలు ఆకుమడతలో ఉంచండి రామకోటిగారూ!" నిర్మొగమాటంగా చెప్పాడు నాదబ్రహ్మం. ఆ రేటు ఎక్కువగా అనిపించినా, ఆంధ్రదేశంలో మేటి విద్వాంసుడు మాధవయ్యగారు అడగ్గానే ఒప్పుకున్నారు ఒక విశేషం. ఆయన తప్ప మరొకరు శ్రీవాణి పక్కన వాయించటానికి భయపడతారు. అలాంటప్పుడు రేటు చూసే అవసరం కనిపించలేదు రామకోటిగారికి.

"మరి నాకు శలవిప్పిస్తారా!" అంటూ నమస్కరించి వెళ్లిపోయారు రామకోటి గారు.

రెండువేలు రేటు ఎందుకు పెంచావని మాధవయ్యగారు కోప్పడలేదు నాదబ్రహ్మాన్ని. శ్రీవాణి సరసన వాయించగలవాడు తనొక్కడే. అటువంటప్పుడు ఐదు కాదు పది అడిగినా చచ్చినట్లు ఇస్తారు. గర్వంగా నవ్వుకున్నారు మాధవయ్యగారు మనసులో. ఆయన మనసులోలాగే శివాలయంతో అవిరామంగా మ్రోగుతున్న గంటలు వినిపించాయి. "ఈ శివరాత్రి ఎప్పుడూ లేనంత గొప్పగా పూజలు చేస్తున్నార్ట శివాలయంలో. అభిషేకం, పూజ ముగిసినట్లుంది" అన్నాడు నాదబ్రహ్మం. మాణిక్యాల్లో నూనెపోస్తూ.

"మరే! ఈ శివరాత్రిలో ఏదో ప్రత్యేకత ఉన్నట్లే ఉంది." అనుకున్నారు నటరాజుకు నమస్కరిస్తూ మాధవయ్యగారు. ప్రతి సంవత్సరం రాత్రి జాగరణ చెయ్యటం అలవాటు. కాని అందరిలా హరికథలు పురాణ కాలక్షేపాలతో జాగరణ చెయ్యరు మాధవయ్యగారు. రాత్రంతా మృదంగం వాయిస్తూ జాగరణ చేస్తారు. కాని ఈ రోజెందుకో పరమసంతోషంగా ఆ ఆనందంలో మృదంగం వాయించుకోవాలన్న ధ్యాసే కలగటంలేదు. తను ఈరోజు చూసిన అపురూప దృశ్యం మరచిపోదామన్నా మరపు రావటంలేదు. అది కలా? నిజమా? అన్న భ్రమ కలుగుతోంది. తన కళ్ళతో తను చూసింది తన చెవులతో తను విన్నదీ కట్టుకథలా నమ్మశక్యంకాకుండా ఉంది.

తను చూసింది పొద్దుటైనా అప్పుడు తన కళ్ళముందు జరుగుతున్నట్లుగా అనిపించింది మాధవయ్యగారికి. ఏదో గర్వం, అతీతమైన ఆనందం కలిగింది.

## 2

మాధవయ్యగారు విజయనగరం ప్రోగ్రాముకు వెళ్ళొచ్చినప్పటినుంచీ చలి జ్వరంతో బాధపడుతున్నారు. నాలుగు రోజులుగా మూసిన కన్ను తెరవటం లేదు. ఈరోజే కాస్త తేలిగ్గా ఉన్నట్లుంది. కాని చాలా నీరసంగా బలహీనంగా ఉన్నారు.

"గురువుగారూ! కొంప మునిగింది! ఈ రోజు మన 'కదన, కుతూహలం....' ఉన్నా ఎలా?" పొద్దున్నే కాలండరు తిప్పుతూ అన్నాడు నాదబ్రహం గాభరాగా.

"కదనకుతూహల మేమిట్రా? అంత కొంప ఏం మునిగిందిప్పుడు ?" మాధవయ్యగారు నీరసంగా అడిగారు.

"ఏం జరిగిందా! ఇవాళ ఏప్రిల్ ఫస్టు." మాధవయ్యగారు షాకు తిన్నారు, ఆమాట వినగానే. కచేరీ సంగతి, శ్రీవాణి సంగతి, తను ఎడ్వాన్సులాంటి మొత్తం డబ్బు తీసుకున్న సంగతి జ్ఞాపకమొచ్చి ముచ్చెమటలు పోశాయి.

"ఇప్పుడెలా ? నేను లేచి కూర్చునే స్థితిలో కూడా లేను. వాయించటం మాట

చెప్పాలా ! వాయించకపోతే ఎలా ? ఎడ్వాన్సు కూడా తీసుకుని మోసం చెయ్యటం తనకో మాయని మచ్చగా నిలుస్తుంది." మాధవయ్యగారి ఆలోచనలు స్తంభించిపోయాయి. నీరసం ముంచుకొచ్చింది.

"ఒరే, నాదం ! కాసిని పాలు పట్రారా ! కళ్ళు తిరుగుతున్నాయి" అన్నారు.

"అలాగే ! బేగడ నాకు, దేవగాంధారి మీకు" అంటూ లోపలికి వెళ్ళాడు.

అంత నీరసంలోనూ మాధవయ్యగారికి నవ్వొచ్చింది.

"ఓరినీ సంగీత పాండిత్యం పాడుగాను. బేగడరాగం మీగడలా ఉంటుందని అనుకుంటే విన్నట్టున్నాడు. దేవగాంధారి రాగంలో క్షీరసాగరశయన అనే కీర్తన ఉందని తెలుసు కాబోలు. రెండూ కలిపి సంగీతభాష చేశాడు. పోన్లే మృందగం రాకపోయినా నా వెంట వెంట తిరిగి సంగీతపరమైన విషయాలు నేర్చుకుంటున్నాడు గొప్పే !" అనుకున్నారు, నాదబ్రహ్మం తెచ్చిన పాలు తాగుతూ.

అంతలో ఎవరో వచ్చిన అలికిడి అయి తల తిప్పారు పక్కకు. తెల్ల పంచె తెల్లలాల్చీ లోంచి పెద్ద బొర్ర మనిషి కాస్త మోటుగా లావుగా ఉన్న పెద్దమనిషిలా కనిపించాడు. అతన్ని మాధవయ్యగారు ఎప్పుడూ చూడలేదు. చూసినా జ్ఞాపకం రావడంలేదు.

"నమస్కారం మాధవయ్యగారూ !" అన్నాడాయన మాధవయ్యగారు తనవంక చూడగానే.

"నమస్కారం. రండి," అంటూ "నాదం ! ఆ కుర్చీ ఇలా నా మంచం దగ్గిరగా వెయ్యి నాయనా !" అన్నారు. ఆ వచ్చినాయనే కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు.

ఆ వచ్చినాయన ముఖంలో భయం, ఆందోళన గమనించారు మాధవయ్యగారు. ఆ వచ్చిన వ్యక్తి ఎవరో చూచాయగా అంచనా వేసుకున్నారు.

"ఒంట్లో బాగాలేనట్లుంది? జ్వరమా? చాలా నీరసంగాకూడా ఉన్నట్లున్నారు?" ఆ వచ్చినాయన మనసులో ఆందోళనంతా మాటల్లో వ్యక్తపరిచాడు.

"మరే.... అన్నట్లు మీరు...." తన అంచనా కరక్టు అవునో! కాదో! అన్నట్లుగా అర్ధోక్తిలో ఆగారు మాధవయ్యగారు. దానికి సమాధానంగా ఆ వచ్చిన వ్యక్తి సంచీలోంచి ఇన్విటేషన్ కార్డు తీసి మాధవయ్యగారికిస్తూ,

"నా పేరు కోటేశ్వరరావు" అన్నాడు. ఆ కార్డు చదివితే నేను వచ్చిన పని, వివరాలు మీకే తెలుస్తాయన్నట్లుగా. నాదబ్రహ్మం కళ్ళజోడు తీసి ఇచ్చాడు. మాధవయ్యగారు ఇన్విటేషను చదువుతుండగానే,

"టిక్కెట్లు బాగా అమ్ముడుపోయాయి." మీరు రాకపోతే కొంపమునుగుతుం దన్న అర్థం వినిపించింది మాధవయ్యగారికి ఆయన మాటల్లో.

"వారం రోజుల్నించీ చలిజ్వరం. ఈ రోజే కాస్త తగ్గింది." అన్నాడు నాద బ్రహ్మం మాధవయ్యగారికి మందు ఇస్తూ మీరేం చెప్పినా లాభంలేదన్నట్లుగా. ఆ మాటవినగానే పాపం ఆ వచ్చినాయన కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. మాధవయ్యగారికి జాలేసింది. తన పరిస్థితి అగమ్యగోచరంగా అనిపించింది. మాధవయ్యగారు లేవబోతుంటే, వారిస్తూ:

"మీరు విశ్రాంతి తీసుకోండి. మీకు ఇన్విటేషనిచ్చి సాయంత్రం కారు పంపుతామని చెప్పటానికి వచ్చాను. అంతే. మన ఊళ్ళో శ్రీవాణి సరసన వాయించగల మృదంగ విద్వాంసులే లేరు, మీరు తప్ప. భగవంతుడి దయవల్ల ఆ రోజు మీరు ఖాళీగా దొరకటం మా అదృష్టంగా భావించాం. కాని...." ఇప్పుడు మీదే భారం. పాలను ముంచుతారో నీటను ముంచుతారో! అన్నట్లు ఏడవలేక నిస్సహాయంగా చూశాడు కోటేశ్వరరావుగారు.

కొద్దిసేపు దీర్ఘంగా ఆలోచించారు మాధవయ్యగారు. ఏంచెయ్యాలి? ఎలా? ఈ ఆపద గడిచేదెట్లా శ్రీనివాసా? అని దైవాన్ని ప్రార్థించారు. మెరుపులా ఆలోచన తట్టింది. కళ్ళు మెరిశాయి.

"కోటేశ్వరరావుగారూ! మీ బాధ నాకు తెలుసు. మీరేం బాధపడకండి. మీ కార్యక్రమం దిగ్విజయంగా నడిపించే భారం నాది." అని హామీఇచ్చారు. మాధవయ్యగారు. మాధవయ్యగారి దగ్గర శలవుతీసుకుని వెళ్ళిపోయారు కోటేశ్వర రావుగారు.

కోటేశ్వరరావుగారు వెళ్ళిపోగానే, మెల్లగా లేచి కూచుని,

"నాదం! ఈ ప్రోగ్రాం దిగ్విజయంగా జరగాలంటే నీవు నాకు సహాయం చెయ్యాల్రా!" అన్నారు.

"నేనా" అన్నాడు నాదబ్రహ్మం.

"అవును. వాయించే వ్యక్తిని పిలుచుకు రావాలి. అదే నువు చేయవలసిన సహాయం." అన్నారు మాధవయ్యగారు.

"చెప్పండి. ఆ మనిషి ఎక్కడున్నా సరే, గాలంవేసి వెతికి తీసుకొస్తాను" అన్నాడు.

"గాలం వేయక్కర్లేదు. మొన్న నువు చెప్పావే! బ్రిడ్జిదగ్గర. పోచమ్మ గుడి వెనకాల...." మాట పూర్తిచెయ్యక్కర లేకుండానే.

"ఆ! తెలిసిపోయింది. తెలిసిపోయింది. ఆ మనిషిని తీసుకురావాలి? అంతేగా!" అంటూ వెంటనే బయలుదేరాడు నాదబ్రహ్మం.

* * *

ఆ రోజు మహాశివరాత్రి పర్వదినం. మాధవయ్యగారి మనస్సులో జ్ఞాపకాలు పురివిప్పినాయి. తను పొద్దున్నే లేచి స్నానంచేసి నటరాజ స్వామివారి పూజ ముగించి కర్పూరహారతి వెలుగులో ఆ నటరాజుని ఆపాదమస్తకం చూస్తూ మనసారా వేడుకుని, నాదబ్రహ్మని హారతి అద్దుకోమనగానే, నాదబ్రహ్మం చెవి కింద చెయిపెట్టి ఏదో వింటున్నట్లు పరవశించిపోతూ కనిపించాడు.

అతను వినేది ఏమిటో! తనకు వినపడక తనూ ఆలకించాడు. కాని తనకేమీ వినపడలేదు. తనకు వినిపించని ఏదో దివ్యశబ్దనాదాలు నాదబ్రహ్మం వింటున్నాడనిపించి,

"ఏమిటీ నాదం! అంత శ్రద్ధగా వింటున్నావ్!" అని తను అనగానే.

"వింటంలేదండి. వినిపిస్తున్నాయ్. ఆ నాదం ఒక్కమాటు వింటే చాలు, భూపాలరాగంలా నిద్ర మెలుకువ వచ్చేస్తుంది. మలయమారుతం వీచినట్లుగా ఉంటుంది. చక్రవాకం పలికినట్లు, ఆ మోహన నాదం పగపట్టిన శంకరాభరణంలా వెంటవెంట తిరుగుతుంది. అంత చక్కని వాయిద్యం ఇంతవరకూ నేను వినలేదంటే నమ్మండి. నా జీవితంలో మొట్టమొదటిసారి అంత గొప్ప మృదంగ వాద్యం విన్నాను. నా జన్మ తరించింది. ఉష్! మాట్లాడకండి మళ్ళీ మళ్ళీ వినాలి ఆ నాదం" అన్నాడు.

నాదబ్రహ్మం మాటల్లో ఏదో చురక అంటించినట్లైంది తనకు. నాదబ్రహ్మం సాధారణంగా ఎవరినీ పొగిడినట్లు వినలేదు తను. అసలు పొగిడే స్వభావంకాదా కాదు. నాదబ్రహ్మం చిలిపిగా అంటున్నాడేమో! అనిపించి మళ్ళీ రెట్టించి అడగాలనిపించింది. అప్పుడప్పుడు నాదబ్రహ్మం చిలిపిగా ప్రవర్తిస్తుంటాడు. అందుకే.

"ఏం నాదం! ఆ నాదం ఎక్కడనుంచి వస్తోంది? నువ్వెప్పుడు విన్నావ్?" అని అడిగాడు తను.

ఆ వాయించేది ఎవరో! ఊరు పేరు ఏమీ వివరంగా చెప్పలేదు. అసలు తెలుసుకోనేలేదుట. కాని నాదబ్రహ్మం చెప్పిన ఆనవాళ్ళుపట్టి ఆ వ్యక్తి ఎవరో చూడాలనిపించి బయలుదేరాడు. నాదబ్రహ్మనికి తనెక్కడికి వెడుతున్నదీ కూడా చెప్పబుద్ధికాలేదు. ముందు ఆ మనిషిని చూడాలనేది ఒకటే కోరిక. కారుకూడా తీసుకెళ్ళకుండా కాలినడకన, ఒంటరిగా బయలుదేరా.

నిజానికి ఆ ప్రదేశం కనుక్కోవడం ఏమంత కష్టంకాలేదు.

ఆ మృదంగ నాదం ఒక గుడిశలోంచి వస్తోంది. అక్కడ ఆగిపోయాడు తను. లయ విన్యాసతరంగాలు ఆపేశాయి. గుడిశ పెద్దది కాకపోయినా గుడిశ ముందు శుభ్రంగా అలికి ముగ్గులెట్టి చూడముచ్చటగా ఉంది. తడిక తలుపు ఓరగా ఉంది. ధైర్యంచేసి మెల్లగా తొలిగించి చూశాడు తను. లోపల నవయువకుడు. నవమృదంగాలు వరుసగా పెట్టుకుని ఏకాగ్రతతో సాధనచేస్తున్నాడు. తాండవం చేస్తున్న శివుడిలా కనిపించాడా యువకుడు. జటాజూటంనుండి లలాటఫలకం నుండి జారి ముద్దులు కురిపిస్తూ ఒడలంతా తడిమి తడిమి మురిసిపోతున్న గంగమ్మలాగా, అతని తలలోనుంచి స్వేదం కిందకు జారి ప్రవహిస్తోంది. అతన్ని పిలిచి పలకరించాలని అనిపించలేదు తనకు. సాధనా భంగం కావిస్తే పరమ శివుడు ఆగ్రహించి మన్మథుడ్ని భస్మంచేసినట్లు తనని భస్మం చెయ్యక పోయినా, అతని సాధనకు అంతరాయం కలిగించా లనిపించలేదు. అలా ఎంత సేపో పరవశించి వింటూ, మైమరచిపోయి, కాలగమనం తెలియకుండా నడి నెత్తిన ఎండ చుర్రుమంటున్నా తను అలానే నిలిచిపోయాడు. చాలా సేపటికి అతని సాధన ముగించాడు కాబోలు, అప్పుడు కళ్ళు తెరిచాడతను. మెచ్చుకో కుండా ఉండలేకపోయాడు. చిన్నవాడిని దీవించాలనిపించినా మెచ్చుకున్నారు. "శెభాష్. ఏక మృదంగ సాధనే కష్టతరమని అహోరాత్రులు సాధన చేస్తారు. అటువంటిది ఏకకాలంలో నవ మృదంగాలు సాధనచెయ్యడం అపూర్వం. అమోఘం. అనన్యం. నువు సామాన్యుడివీ మానవమాత్రుడివీ కావు. నాయనా! ధన్యుడివి." తనకు తెలియకుండానే పొగట్టం జరిగింది అతన్ని.

తన మాటలు విని అప్పుడే తపస్సునుంచి మేల్కొని కళ్ళు తెరచిన మౌనిలా ఆ యువకుడు దగ్గరకొచ్చి పరమానందంతో, కాళ్ళకు నమస్కరించి "గురుర్ బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః. గురుర్ సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః" అంటూ కాళ్ళను అద్దిన చేతులు కళ్ళపైన భక్తితో అద్దు కున్నాడు. అతను అలా శ్లోకం చదువుతుంటే ఏదో పవిత్రమైన అనుభూతి, ఆనందం కలిగింది. అతను శిష్యుడిలా తను గురువుగా, అతను భక్తుడుగా తను భగవంతుడుగా అనుభూతి కలిగింది. అతడు పుత్రుడుగా తను తండ్రిగా అని పించింది.

"నాయనా! ఎవరు నువ్వు? నీ పేరేమిటి? ఇంత అపురూపమైన లయజ్ఞాన సంపద ఎలా సంపాదించావు? ఎక్కడ సంపాదించావు? నీకు విద్య గరపిన

గురువులు ఎవరో ! ధన్యాత్ములు. వయసులో పిన్నవాడివైనా, విద్యలో శిఖరాగ్రాన నిలచిన నిన్ను ఎలా దీవించాలో, అభినందించాలో అర్థంకావటంలేదు నాయనా !" అంటూ ఏరి ఏరి కూర్చి మాలగా అల్లిన పదాలతో "నీ కీర్తి చంద్రికలు సజ్జన హృదయాల్లో సజీవంగా కలకాలం నిలవాలి" దీవనలాంటి అభినందన వాక్యాలు పలికారు. నా మాటలు వినగానే ఆ యువకుడు అమాంతం నా కాళ్ళమీద వాలి తన అశ్రువులతో నా కాళ్ళు కడిగాడు. భక్తి, వినయం, విధేయతలు ఉట్టిపడుతున్న హృదయ పీతాంబరంతో నా కాళ్ళు అతి మెత్తగా అద్దాడు. చల్లని చూపుల మల్లెలమాల నా నిలువెత్తు హారంగా చేసి నా మెడలో వేశాడనిపించింది. అతని పరవశించిపోతున్న కన్నుల కాంతులు చూస్తుంటే హృదయ నీరాజనం పడుతున్నాడా ! అనిపించింది. భక్తుని భక్తికి భయంతో నిలచిన భగవంతుడిలా కదలలేకపోయాను. అదొక అపురూప పూజా సన్మానం అనిపించింది. అతనిని నా చేతులతో లేవనెత్తాలనిపించింది. ఆ క్షణంలో నేను ఉన్నతుడినని అతను అధముడని అనిపించలేదు ఎందుకో.

"నాయనా ! నీ గురుదేవు లెవరో తెలుసుకోవచ్చా ?" అని అడగకుండా ఉండలేకపోయాను. ఆ యువకుడు భక్తి వినయాలు ఉట్టిపడే స్వరంతో మర్యాదగా, "లోపలికి రండి" అంటూ ఆహ్వానించాడు లోపలికి దారితీస్తూ. తనకా గుడిశలోకి వెళ్ళాలనిపించకపోయినా కాళ్ళు తనకు తెలియకుండానే అతని వెంట నడిచాయి. గుడిశంతా నా కళ్ళు కలయచూశాయి. గుడిశ పెద్దది కాదు. అంత వెలుతురు కూడా లేదు. చుట్టూ మట్టిగోడలు. గోడలనిండా ఏవో కాగితాలు అంటించి ఉన్నాయి. ఆ కాగితాల పైన ఏవో బొమ్మలు ఉన్నాయి. కాని అవి ఇదమిద్ధమని స్పష్టంగా తెలియటంలేదు. కారణం దుమ్ముకొట్టుకుని పొగ చూరిపోయి ఉన్నాయి. ఒక కాగితానికి మాత్రం పూలహారం వేసి పసుపు కుంకం బొట్లు కనిపించాయి. ఆ బొమ్మ ముఖంకూడా కనిపించటం లేదు. అగరొత్తుల పొగచూరి నల్లగా ఉంది. కాని మృదంగం ఆకారం మాత్రం అస్పష్టంగా కనిపిస్తోంది. అతనే అతని గురువై ఉండొచ్చు ననుకున్నాడు. ఆ యింట సరస్వతి తప్ప లక్ష్మి కనిపించటం లేదు. పేదరికం ఓలలాడుతోంది. నేను లోపలికి వెళ్ళగానే ఆ యువకుడు ఆ బొమ్మ మెళ్ళోఉన్న పూలమాల తెచ్చి నా మెళ్ళో వేసి నమస్కరించాడు. దాని అర్థం ఏమిటో అతను చెప్పలేదు కానీ, నేనే ఊహించాను.

"ఈ హారం ప్రాణంలేని పటాని కెందుకు ? ఎదురుగా మీ రుండగా !" అన్నట్లు అనిపించింది నాకు. ఆశ్చర్యంతో పులకించిపోయాను.

"నీ గురువును నేనా?" అన్నట్లు ప్రశ్నించాను ఆపుకోలేక.

ఔనన్నట్లు తలూపాడు అతను కూడా. అప్పుడు నా ఆశ్చర్యానికి అంతులేదు. కాని ఆ యువకుడు ఎవరో! తన దగ్గిర ఎప్పుడు విద్య నేర్చుకున్నాడో ఎంత ఆలోచించినా జ్ఞాపకం రాలేదు. పేరు అడిగా.

"శ్రీనివాసులు" అన్నాడు వినయంగా.

"నాయనా శ్రీనివాసులూ! ఇది కలో! నిజమో! నేను తెలుసుకోలేకుండా ఉన్నాను. నేను ముందెన్నడూ నిన్ను చూడలేదు సరికదా! నీ పేరు కూడా విని ఉండలేదు. నేను నీకు గురువు నెలా అవుతాను విద్య నేర్పకుండానే?" అని అడుగుతుంటే అతనికి గాని మతిభ్రమణ కలిగిందేమో నన్న అనుమాన కలిగింది. అతన్ని పరిశీలనగా చూశాను. వయసు సుమారు పాతికేళ్ళుంటాయి. పెద్ద పొడుగూ కాదు. పొట్టీ కాదు. అందంగా ఆరోగ్యంగా ఉన్నాడు. కండలు పెరిగిన దండలు అతని సాధనాసంపత్తికి చిహ్నాంగా కనిపించాయి. అమాయకమైన అతని కళ్ళలో తెలివి, మెరుపు కనిపించాయే తప్ప, పిచ్చిచూపు కాదు. అతన్ని పిచ్చివాడని ఊహించిన నేనే పిచ్చివాణ్ణనిపించింది.

"ఇతని గురువును పోలిఉన్నానేమో! అతను భ్రమపడుతున్నాడేమో?" అని కూడా అనిపించింది.

"నాయనా శ్రీనివాసులూ! పెద్దతనం జ్ఞాపకశక్తిని తగ్గిస్తుందే కాని, ఇనుమడింప చెయ్యదు కదా! రా నాయనా! ఒక్కమారు నా దగ్గిరగా రా నాయనా! నిన్ను నా హృదయానికి దగ్గిరగా తీసుకోనీ" అంటూ శ్రీనివాసుల్ని కౌగలించుకున్నారు. ఈ హఠాత్సంఘటనకు శ్రీనివాసులు ఉబ్బితబ్బిబ్బైపోయాడు బహుశః నేను అలా తనని ఆలింగనం చేసుకుంటానని ఊహించి ఉండడు పాపం. పరవశంతో నా కౌగిలిలో ఒదిగిపోయి ఆనందభాష్పాలు రాల్చాడు. విద్యకు కుల, మత, లింగ బేధాలు కానీ వయోబేధం కానీ లేదుకదా! నా కళ్ళు కూడా వర్షించాయి. అతని కౌగిలిలో ఏదో విద్యుత్ ప్రవహించింది నా శరీరంలో.

అతను మట్టిలో మాణిక్యం.

మాధవయ్యగారి ఆలోచనలకు అంతరాయంగా, "పిలిపించారుట?" అన్నమాట వినిపించింది. ఉలికిపడి చూశారు మాధవయ్యగారు. శ్రీనివాసులు గది గుమ్మం దగ్గర వినయంగా నుంచున్నాడు. నాదబ్రహ్మం గర్వంగా "పని సాధించుకొచ్చా చూసోండి" అన్నట్లు చూస్తున్నాడు. మాధవయ్యగారి ఆనందానికీ ఆశ్చర్యానికీ అంతులేదు.

"అయితే నామాట మన్నించి వచ్చాడన్నమాట" అనుకున్నారు సంతోషంగా.

"రా నాయనా!" అంటూ తన మంచం పక్కనున్న కుర్చీ చూపించారు.

అసలు ఆయన పిలువనంపారనగానే శ్రీనివాసులుకు ఆశ్చర్యం కలిగింది. అందునా ఇంట్లోకి తీసుకొచ్చాడు నాదబ్రహ్మం. ఇప్పుడు మాధవయ్యగారే స్వయంగా తన గదిలోకి పిలిచి తన ఎదుటనున్న కుర్చీలో కూచోమని చూపించగానే అతనికి భయం వేసింది. ఒణుకు పుట్టింది. అతనెప్పుడూ పెద్దల ఎదుటికి రాలేదు. పెద్దల ఎదుట కూర్చోలేదు. అందులో గురుతుల్యులు మాధవయ్యగారి ఎదుటికి రావాలంటేనే బిడియంగా అనిపించింది. లోపలికి రాకుండానే,

"ఫరవాలేదు. పిలిచారుట." ఇంకా ఎలా అడగాలో తెలియక ఊరుకున్నాడు. మాధవయ్యగారికి అతని వినయం చూస్తుంటే ముచ్చట కలిగింది. ముద్దొచ్చుకో బుద్ధి అయింది. మాధవయ్యగారే మెల్లగా లేచి హాల్లోకి వచ్చి తన ఆసనంపైన కూర్చుని శ్రీనివాసుల్ని కూడా కూచోమని సోఫా చూపించారు. నాదబ్రహ్మానికి ఒళ్ళు మండింది.

"పెద్దవాళ్ళ ఎదుట సోఫాలో కూర్చోడు అతను. ఆ చాపమీద కూర్చుంటే ఎత్తునున్న మీరు బాగా కనిపిస్తారు," అంటూ "ఆ చాపమీద కూర్చో" అన్నాడు. శ్రీనివాసుల్తో ఆ మాత్రం గౌరవం అతనికి చాలన్నట్లుగా. శ్రీనివాసులు అవేమీ పట్టించుకోలేదు. చాపమీదే కూర్చున్నాడు.

"శ్రీనివాసులూ! నువ్వు ఇవాళ నాకో సహాయం చెయ్యాలి నాయనా!" అన్నారు ఉపోద్ఘాతంగా. మాధవయ్యగారు శ్రీనివాసుల్ని పేరెట్టి పిలవగానే నాదబ్రహ్మం ఆశ్చర్యపోయాడు.

"ఇతనెవరో నేనే చూడలేదే! ఇతనెవరో తెలియకుండా గురువుగారికి పేరేలా తెలిసింది? ఇతను ఇంతకుముందు గురువుగారికి పరిచయస్తుడా? మరైతే ఎప్పుడూ ఇక్కడికి రాలేదు. గురువుగారూ చెప్పలేదే?" మనసులో కలుగుతున్న సందేహాలను తనలోనే అణచుకుంటూ వారిద్దర్నీ చూస్తూ, వారి మాటలు వింటూ కూర్చున్నాడు నాదబ్రహ్మం.

"సహాయమంటే సహాయం కాదనుకో! అన్నట్లు ఇదివరలో ఎప్పుడైనా కచేరీలకు వాయించావా?"

లేదన్నట్లు తల ఊపాడు శ్రీనివాసులు.

"మరి వాయిస్తావా? నువు వాయించగలవు... నీ కాశక్తి ఉంది. కాకుంటే

కాస్త జాగ్రత్తగా అనుసరిస్తే సరి." కచేరి మెళకువలు చెప్పారు మాధవయ్య గారు.

"అమ్మ అమ్మ! ఈ మనిషి మీ కిదివరకే తెలిసి మాటమాత్రం చెప్పలేదంటే ఇందులో ఏదో రహస్యం ఉండి ఉంటుంది" అనుకున్నాడు నాదబ్రహ్మం.

"ఇవాళ సాయంత్రం ఒక కచేరీలో నువు వాయించాలి. నీ శక్తి సామర్థ్యాలన్నీ ప్రదర్శించి మెప్పించాలి. నాకు పేరు తేవాలి," అన్నారు మాధవయ్యగారు అసలు విషయం బయటపెడుతూ.

నాదబ్రహ్మానికి ఆ చోట నిలువబుద్ధి కాలేదు. వెంటనే చివ్వున లేచి లోపలికి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత మాధవయ్యగారూ శ్రీనివాసులూ ఏవేవో మాట్లాడుకున్నారు. అవేవీ వినబుద్ధికాలేదు నాదబ్రహ్మానికి. శ్రీనివాసులు వెళ్ళిందాకా బయటికి కూడా రాలేదు.

"అక్కడెక్కడో ఎవరో గొప్పగా వాయించాడంటే మాధవయ్యగారు అసూయపడతారనీ, అప్పుడు తను చూసి ఆనందించాలనీ కచ్చితో శ్రీనివాస ఉదంతం చెప్పాడే కానీ, మాధవయ్యగారు వాణ్ణి నెత్తినెక్కించుకుని పూజిస్తారనుకోలేదు నాదబ్రహ్మం. తాను ఊహించింది తారుమారైంది. అది సహించలేదు నాదబ్రహ్మం. తను తలచింది తలచినట్లే జరగాలనుకునే మనిషి నాదబ్రహ్మం. అలా జరగనప్పుడు దాన్ని పగగా మార్చుకునే తత్వం కూడాను.

8

ఇంటికి తిరిగొస్తూనే తాతకాళ్ళకు దణ్ణంపెట్టాడు శ్రీనివాసులు. తల్లీ తాతా ఇద్దరూ శ్రీనివాసులు ఎందుకు దణ్ణంపెడుతున్నాడో అర్థంకాక తికమకపడ్డారు.

"ఏట్రా అబ్బీ! ఏటి సంగతి? ఈ దణ్ణాలేంట్రా?" శ్రీనివాసులు దణ్ణం పెడుతుంటే ఏమనాలో గబుక్కున తోచక తల నిమిరాడు తాత. తాత మంచం మీద కూర్చుంటూ,

"తాతా! సాయంత్రం కచేరీలో నేను మృదంగం వాయించాలిట" అన్నాడు. ఆమాట వినగానే తాత ఆనందానికి పట్టపగ్గాల్లేవు.

"ఓరన్నాత్రా అబ్బీ?"

"గురువుగారే తాతా!"

"అలాగా! నాకు తెల్సురా అబ్బీ! ఏదో ఒక రోజున ఈ రోజు వచ్చుద్దని నాకు తెల్సురా! శివరాత్తిరినాడు శివుడులా గురువుగారు మనింటి కొచ్చిన్నాడే

అనుకున్నా(్రా నీ జాతకం మారిపోద్దని. అన్నట్టు గురువుగారు నిన్ను లోనికి రానిచ్చి్రా? నువ్వా గుడిశలో ఎందుకున్నావని అడిగారా? సీతమ్మ ఓరని అడిగారా?" అని ఆత్రంగా అడిగాడు. తాత మనసులో మరో ప్రశ్న గొంతులోనే ఆగిపోయింది. ఆ ప్రశ్న శ్రీనివాసులికి తెలుసు.

"అడిగారు తాతా! నువ్వెవరని కూడా అడిగారు" అన్నాడు తాత కళ్ళల్లోకి చూస్తూ. శ్రీనివాసులు ఏం సమాధానం చెప్పాడో వినాలని పరవళ్ళు తొక్కింది తాత మనసు.

"ఏమని చెప్పావురా అబ్బీ?" ఆశగా అడిగాడు తాత.

"ఏమని చెప్పానా! మా తాత నా దేముడని చెప్పా తాతా! నా దేముడివి నువ్వే కదూ?" శ్రీనివాసులు ఆమాట అంటుంటేనే కళ్ళనీళ్ళు తిరిగాయి శ్రీనివాసుల కళ్ళల్లో. శ్రీనివాసులు కళ్ళల్లో తిరిగిననీళ్ళు చూడగానే తాత కళ్ళు నిండిపోయాయి.

వారిద్దర్నీ చూస్తుంటే సీతమ్మ కళ్ళు తనకు తెలియకుండానే నీళ్ళు కార్చాయి.

"గురువుగారు నన్ను దీవించారు తాతా! దీవించారు." శ్రీనివాసులు తాత కాళ్ళమీద తల ఆన్చి సంతోషంగా అన్నాడు. ఆ మాట విని సీతమ్మ నొసలు చిట్లించి గబగబా ఉప్పుచట్టిలోంచి ఓ గుప్పెడు ఉప్పు పట్టుకొచ్చింది.

"ఆరి దీవనే నిన్ను నూరేళ్లు సల్లగా కాపాడుతుందిరా అబ్బీ! ఆరి మాటకి ఎప్పుడూ ఎదురు సెప్పమాక. ఆరు సెప్పింది ఏదం అనుకో" అన్నాడు తాత మనవడికి బుద్ధులు చెపుతూ.

"సాల్లే సంబడం. తాత కాలిమీంచి లేసి కూసో. దీవించారంట దీవించారు. నరుడికంట నల్లరాల్లు పగుల్తాయంట. దిట్టి తియ్యనీ" అంటూ ఛీదిష్టి, పోదుష్టి. ఇరుగుదిష్టి పొరుగుదిష్టి, తల్లిదిష్టి, తండ్రి...."

సీతమ్మకి దుఃఖం పొల్లుకొచ్చింది ఆ చివరిమాట అంటుంటే. మళ్ళీ తనకు తానే సంబాళించుకుని ఎడంచేత్తో మూడుమాట్లు శ్రీనివాసులి తలచుట్టూ తిప్పి ఆ ఉప్పుగడ్డలు తీసికెళ్ళి పొయిలో పోసింది. అవి టపటపమని పేలలేదు. సీతమ్మ బుగ్గలు నొక్కుకుంటూ,

"చూశావంట్రా. ఎంత దిష్టి తగిలిందో! సర్లే లెగండి. అన్నాలుతింటూ కబుర్లాడుకుందురుగాని తాతా మనవడూను." అంటూ ఇద్దరికీ కంచాలుపెట్టి అన్నం వడ్డించింది సీతమ్మ.

"ఒరే సీనూ! తాతకి మొక్కురా! తాత దీవిత్తే నీ యిల్లు, నీ బతుకే బంగార మౌతుందిరా!" అంది సీతమ్మ.

తాతకి పట్టరాని సంతోషం కలిగింది. ఆ సంతోషం పట్టలేక దుఃఖంకూడా వచ్చింది. కళ్ళు తుడుచుకుంటూ, "ఏటమ్మా! ఆడు నాకు మొక్కకుంటే నేను దీవించనా?" అంటూ శ్రీనివాసుల్ని అమాంతం తన మంచం దగ్గరకు లాకెళ్లాడు. తను ఆ మంచం ఎక్కి అమాంతం ఎగిరి శ్రీనివాసుల్ని వాటేసుకుని మూతంతా ముద్దులవర్షం కురిపించాడు. శ్రీనివాసుల్ని తాత కౌగిలించుకున్నట్లుగాలేదు. శ్రీనివాసులు తాతని ఎత్తుకున్నట్లుగా కనిపించింది సీతమ్మకి. తాతని గట్టిగా పట్టుకుని ముద్దెట్టుకున్నాడు శ్రీనివాసులు, పసిపిల్లవాడ్ని ముద్దెట్టుకున్నట్లుగా.

"ఒరే! శీనూ! తాతని అలాగే చంకనేసుకుని ఎత్తుకోవాల్రా. తాత వయసుడిగి పసిపిల్లాడైపోతున్నాడు. ఇంక నువ్వే తాతని సాకాల, ఆడించాల, నవ్వించాల. నువ్వే తాతకి తాత కావాల్రా" అంది సీతమ్మ నవ్వుతూ. తాత శ్రీనివాసులు చంకలోంచి మెల్లగా కిందకుజారి,

"సరిసరి. మనం ముచ్చట్లాడుకుంటా కూకుంటే ఆడకచేరి అయిపోద్ది. "ఒరే అబ్బీ! అమ్మకి దణ్ణంపెట్టు. అమ్మ తరవాతేరా ఏ దేముడైనా" అని తాత చెప్పినట్లుగానే సీతమ్మకి దణ్ణంపెట్టాడు శ్రీనివాసులు. భాష, మాటలు పొందిక తెలియని సీతమ్మ ఒద్దికగా మనసులోనే దీవించింది కొడుకుని. ఆనందభాష్పాలు తలపై రాల్చి దీవించింది. తాత రిక్షాపిలుచుకుని వచ్చాడు. మృదంగం తన తలపై పెట్టుకుని,

"సీతమ్మా! అబ్బిగాడెడతన్నాడు. ఎదుర్రామ్మా!" అన్నాడు. ఎవరైనా వెడుతుంటె ఎట్లాంటివాళ్ళు ఎదుర్రావాలో తాతకి తెలియనందుకు చిరాకుపడింది సీతమ్మ. "ఛీ! ముండరాల్ని నన్ను శకునం రమ్మంటావేందయ్యా! ఓరన్నా ముత్తైదువని పిల్చుకు రావాలిగానీ" సీతమ్మ చిన్నబుచ్చుకుని కళ్ళ నీళ్ళెట్టుకుంది కొడుక్కు ఎదురుగా రాలేకపోతున్నందుకు. తాతకు తాటిప్రమాణాన కోపమొచ్చింది ఆ మాట వినగానే.

"ఏటి? నువ్వు ముండరాలా! తల్లిముండరాలా! ఏటమ్మా ఆ మాటలు. తల్లికంటే మంచి శకునం ఏడుంటదమ్మా! శుబంకోరే పెతోల్లూ మంచి శకునమే నమ్మా. నువ్వాడి సుకం కోరవా? నువ్వాడి సుకం కోరలేనని సెప్పెయ్యి. నేనే ఆడికి ఎదురొత్తా సీతమ్మ తల్లీ!" తాతలో సంస్కారాన్ని చూడనివారికి




తాత మనసు లోతు తెలియదు. తాత మాటల్లో నిజం సీతమ్మని కళ్ళాలేసి లాగాయి. వెంటనే కళ్ళు తుడుచుకుని నవ్వుతూ శ్రీనివాసులుకు ఎదురుగా వచ్చింది. తాత మృదంగం రిక్షాలో పెట్టాడు.

"తాతా ! నేను ముందుగా గురువుగారింటి కెళ్ళాలి. అక్కడనుంచీ గురువు గారు ఎలా చెపితే అలా చెయ్యాలి. నువ్వూ, అమ్మా త్యాగరాయ గానసభకు వచ్చేయండి" అంటూ రిక్షా ఎక్కాడు శ్రీనివాసులు.

"ఇవి జేబులో ఉంచు." అంటూ రెండు రూపాయల చిల్లరడబ్బులు శ్రీనివా సులు జేబులో పోశాడు తాత.

ఓ గంటముందే తాత సీతమ్మని తీసుకుని త్యాగరాయగానసభకు వెళ్ళాడు.

ఓ కార్లోంచి ఒక చక్కని చుక్కలాంటి అమ్మాయి దిగుతోంది. ఆమె వయసు సుమారు ఇరవై రెండో ఇరవైమూడో ఉంటాయి. కళ్ళు తిప్పలేని అందం. పిరుదులు దాటే శిరోజాలు. చక్కని కళ్ళు, మెరమెరా మెరిసిపోతోంది. ఆమె నిజానికి ఏ అలంకారమూ చేసుకోలేదు. కేవలం ఎర్రంచు తెల్లపట్టుచీర కట్టుకుంది. అదే రంగు ఎర్రజాకెటు వేసుకుంది. ఎర్రరాళ్ళ నెక్లెస్ పెట్టుకుంది. తలనిండా మల్లెపూలు పెట్టుకుంది. ఒంటినిండా పమిట కప్పుకుని నిండుగా ఉంది. కార్లోంచి దిగినవారివెంట లోపలకు వెళ్ళింది.

ఇంకా ఎవరికీ శ్రీనివాసులనే వ్యక్తి మృదంగం వాయిస్తున్నట్లు తెలీదు. మాధవయ్యగారి పేరే కాయితాల్లో రాశారు. అదే తెలుసు వారికి.

కాని మాధవయ్యగారి పక్కన శ్రీనివాసులుకి స్థానం లభించినందుకు తాత మనసు సంతోషంతో ఎగిరిపడింది.

లైట్లు వెలుగుతూనే ఉన్నాయి. తెర ఇంకా తొలగించలేదు. అంతలో "సభాసదులకు నమస్కారం" అంటూ వినిపించింది. ఒక్కొక్క లైటే ఆరుతుంటే తెర తొలిగింది. హాలంతా చీకటి. కాని స్టేజిమీద చుక్కల దీపారాధనమాత్రం వెలుగుతోంది.

"అంతా అంధకారమైనా, చిన్న వెలుగు ఆధారంతో ఎన్నో దీపాలు వెలిగించవచ్చు. వెలుగును పొందచ్చు" అంటూ వినిపించింది. స్టేజిమీద దీపాలు ఒకటొకటే వెలిగాయి. పగటి వెలుగులా కనిపిస్తోంది.

స్టేజిమీద ఎవరూ లేరు. వాద్య పరికరాలు పెట్టి ఉన్నాయి.

తాత, సీతమ్మ మెల్లగా గేటుదగ్గరకొచ్చి చతికిలబడ్డారు. వారిని గమనించలేదు గేటుదగ్గిర మనిషి. అతను కార్యక్రమం ప్రారంభమవగానే లోపలికి వెళ్ళిపోయాడు.

"ఈ రోజు మా కార్యక్రమంలో 'గానకళావాణి' కుమారి శ్రీవాణి గాత్ర సంగీతం." అనగానే ఇందాక చూసిన చక్కనిచుక్క వచ్చి సభకు నమస్కరించింది. అందరూ చప్పట్లు కొట్టారు.

"తంత్రీవాద్య సహకారం వీణవిద్వాన్ చినబాబుగారు; కుమారి శ్రీవాణి పితామహులు," అనగానే చినబాబుగారు వచ్చి సభావందనం చేశారు.

"మరో తంత్రీవాద్య సహకారం వాయులీనం. కేశవరావుగారు." కేశవరావుగార్ని ఎవరో చెయిపుచ్చుకుని తీసుకునివచ్చారు. ఆయన అందరికీ నమస్కరించారు. కరతాళ ధ్వనులతో హాలు మారుమోగింది.

"చర్మవాద్య సహకారం...." అంటూండగానే మాధవయ్యగారు మెల్లగా వేదికమీదకు వచ్చారు. కాని మాధవయ్యగారు సభకు నమస్కరించి కూచోకుండా మైకుపట్టుకున్నారు.

"క్షమించండి. నా అస్వస్థత కారణంగా ఒక యువకళాకారుణ్ణి విద్యాప్రదర్శనకోసం మీ ముందుకు తీసుకురావటం జరిగింది. ఆ వ్యక్తి మీకు కొత్త, వేదికకే కొత్త. కాని వాయిద్యానికి కొత్త కాదు. కాని మీ అందరి సహకారం కావాలి. అతని వాయిద్యం మీ అందరికీ నచ్చుతుందని నా నమ్మకం. కచేరీ అనంతరం మీ అందరి ఆశీర్వచనాలు కోరుతూ మీ ముందుకొచ్చి అతనెవరో అతని పేరేమిటో తెలియపరిచే పరిచయ కార్యక్రమం ఉంది." అంటూ సభికులతో విన్నవించి,

"నాయనా! వేదిక నలంకరించి, అందరినీ అలరించు" అంటూ ముచ్చటగా శ్రీనివాసుల్ని పిలిచారు మాధవయ్యగారు.

"సీతమ్మా! మనోడు వాయిస్తున్నాడంట. విను" అంటూండగానే శ్రీనివాసులు వారిద్దర్నీ వెతుక్కుంటూ వచ్చి లోపలకు తీసుకెళ్ళాడు. మాధవయ్యగారికి నమస్కరించి తల్లినీ తాతనీ మాధవయ్యగారి పక్కకుర్చీలో కూర్చోబెట్టి వేదిక నెక్కాడు. అందరూ నమస్కరించినట్లు తనూ నమస్కరించాడు. ఎవరూ కరతాళ ధ్వనులు చెయ్యలేదు. కాని చిన్నబోలేదు శ్రీనివాసులు. మాధవయ్యగారి పక్కన శ్రీనివాసులు కూర్చుంటేనే చిరాకుపడ్డాడు నాదబ్రహ్మం. ఇప్పుడు పక్కన వారిద్దరూ కూర్చోగానే నాదబ్రహ్మనికి మరీ కంపరం పుట్టింది. ఏదో వంకతో వారిద్దర్నీ బయటకు పంపిస్తే బాగుండుననిపించింది. మాధవయ్యగారంత పట్టించుకోలేదు ఆ విషయం.

"గురువుగారూ! ఆ పక్కన ప్రెసిడెంటుగారి పక్కన కుర్చీ ఖాళీఉంది. కూర్చుందామా?" అన్నాడు, సీతమ్మనీ తాతనీ చీదరింపుగా చూస్తూ.

"ఒద్దులేరా! ఇక్కడైతేనే బాగా కనిపిస్తుంది. వినిపిస్తుంది కూడాను" అన్నారు. మాధవయ్యగారికి అసలే ఓపికగా లేదు. జ్వరం తగ్గినా కాళ్ళూ చేతులూ లాగేస్తున్నాయి. అందుకే లేవబుద్ధి కాలేదు. మాధవయ్యగారికి ఎలా ముల్లు గుచ్చాలో నాదానికి తెలుసు.

"వినిపించటం కనిపించటం కాదండీ ముఖ్యం. మీ అంతటి వ్యక్తికో ప్రత్యేకత, గౌరవం ఉండాలి కదా! మీ పక్కన చూడండి. ఆ మురికిగుడ్డ వేధవ, ముష్టిముండల్లే చింకిరిజుట్టుతో పనిమనిషిలా ఉంది. అలాంటివారి ప్రక్కన మీరు కూర్చుంటే మీ పరువేం కాను? ఎవరైనా చూస్తే ఏం బాగుంటుంది? అబ్బ వాళ్ళ అవతారాలూ వాళ్ళూ.... కంపు కూడా కొడుతున్నారు" అంటూ ముక్కు మూసుకున్నాడు నాదబ్రహ్మం. నాదబ్రహ్మం మాటలో అసహజత్వం కనిపించలేదు మాధవయ్యగారికి. నిజమే అనిపించింది. అప్పుడు ఆయనకీ కంపు కొడుతున్నట్లనిపించింది. మెల్లగా లేచి మరోచోట కూర్చున్నారు వెళ్ళి.

తాతకీ సీతమ్మకీ వీరి మాటలు గానీ, చర్యలుగానీ పట్టలేదు. తాము కుర్చీలో కూర్చున్నామా! ముందు వరసలో కూర్చున్నామా! పెద్దవాళ్ళ పక్కన కూర్చున్నామా! మనల్ని ఎవరైనా చూస్తున్నారా! వెక్కిరిస్తున్నారా అనే ధ్యాసే లేదు వారికి. ఆ నాలుగు కళ్ళు శ్రీనివాసులు మీదే కేంద్రీకృతమయ్యాయి.

హంసధ్వని రాగంలో వాతాపి గణపతింభజే అనే కీర్తనతో కచేరి ప్రారంభ మైంది.

కచేరీ ప్రారంభమైనా సభికులు కొందరు కబుర్లు మానలేదు. గుడగుడా గువ్వల్లా మాట్లాడుతునే ఉన్నారు. మాట్లాడుకోవటానికి మరోచోటు దొరకనట్లు టిక్కెట్లు కూడా కొనుక్కొని వచ్చి మరీ కబుర్లాడుకుంటున్నారు.

శ్రీవాణి గొంతెత్తి గానంచేస్తుంటే మాటిమాటికీ సభతో కూర్చున్నవారు ఓహో ! అహ, భేష్ అంటూ మెచ్చుకుంటున్నారు. తాతకూడా ఆనందంతో అంద రిలా అన్నాడు. సీతమ్మ కవేం తెలీవు. కీర్తన కీర్తనకీ కరతాళధ్వనులు చేసి హాలు మారుమ్రోగించేస్తున్నారు. శ్రీవాణి అమితోత్సాహంతో పాడుతోంది. ఆనందభైరవిలో రాగం తానం పల్లవి పాడింది. తన శక్తిమేరకు విద్యా ప్రదర్శన చేసింది. చివరలో సహకార వాద్యాలకు అవకాశం ఇచ్చింది. చిన బాబుగారు, కేశవరావుగారు పోటీగా వాయిస్తున్నారు. వాటితో సమానంగా శ్రీని వాసులు తగ్గకుండా వాయిస్తున్నాడు. చివరగా శ్రీనివాసులు వంతు వచ్చింది. శ్రీనివాసులు విజృంభించి వాయిస్తున్నాడు. సభలోనివారంతా సంభ్రమాశ్చ ర్యాలతో వింటున్నారు.

శ్రీవాణి మనసు ఉత్సాహంతో ఉరకవేసింది. కచేరీ అయిపోయినా మళ్ళీ మళ్ళీ ఇంకా పాడి శ్రీనివాసుల్ని ఓడించాలని చిలిపి కోరిక కలిగింది ఆమెకు. "శ్రీనివాసులు నిజంగా గొప్ప విద్వాంసుడు" మనసులోనే అభినందించారు: మాధవయ్యగారికి అదో అనూహ్యమైన స్థితి. మైమరచిపోతున్నా రాయన. అందర్నీ చూస్తుంటే చిర్రెత్తుకొస్తోంది నాదబ్రహ్మనికి. కుర్చీలో కుదురుగా కూర్చోలేకపోతున్నాడు. ఆ క్షణంలో ఇంటికి పారిపోవాలనిపించింది. కాని మాదవయ్య గారు వెళ్ళకుండా తను వెళ్ళలేడు.

"ఆంధ్రులకు మరో మాణిక్యం" అనుకున్నారు చినబాబుగారు శ్రీనివాసులు తదేక ధ్యానంతో పరిసరాలు మరిచి వాయిస్తుంటే.

వేదికమీదివారికీ వేదికముందువారికీ ఏకాభిప్రాయం కుదిరింది. వేదిక మీది వారు తలలూపుతూ తమ ఆనందాన్ని వెలిబుచ్చుతుంటే వేదిక ముందువారు కరతాళ ధ్వనులతో తమ సంతోషాన్ని వ్యక్తంచేస్తున్నారు.

రోజూ వినేదైనా ఆ రోజు, ఆ చోట శ్రీనివాసులు వాయిద్యం కొత్తగా వినసొంపుగా వినిపిస్తోంది సీతమ్మకు. సీతమ్మ ఆనందానికి హద్దుల్లేవు. కాని ఆమె ఆనందాన్ని అంతర్వాహినిలానే ప్రవహింపచేసింది.

శ్రీనివాసులు వాయిస్తుంటే చేతికి ఏదైనా యంత్రం పెట్టుకుని వాయిస్తున్నాడా అనుకున్నారంతా. పరీక్షగా చేతివంకే చూశారు కొందరు. శ్రీనివాసులు చివరకు మృదంగంపైన చిత్ర విచిత్ర శబ్దాలు చేస్తుంటే యువత ఉత్సాహంతో కరతాళ ధ్వనులు చేశారు.

ప్రతివారికీ శ్రీనివాసులు వివరాలు తెలుసుకోవాలని ఆత్రుత హెచ్చింది. సభ ముగిసింది. కాని ఎవరూ బయటకూ పోయే ప్రయత్నంలో లేరు. శ్రీనివాసుల్ని గురించి తెలుసుకునే వెళ్ళాలని కూచున్నారు. మాధవయ్యగారు మెల్లగా వేదికమీది కొచ్చారు. గర్వంగా అందరివంకా చూశా రొకమారు. మైకు పట్టుకుని.

"ఇంత వరకు మనలందర్నీ లయతరంగ సాగరంలో హాయిగా ఈదులాడించిన ఈ చిరంజీవిని గురించి మీ అందరికీ పరిచయం చెయ్యబోయే ముందు ఈతని వెనక ఉన్న అపూర్వమైన ఒక అద్భుత విషయం ముందుగా చెప్పవలసి ఉంది. కాలాతీతమైనా మీరంతా వినాలని నా కోరిక." అన్నారు మాధవయ్యగారు ఉపోద్ఘాతంగా. తాత సీతమ్మని తట్టి "అదుగో! గురువుగారు మనోడ్ని గురించి ఎటో సెప్తారంట. విను" అన్నాడు. కొంచెం ముందుకి జరిగి చెవులు నిక్కించి వింటున్నారిద్దరూ.

"నా శిష్యుడు. నవమృదంగాలు ఏకకాలంలో వాయించగల మేధావి. దిట్ట. గురువుకు ఇంతకన్న గర్వకారణం ఏముంటుంది నాయనా? శ్రీనివాసులూ! ఇలా వచ్చి సభకు పరిచయ నమస్కారం చెయ్యి నాయనా!" అన్నారు. శ్రీనివాసులు వచ్చి సభకు నమస్కరించాడు. చప్పట్లు మ్రోగాయి.

"శ్రీనివాసులూ! హిప్ హిప్ హురే!" అంటూ చప్పట్లు కొట్టి అరిచారు యువకులు.

మాధవయ్యగారు సంతోషంతో కౌగలించుకున్నారు శ్రీనివాసుల్ని. మాధవయ్యగారిని తీసుకెళ్ళటానికి అప్పుడే వచ్చిన నాదబ్రహ్మం కళ్ళు భగ్గుమన్నాయి ఆ దృశ్యం చూడగానే.

"వీడు ఈయన శిష్యుడట. ఈయన వీడి గురువట. ఇదొక కట్టుకథ. ఇతడు అమాయకుడు, విద్యావంతుడు అని గ్రహించి తనే వాడి గురువునని చాటుకుంటున్నాడు. పరాభవం పొందుతాడు ఎప్పుడో! తప్పదు అనుకున్నాడు కసిగా.

"మనం వెళదామా?" అని అడిగాడు ముఖం శాంతంగా మార్చుకుని.

"ఉండు పాపం. శ్రీనివాసుల్ని కూడా...." మాధవయ్యగారు అనబోయేది నాదబ్రహ్మానికి అర్థమైంది. నాదబ్రహ్మం రక్తం ఉడికింది.

"వెంట తీసుకెళ్ళాలని మీ ఊహ. కాని గురువుకోసం శిష్యుడు వేచిఉండటం ధర్మం. కాని గురువే వేచిఉంటే లోకువగా ఉండదా గురువుగారూ! పైగా ఒచ్చే టప్పుడు అతనొక్కడే వచ్చాడు మనవెంట. ఇప్పుడు వాడి తాత, తల్లిని కూడా మన కార్లో ఎక్కిస్తానంటాడు. చూసినవారంతా ఏమనుకుంటారు? మీకంటె గొప్పవాడని అతని వెంటవెంట తిరుగుతున్నా రనుకోరూ!" నాదబ్రహ్మం ఓ పాచిక వేశాడు. నాదబ్రహ్మం చెప్పిందీ నిజమేననిపించింది మాధవయ్యగారికి. మారుమాట్లాడకుండా తన కార్లో ఇంటికెళ్ళిపోయారు. వెడుతూ కూడా శ్రీనివాసుల్ని అభినందించబుద్ధి పుట్టలేదు నాదబ్రహ్మనికి.

తాతనీ సీతమ్మనీ చూస్తూ "వీరెవరూ? మీ పనివాళ్ళా?" కోటేశ్వరరావు గారు అడిగారు తేలికభావంగా.

"కాదు. వీరు మా తాతగారు. రైలుస్టేషన్లో స్వీపర్ గా ఉద్యోగం చేసి సంవత్సరం క్రితమే రిటైర్ అయ్యారు" అని తాతని పబ్లిగ్గా పరిచయంచేస్తుంటే తెల్లబోయారు అందరూ.

శ్రీనివాసులు ఆ మురిగుజ్జువాడ్ని తన తాతగా గర్వంగా చెపుతుంటే కొందరు అభినందిచారు మనసులో. మరికొందరు శ్రీనివాసుల గొప్పబుద్ధిని చూడలేక అతని వెనకఉన్న చిన్నబోయిన మనషుల్ని చిన్న మనసుతో చూశారు.

"ఈమె మా అమ్మ" అంటూ సీతమ్మని పొదవిపట్టుకుని చూపించాడు.

కారులో తాత ఒక పక్క, తల్లి ఒక పక్క కూచుంటే శ్రీనివాసులు మధ్య కూర్చుని తల్లిమీద తాతమీద చేతులేసుకుని పరవశించిపోయాడు.

"తాతా! నీ ఋణం ఏ జన్మకీ తీర్చుకోలేనయ్యా! ఈ మనసు, ఈ శరీరం నాలో ప్రతి అణువూ నీదేనయ్యా. తాతా! నువు దొంగవి. అన్నీ నువ్వే. నేనే నీవాడిని అయినాను. అంతా నీకే కావాలన్నావు. ఇంక నాకేం మిగిలిందయ్యా! అంతా నేనే, అన్నీ నేనే, అన్న భగవంతుడివి నువ్వేనయ్యా!" అనుకుంటూ తాతనే కళ్ళనిండా నింపుకుని మనసులోనే సమస్కరించాడు శ్రీనివాసులు.

"ఈడి నాయనుంటే ఎంత సంబరపడిపోయేటోడో!" అనుకుంది సీతమ్మ. అంతలోనే "అడి నాయినుంటే ఈడిట్టా ఎందుకయ్యేటోడు! కుండలు సేసు కుంటా, మట్టి తొక్కుకుంటా ఉండేటోడు. మా దశ దిగజారిపోబట్టి, అది సిన్నాన ఇంటికెల్లాం. ఆమె గయ్యాలి కావటంకూడా ఈడి అదురుట్టమేనేమో! ఆమె కొట్టుదన్న బయానికి పారిపోయొచ్చీ బట్టి, తంతే బూరెల బుట్టలో పడ్డట్టు, ఈడు తాత కల్లలో బడ్డాడు. అ దేముడే అడ్ని ఇంతోడ్ని చెయ్యాలని తాతలాగ



వచ్చినాడో ఏమో! ఓరికి తెలుసుద్దంట! ఎప్పుడేది ఎట్టా జరిగేదీ ఆ బగమం తుడికే తెలుసుద్దంట. ఏదెట్టాగున్నా ఈడు ఎన్ని జనమలెత్తినా తాత ఋణం తీర్చుకోలేడు" అనుకుంది సీతమ్మ, కొడుకు చేతిని నిమురుతూ.

"ఈడికీ నాకూ దేముడు ఏనాడు ముడిపెట్టిండో! అందుకే ఈడ్ని నేను చూశా. ఈడికి నేనంటే వల్లమాలిన పేమ. ఈడి ముకం సూసినప్పుడే అను కున్నా ఈడు గొప్పోడౌతాడని. అందుకే అబ్బిగాడికోసం ఏమైనా సరే సేసెయ్యాలనిపించింది. సేసేసినా. ఈడే నా కొడుకు. ఈడే నా మనవడు. ఈడే నా తాత. శీనివాసులు అందర్లోటోడా? పెసలు మనిషి." తాత మనసులో

పసివాడుగా మెదిలి ఉన్నట్టుంది పెద్దవాడై పోతున్నట్టు తను శ్రీనివాసులి బుగ్గలు అందుకోవాలని ఎగురుతున్నట్టు, అందుకోలేక పడిపోతున్నట్టనిపించింది. బిగ్గరగా. "ఒరే అబ్బీ! ఒంగరా ముద్దెట్టుకోవాల" అన్నాడు. కార్లో తను, శ్రీనివాసులు, సీతమ్మా ప్రయాణిస్తున్న మాటే గుర్తులేదు తాతకి. కారు ఆగింది. తాత సిగ్గుపడి తల తిప్పి చూశాడు. పోచమ్మ గుడిదగ్గరకొచ్చినట్లు గుర్తించా రంతా.

"మీ ఇల్లెక్కడ?" అని అడిగారు కోటేశ్వరరావుగారు.

"ఈ సందులోనే. మేం నడిచి వెడతాం. ఈ సందులో రాత్రిపూట కారు నడటపం కష్టం" అంటూ దిగాడు శ్రీనివాసులు. తాత మృదంగం బుజానెట్టుకున్నాడు. శ్రీనివాసులు ఒద్దంటున్నా వినలేదు. వినడు కూడా.

తాత, సీతమ్మ ఒరిగిన వెంటనే నిద్రపోయారు. శ్రీనివాసులుకే నిద్రరాలేదు. శ్రీనివాసులుకి ఇదంతా ఒక కలగా వింతగా అనిపిస్తోంది. అసలు తనింతగా ఎలాగైనాడు? తాతకి తనకీ ఏనాటి సంబంధం? ఎలాటి అనుబంధం? ఆలోచిస్తూ పడుకున్నాడు.

* * *

పదిహేను సంవత్సరాల క్రితం మాట....

"ఒరే! అబ్బీ! లెగు లెగు. రైలు కదిలే ఏళ్ళైంది" అంటూ పోలికేక వినిపించింది. రైలుపెట్టెలో బల్ల కింద తాయిత్తుపాములాగా ముడుచుకుని పడుకున్న పిల్లవాడు ఆ కేక విని అదిరిపడి తలెత్తాడు. ఠకీమని చెక్కబల్ల తలకు కొట్టుకుంది.

"అమ్మా!" అన్నాడు ఆ పిల్లవాడు బాధగా. రైలుపెట్టె ఊడుస్తున్న ఆదెయ్య ఊడుస్తూనే తల తిప్పిచూశాడు. ఏడెనిమిదేళ్ళ కుర్రాడు కళ్ళు మూసుకుని బల్లనానుకుని కూర్చున్నాడు. దెబ్బ బాగా తగిలినట్లుంది తలమీద చేత్తో రాసుకుంటున్నాడు. ఆ పిల్లవాడి ఏడుపు ముఖం చూసి,

"దెబ్బ బాగా తగిలిందేంట్రా అబ్బీ!" అన్నాడు ఆదెయ్య. ఆ పిల్లవాడు అప్పుడు కళ్ళు తెరిచి చూశాడు. ఎదురుగా కనిపిస్తున్న ఆదెయ్యని చూస్తుంటే గణపతి దేముడు జ్ఞాపకమొచ్చాడు. ఎప్పుడూ దేముడి బొమ్మనే తప్ప దేముళ్ళాంటి మనిషిని చూడలేదు ఆ పసివాడు.

రెప్పవాల్చకుండా ఆదెయ్యనే ఆపాదమస్తకం చూస్తూ దెబ్బమాటే మరిచిపోయాడు.

బంకమన్నులా నల్లగా, చట్టిలా పొట్టిగా, బానంత కడుపు, దిష్టిపిడతలా తలకాయ, చీకేసిన తాటికాయలా జుట్టు, వీపుమీద గూని, కళ్ళు, పళ్ళు, గోళ్ళు తప్ప అతని శరీరంలో ఎక్కడా తెల్లని భాగమే కనిపించలేదు. అతని నీలం లాగు. చొక్కా అతని రంగులో కలిసిపోయి ప్రత్యేకంగా కనిపించటంలేదు కూడా.

ఆదెయ్య చిన్న చిన్న చేతులు సర్కస్‌లో (బఫూన్లా) పొట్టివాడిలాగా విచిత్రంగా ఉన్నాడు. చీపురంత లేడు. చీపురు పట్టుకుని ఊడుస్తుంటే పడుకుని ఊడుస్తున్నట్లు కనిపించాడు ఆదెయ్య. ఆ పిల్లవాడికి నవ్వొచ్చింది. కాని నవ్వ లేదు. ఆ చిత్రమైన మనిషిని చిత్రంగా చూశాడు ఆ పిల్లవాడు.

“దెయ్యం పట్టినోడ్లా ఆ సూపేట్రా! తలగాని దిమ్మెక్కిందా! సేత్తో గెట్టిగా రాసుకో నొప్పి పోద్ది” అని చకచకా చీపుర్ని ఊడుస్తూ పెట్టెలోపల బల్లలకింద దూరి ఊడుస్తూ మరో పెట్టెలోకి వెళ్ళిపోయాడు ఆదెయ్య.

ఆ పిల్లవాడు అక్కడే కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. ఆ పిల్లవాణ్ని చూస్తుంటే ఆదెయ్యకి నవ్వొచ్చింది.

ఆ పిల్లవాడివేపు తిరిగి “ఒరే! ఇయాల బండి టయాంకి పోతదంట. ఇంటికిపోయి బువ్వతిని పడుకో! నేకుంటే సక్కంగా సాయంత్రపేళకి వేరే ఊరుకుపోతావ్. అప్పుడేడుత్తావ్. అమ్మా! అయ్యా! అంటా” అంటూ ఆదెయ్య క్యార్ క్యార్ మని ఏడ్పిట్లుచేసి నవ్వాడు. ఇలాంటి చిన్న చిన్న పిల్లలు బండి ఊడ్చేటప్పుడు రోజూ తారసపడుతూనే ఉంటారు ఆదెయ్యకి. ఎందుకంటే అన్ని బళ్లూ ఇక్కడి నుంచే బయలుదేరతాయి. ఇక్కడితోనే ఆగిపోతాయి. అందుకని బళ్ళు రాగానే చిన్న చిన్న పిల్లలు, కూలివాళ్ల పిల్లలు, బిచ్చగాళ్ల పిల్లలూ బిలబిలమంటూ పరిగెత్తుకొచ్చి పెట్టెల్లో ఎక్కి ఆడుకుంటారు సరదాగా. ఆడుకుంటూ ఎక్కడో ఒక చోట పడుకుని నిద్రపోవడమూ కద్దు. బల్లలమీదా బల్లలకిందాను.

ఊడ్చేటప్పుడు స్వీపర్లు వాళ్లని లేపి దింపేస్తూ ఉంటారు.

ఆదెయ్య పెట్టెంతా ఊడ్చివచ్చినా ఆ పిల్లవాడు దిగిపోలేదు. కూర్చునే నిద్రపోతూ, తూలిపోతున్నాడు. ఆదెయ్యకు పిల్లలంటే చాలా ఇష్టం. కాని పిల్లలే ఆదెయ్యంటే ఇష్టపడరు. పైగా వేళాకోళం చేస్తారు. మెల్లగా ఆ పిల్లవాడి దగ్గరకెళ్ళి “ఒరే! నీ నిద్ర సీరుకారిపోనూ! బండి ఎల్లే ఏళ్లైందిరా! ఇంటికి పోయి పడుకోరా అబ్బి!” అంటూ నిద్రలేపి రెక్క పుచ్చుకుని బండీ దింపి మరో పెట్టె ఊడవటానికి వెళ్లాడు ఆదెయ్య.

బండిలోనుంచి దిగిపోయాడు ఆ పసివాడు. కాని ఆకలి దిగిపోలేదు. నాలుగు మెట్లు పైకెక్కింది. స్టేషన్లో బళ్ళపైన తినుబండారాలు చూడగానే గంతులేసింది. కాని కొనుక్కు తినాలంటే డబ్బుల్లేవు. కాని అడుక్కు తిన బుద్ధి కాలేదు. స్టేషన్ బయటకు వెళ్ళాలనిపించింది. కాని ఎర్రటోపీ బుర్ర మీసాల పోలీసులు కనిపించగానే భయమేసి బల్లకింద దూరి కూచున్నాడు గడ గడ లాడుతూ.

ఆదెయ్య మధ్యాన్నం ఒంటిగంటకు డ్యూటీ దిగి వస్తుంటే, బల్లకింద పిల్లవాడు కనిపించాడు. ఆ పిల్లవాడ్ని ఎక్కడో చూసినట్లనిపించి బల్లకింద తొంగిచూశాడు ఆదెయ్య. పెద్ద పెద్ద కళ్ళు, చక్కని ముక్కు, శ్వేత పెదాలు. బక్కపలచని ఆ పిల్లవాడు ఆదెయ్యని పొద్దుటే ఆకర్షించాడు. మామూలుగా ఆదెయ్య రోజూ ఎంతోమందిని చూస్తుంటాడు. చూచిన వారందర్నీ జ్ఞాపకం పెట్టుకునే అవసరం ఆదెయ్యకి లేదు కాని ఎందుకో ఈ పసివాడి అమాయకమైన కళ్ళు అందమైన ఆ ముఖం ఆదెయ్య మనసులో ముద్రవేసాయి. పొద్దునంత పరికించి చూడలేదు. కాని ఆ ముఖం గుర్తుంది ఆదెయ్యకి.

"ఏరా అబ్బీ! నువ్వింకా ఇంటికి పోలేదేంట్రా?" అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా ఆ పిల్లవాడు గుడ్ల నీళ్ళు కుక్కుకుంటూ బేలగా ఆదెయ్య వంక చూశాడు. ఆ పిల్లవాడు మూగవాడేమో! అనుకున్నాడు ఆదెయ్య సమాధానం చెప్పకపోతే. "అన్నం తిన్నావా?" అని సంజ్ఞలతోనే అడిగాడు ఆదెయ్య. ఆ మాట అనగానే, ఆ పసివాడికి ఆకలి గుర్తుకొచ్చింది. పోలీసులొస్తున్నారేమోనని అటూ ఇటూ చూసి గబగబా కుళాయి దగ్గరకెళ్ళి దోసిళ్ళతో నీళ్ళు తీసుకుని తాగేసి, చొక్కాతో మూతి తుడుచుకుంటూ ఆదెయ్య దగ్గరకొచ్చాడు. ఆదెయ్య మంచివాడులాగా కనిపించాడు. అతని దగ్గరుంటే పోలీసులేం చెయ్యరనిపించింది. పాపం! ఆకలేస్తున్నట్లుంది. ఎర్రాడు అడుక్కుతిన టానికి నోరులేదల్లే ఉంది అనుకున్నాడు ఆదెయ్య. ఏది ఏమైనా ఆ పసివాడు అడుక్కుతినకుండా, ఆకలేస్తోందనైనా చెప్పనందుకు జాలివేసింది. ముచ్చటా వేసింది. ఆ పసివాడు అసలు ఆ ఊరివాడు కాదేమోనన్న అనుమానం కూడా కలిగింది ఆ పిల్లాడి వాలకం చూస్తుంటే.

"ఏరా అబ్బీ! మీది ఈ ఊరు కాదా?" అన్నాడు. కాదన్నట్లుగా తలఊపాడు ఆ పసివాడు భయం భయంగా చూస్తూ.

"అద్గదీ! నే ననుకుంటానే ఉన్నాన్లేరాబ్బీ! సరదాకి రైలెక్కి ఉంటావ్

అమ్మతోపాటుగా. నువ్వేమో నిద్రపొయ్యావ్. అమ్మ మర్చిపోయి దిగిపోయుంటుది." నిజమేనా అన్నట్లు తల నిలువుగా ఆడించాడు ఆదెయ్య. ఆ పిల్లవాడు కళ్ళంట బొటబొటా నీళ్ళు కార్చాడు. ఆ కన్నీళ్ళు చూడగానే తాత మనసు విలవిలలాడిపోయింది. "పాపం తలితండ్రులకోసం ఏడుస్తున్నాడు ఎర్రెదవ" అనుకుంటూ—

"ఓరోరి. ఏడవమాకురా!" అని సముదాయించాడు.

"ఒరే అబ్బీ! రారా! బువ్వ తిందాం" అంటూ పిలిచాడు. ఆ పిల్లవాడు మాటమాట లేకుండా తాతవెంట వెళ్లాడు. ఆదెయ్య ముద్దలు కలిపి పెడితే తిన్నాడు. ఆ పసివాడికి అలా తినిపిస్తుంటే ఆదెయ్యకు ఎంతో ఆనందంగా తృప్తిగా అనిపించింది. ఆ పిల్లవాడిమీద ఏదో ప్రేమ పుట్టుకొచ్చింది. ఆ పసివాడు తన రక్తసంభంధీకుళ్ళా అనిపించింది. అదో అందమైన అనుభూతిగా అనిపించింది ఆదెయ్యకు. తనని చూసి అసహించుకోకుండా, తన గిన్నెలో అన్నం తింటున్నవాడ్ని చూసి, "ఇది ఏనాటి ఋణమో! ఏ జనమలో నాకు అన్నం పెట్టాడో! ఇప్పుడు ఆ అన్నం తినిపోనికి ఒచ్చినాడేమో!" అనుకుంటూ ఆవురావురుమని తింటున్న ఆ పసివాడ్నే రెప్పవాల్చకుండా చూశాడు.

"తనుకూడా అందర్లా ఉంటే తనకూ ఓ పెళ్లాం, పిల్లా జెల్లా అంతా ఉండేది. బగమంతుడు తన్ని మరిగుజ్జువాడిగా పుట్టించి అనాదని, ఒంటరిగాడ్ని చేశాడు. అందవికారినని అందరూ అసహించుకుంటున్నారే తప్ప ఓరూ ఇప్పటికి నాదగ్గిర ఇలా కూచోలేదు. నేపెట్టిన ముద్ద తినలేదు. ఈ పసినాడు నన్ను చూసి నవ్వలేదు. హేళన చెయ్యలేదు. పైగా నా దగ్గిర అన్నం కూడా తిన్నాడు. ఈ పసివాడికి నేను అసహ్యంగా కనిపించలేదా?" ఆదెయ్య తనలో తానే అనుకున్నాడు. ఆ పసివాడి పేరు తెలుసుకోవాలనిపించింది. పలకరించి మాట్టాడించా లనిపించింది.

"ఒరే అబ్బీ! నీ పేరేంట్రా?" అని అడిగాడు. ఆ పిల్లాడు మూగవాడే అయితే ఏ ఊరని రైలెక్కించాలి అనిపించింది. అందుకే పలకరించి పేరడిగాడు. ఆ పిల్లవాడి కడుపులో చల్లబడింది. ఆదెయ్య తెలిసిన మనిషిలా అనిపించింది. కాస్త భయం తగ్గింది. "సీనివాసులు" అన్నాడు. మూగవాడు చెవిటివాడు కానందుకు సంతోషించాడు ఆదెయ్య.

"సీనివాసులా! ఎంకన్న దేముడి పేరు. సానా బాగుందిరా అబ్బీ! మరి మీ ఊరిపేరేంటి?"

"ఇనాయికపురం." అన్నాడు

"ఎట్టా! ఇనాయకపురమా! అయితే పద పద. ఇనాయకపురం మీంచి పొయ్యే బండి కదిలే ఏళ్లైంది. ఎక్కిత్తా. సక్కంగా నిద్రపోకుండా కూసోని ఊరు రాంగానే దిగిపో. నేకుంటే మళ్ళీ మరో ఊరు పోతావ్" అంటూ శ్రీనివాసులు చెయ్యి పుచ్చుకున్నాడు. శ్రీనివాసులు భయపడిపోయాడు. బేలగా చూస్తూ,

"తాతా! నన్ను రైలెక్కించొద్దు. నేను మా ఊరెల్లను" అంటూ తాతని చుట్టేసి ఏడ్చాడు. నిజానికి ఆదెయ్య ముసలాడు కాదు. శ్రీనివాసులు, నలభై ఏళ్ళకే ఆదెయ్యని తాత చేశాడు "తాతా" అని పిలవగానే పులకించిపోయాడు ఆదెయ్య తనకొక మనవడుండి "తాతా" అని పిలుస్తున్నట్లే అనుభూతి కలిగింది. తనని "తాతా" అని పిలిచినందుకు సిగ్గుపడలేదు. శ్రీనివాసులు తల ఆప్యాయంగా నిమురుతూ, తనని ఇంత ఆప్యాయంగా పిలుస్తున్న శ్రీనివాసులు, తనకే కావాలనిపించింది.

"ఓరోరి! ఏడవమాకురా! కళ్లు తుడుసుకో. మరి ఊరెల్లకుంటే అమ్మా నాన్నా ఏడ్చి బెంగపడిపోరేంట్రా?" అన్నాడు శ్రీనివాసులు కళ్ళు తుడుస్తూ.

"నాయన చచ్చిపొయ్యాడుగా!" అన్నాడు శ్రీనివాసులు ఆదెయ్యకు చాలా జాలేసింది ఆ పసివాడికి తండ్రి లేనందుకు.

"అలాగా! మరైతే అమ్మ బెంగపడుతుంది. పద రైలెక్కిస్తా" ఆదెయ్య అలా అన్నాడే కానీ ఆ పిల్లవాడు తన దగ్గిర ఉంటే బాగుండుననిపించింది. మళ్ళీ, ఎవరో పిల్లవాడు తనదగ్గిర ఉండమంటే ఉంటాడా అనికూడా అనుకున్నాడు.

"నే నెల్లను. నన్ను రైలెక్కించొద్దు తాతా" అంటూ జాలిగా తాత వంక చూశాడు.

తాత కరిగిపోయాడు. కాని ఆ పసివాడు తల్లిదగ్గిర కెళ్ళననటానికి బలమైన కారణం ఏదో ఉండి ఉండొచ్చనిపించింది తల్లిమీద అలిగొచ్చాడో! కోపమొచ్చి వచ్చాడో! అనిపించినా, గడుసువాడులా లేడు. నోటమాటరాని ఆ పసివాడు తల్లి మీద అలిగివచ్చాడనిపించలేదు ఆదెయ్యకు. "రెండు రోజులు పోతే తల్లిమీద మనసు మళ్ళి వాడే వెళ్ళిపోతాడు. అంతదాకా తనివితీరా "తాతా", "తాతా" అని పిలిపించుకుంటూ, నా జనమ కిదో తీపి గురుతుగా తలుసుకుంటా కాలం ఎళ్ళబుచ్చేస్తా. ఈ ఎర్రి ఆదెయ్యకి దేముడిచ్చిన వరం శీనివాసులు" అనుకుని, శ్రీనివాసుల్ని ఆప్యాయతగా దగ్గిరకు తీసుకుని ముద్దెట్టుకున్నాడు. శ్రీనివాసులు ముద్దు వద్దనలేదు. ఆదెయ్యని దూరంగా తోసెయ్యలేదు.




"ఎక్కించనులేరా అబ్బీ! ఎక్కించన్లే. నీ కెప్పుడెల్లాలనిపిస్తే అప్పుడే ఎల్దువుగాని. మరి మాయింటి కెల్దాం వస్తావా?" అని అడిగాడు. ఆ పసివాడు ఏమని సమాధానం చెపుతాడో అని ఎదురుచూశాడు. శ్రీనివాసులు ఏమీ అనలేదు అమాంతం తాత చెయ్యి పుచ్చుకున్నాడు. తన చెయ్యి పుచ్చుకుని, తనవెంట శ్రీనివాసులు నడుస్తుంటే తనకో కొత్త జన్మ వచ్చినట్లు గర్వంగా నడిచాడు అదెయ్య.

తన జీవితంలో ప్రప్రథమంగా మరో జీవి తనంటే అసహించుకోకుండా తనతోపాటు తనింటికి వస్తున్నది.

అదొక మధురమైన సంఘటనగా అనిపించింది అదెయ్యకు. అందరూ తనను అష్టవక్రుడు అనే మాట ఆ క్షణంలో మరిచిపోయాడు.

"తాతిల్లు బాగుందేట్రా అబ్బీ!" అన్నాడు తాత పొయ్యిమీద కుండ ఎక్కిస్తూ. బాగుందన్నట్లు తలూపాడు శ్రీనివాసులు. శ్రీనివాసులు తనతో చాలా మాట్లాడాలని పించింది తాతకి. కాని తాత పది మాటలు మాట్లాడితే శ్రీనివాసులు ఒక్కదానికి

నోరు విప్పి ముక్తసరిగా సమాధానం చెపుతాడు. కానీ శ్రీనివాసులు తాతకి ఎంతో నచ్చాడు.

మర్నాటి నుంచీ రాత్రి డ్యూటీ. పగలంతా తను శ్రీనివాసులుతో గడపచ్చు. రాత్రులు ఆ పసివాడు ఎలాగూ నిద్రపోతాడు అనుకుని మర్నాడు సాయంత్రం శ్రీనివాసులికి చెప్పి డ్యూటీకి వెళ్ళిపోయాడు ఆదెయ్య.

శ్రీనివాసులు ఎక్కువసేపు ఒంటరిగా ఉండలేక గుడిశ బయటకు వచ్చాడు. అక్కడ పిల్లలు ఆడుకుంటూ తిట్టుకుంటున్నారు. శ్రీనివాసుల్ని కూడా రమ్మని పిలిచారు. కాని శ్రీనివాసులికి వాళ్ళతో ఆడుకోవాలనిపించలేదు. దానికి కారణం దూరంగా ఎక్కడో బ్యాండ్ మేళం వినిపించింది. శ్రీనివాసులికి మేళం అంటే ఇష్టం. అందుకని మెల్లగా లేచి ఆ మేళం వినిపించిన వేపుకి నడిచాడు. అది పెళ్ళి ఊరేగింపు. ఢం ఢం అంటూ బ్యాండువాళ్ళు కొడుతుంటే శ్రీనివాసులికి శివమెత్తినట్లు మనసు సంతోషంతో ఎగిరిపడింది. వాళ్ళు వాయించినట్లే తనూ తన తొడలమీద ఢాం ఢాం అంటూ కొట్టుకుంటూ ఊరేగింపు వెంట నడిచాడు. రోడ్డుమీద నడిస్తే ఎవరూ కాదనలేదు కానీ పెళ్ళి పందిట్లోకి మాత్రం శ్రీనివాసుల్ని రానియ్యలేదు. పైగా తిట్టి తరిమేశారు. శ్రీనివాసులు ఇంటి కెళ్ళాలని చూశాడు. అదంతా కొత్త ప్రదేశంగా కనిపించింది. ఎటు వెడితే తాత ఇల్లు వస్తుందో ఆ పసివాడికి తెలియలేదు. బిక్కు బిక్కుమంటూ చుట్టూ చూశాడు.

తనముందు ఒక పెద్ద ఇల్లు. గమ్మత్తుగా మృదంగం ఆకారంలో ఉంది ఇల్లు. ఆ యింటికి ఎత్తుగా మెట్లు. పెద్ద పెద్ద గాజు తలుపులు. తలుపుల్లోంచి అందమైన లైట్లు. ఆ యింట్లో ఉన్న మనషులు, అన్నీ స్పష్టంగా కనిపించాయి. తనలాగే చిన్న చిన్న పిల్లలు కనిపించారు.

శ్రీనివాసులు మెల్లగా ఆ మెట్లెక్కి గాజుతలుపుల్లోంచి చూశాడు. లోపల ఒక పెద్ద బల్లమీద తెల్లటి పరుపు. పరుపుమీద ఒకాయన కూర్చున్నారు. ఆయన కూర్చుంటేనే చాలా ఎత్తుగా కనిపించారు. నుంచుంటే ఇంకా చాలా ఎత్తు ఉండొచ్చు. ఎర్ర జరీశాలువా కప్పుకున్నారాయన. చెవులకు కుండలాలు, మెళ్ళో పెద్ద పెద్ద గవడకాయిల్లాంటి రుద్రాక్షలు, ముఖాన వీబూది పట్టెలు, మధ్యగా ఎర్రటి కుంకుమ. తలమీద జుట్టు ఎక్కువలేదు. కోడిజుట్టులాగా ఉన్నా ఆయన్ని చూస్తున్నకొద్దీ చూడాలనిపించింది శ్రీనివాసులికి. ఆయన అచ్చు పురాణం పంతులుగారి లాగా కనిపించారు. ఎవరో అబ్బాయి మృదంగం తెచ్చి ఆయనముందు పెట్టాడు. ఆయన చిరునవ్వులు చిందిస్తూ ఆ మృదంగాన్ని

దగ్గరకు తీసుకున్నారు. పిల్లలంతా లేచి నిలబడ్డారు. అప్పుడాయన తను చెపుతూ వారిని కూడా అనమన్నారు. ఆ పిల్లలు దణ్ణంపెడుతూ

"గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుః గురుర్ దేవో మహేశ్వరః

గురుర్ సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః" అని ఆయన చెప్పినట్లే చెప్పారు.

ఆ పిల్లలతోపాటు తనకూ అలా అనాలనిపించింది. అన్నాడు శ్రీనివాసులు. అలా అంటుంటే చాలా బాగుంది. ఆ తర్వాత పిల్లలందరూ తలో మృదంగం తీసుకున్నారు.

"తాధిత్తోనం, తాధిత్తోనం" అంటూ తన మృదంగం మీద వాయిస్తూ చెప్పారాయన. ఆ పిల్లలు ఆయన చెప్పినట్లే వాయించారు. శ్రీనివాసులు కూడా వారిలాగే కూర్చుని తనదగ్గిర మృదంగం లేకపోయినా ఉన్నట్లుగా ఊహించుకుంటూ తన తొడలమీద వారిలాగే వాయించాడు తాధిత్తోనం అంటూ.

అంతలో ఎవరో ఒకాయన వచ్చి "దొంగ వెధవా! ఎవరూ చూడకపోతే లోపల దూరి దొరికింది చేతపుచ్చుకొని పోదామనుకున్నావా!" అంటూ శ్రీనివాసుల్ని ఒక దెబ్బ వేసి రెక్క పుచ్చుకుని లేపి పొమ్మన్నాడు.

కాని శ్రీనివాసులు ఆ చీకట్లో ఎక్కడికీ పోలేదు. ఆ మెట్లకిందే గోడ పక్కగా ఉన్న చెట్టు చాటున కూర్చుని ఆ మృదంగ శబ్దాలు ఆలకిస్తూ ఆలకిస్తూనే నిద్రపోయాడు. ఒక అర్ధరాత్రివేళ చెవుల దగ్గిరగా మృదంగనాదం వినిపించి ఉలికిపడి కళ్ళుతెరిచి చూశాడు. చుట్టూ అంధకారం. కాని తను కూచున్న గోడ పక్కగా ఒక కిటికీ. ఆ కిటికీలోంచి దీపపు కాంతి కనిపించింది. మెల్లగా కిటికీ దగ్గిరకు జరిగి తొంగిచూశాడు.

ఇందాక మృదంగం నేర్పించినాయనే తను ఒంటరిగా కూర్చుని వాయిస్తున్నారు. బయట చలిగాఉన్నా ఆయనకు చెమటలు కారిపోతున్నాయి. శ్రీనివాసులు శ్రద్ధగా వింటూ కూర్చున్నాడు. మృదంగ నాదం ఆగింది. తెల్లవారింది. రైలు కూసింది. శ్రీనివాసులికి తాత జ్ఞాపకమొచ్చాడు.

సాయంత్రం మళ్ళీ ఆదెయ్య నైట్‌డ్యూటీ కెళ్ళిపోయాడు. శ్రీనివాసులికి మరుపురానిది నచ్చినదీ నిన్నటి చోటు. మెల్లగా ఆ చోటికి చేరాడు. నిన్నటిలాగే పిల్లలకు గురుబ్రహ్మ చెప్పారాయన. పాఠం చెప్పేముందు ఏవో మాటలు చెప్పారు. కొన్ని అర్థమైనాయి.

"విద్యార్థులకు శ్రద్ధ, భక్తి, వినయం, విధేయత, దీక్ష, పట్టుదల ఉండాలి.

అప్పుడే విద్య మిమ్మల్ని వరిస్తుంది." అంటూ ఏవేవో చెప్పారాయన. శ్రీనివాసులికి ఆయన మాటల సారాంశం అర్థమయినా కాకున్నా శ్రద్ధగా విన్నాడు. ఆయన చెప్పిన ప్రతి మాటా శ్రీనివాసులు తలలో పీఠంవేసుకుని కూర్చుంటున్నాయి. శ్రీనివాసులికి ఏదైనా ఒక్కమారువింటే వస్తుంది. ఆయన చెప్పిన ప్రతి మాటా శ్రీనివాసులు విన్నాడు. దానిని రోజంతా మననంచేస్తున్నాడు. అలాగే ఆ పిల్లలకు నేర్పుతున్న ప్రతిపాఠం శ్రీనివాసులు తన తోడమీద కొట్టుకుంటూ వాయించి మురిసిపోతున్నాడు. పగలంతా తాత కథలు, పాటలతో కాలక్షేపం అవుతోంది. శ్రీనివాసులికి పగటికంటే రాత్రంటేనే ఇష్టంగా ఉంది. సాయంత్రం పూట ఆ పిల్లలందరూ గురువుగారికి నమస్కరిస్తూంటే తనూ నమస్కరిస్తున్నాడు. కాని వాళ్ళు వెళ్ళిపోతున్నా శ్రీనివాసులికి ఇంటికెళ్ళబుద్ధి పుట్టటంలేదు. ఆ గోడకింద కూచుంటే రాత్రి గురువుగారు వాయించుకుంటారు. అది వినడమంటే శ్రీనివాసులికి చాలా ఇష్టంగా ఉంది. రాత్రి ఎప్పుడవుతుందా ! తాత ఎప్పుడెడతాడా అని ఎదురుచూస్తూనే వారంరోజులు గడిచినాయి.

ఓ రోజు "అమ్మ మంచిది తాతా! అమ్మని చూడాలి. నాకు ఏడుపొస్తోంది తాతా!" అంటూ ఏడ్చాడు శ్రీనివాసులు. శ్రీనివాసులు ఊరెళ్ళనంటే సంతోషంగానే అనిపించింది కానీ వాడు ఊరెళ్ళని కారణం అర్థంకాలేదు ఆదెయ్యకి. శ్రీనివాసులు తల్లిమీద బెంగతో అన్నం నీళ్ళు లేకుండా చిక్కి శల్యమై ఏమైనా అయిపోతాడేమోనని భయమేసింది ఆదెయ్యకు.

"ఒరే శీనూ! నువ్వలా ఏడుస్తావుంటే నాకెంత బెంగగా ఉంటందో తెలుసా? నువ్వన్నం తినకుంటే, నీ బెంగతో నేను చచ్చిపోతాన్రా !" అన్నాడు దిగులుగా శ్రీనివాసుల్ని చూస్తూ. తాత చచ్చిపోతాననగానే శ్రీనివాసులు తాతని అమాంతం చుట్టేసి,

"తాతా ! అలా అనొద్దు తాతా ! నాకు బయమేస్తుంది. నువు చచ్చిపోతే నేనూ...." అవతల పదం తాతకు తెలుసు. ఆ మాట తను వినలేడు. అందుకే అమాంతం శ్రీనివాసుల్ని గుండెల కదుముకొని ఏడ్చాడు.

"అలా అనమాకురా సీనివాసులూ ! నువు నూరేళ్ళు బతకాల్రా. నా ఆయుషు కూడా నీకే ఇచ్చి బతికించమని బగమంతుని అడుగుతాన్రా. నిన్ను సూసుకుంటా నేను బతుకుతాన్రా." అంటూ శ్రీనివాసులు ముఖం తన చేతుల్లో తీసుకుని ముద్దెట్టుకున్నాడు.

శ్రీనివాసు ఊరికెళ్ళి, శ్రీనివాసులు తల్లిని తీసుకురావాలని అనుకున్నాడు. ఆ సంతోషంలో ఇంటి కొచ్చేసరికి ఆదెయ్య ఇంటిముందు పిల్లలు మూగిఉన్నారు. తాత కాళ్ళుచేతులు ఒణుకుపుట్టాయి ఏం ప్రమాదం జరిగిందో శ్రీనివాసులకని. కాని గుడిశదగ్గిర కెళ్ళాక అర్థమైంది. లోపల్నించి ఘటవాద్యంలా వినిపిస్తోంది. తాతకు ఆశ్చర్యమేసింది. తనింటికొచ్చి ఎవరు వాయిస్తున్నారా! అని. పిల్లల్ని తొలిగించుకుని లోపలికెళ్ళాడు. శ్రీనివాసులు నీళ్ళకుండ పొట్టదగ్గిర పెట్టుకుని వాయిస్తున్నాడు. అది వింటుంటే అచ్చు అప్పుడప్పుడు రేడియోలో వినిపించే శబ్దం లాగే ఉంది. శ్రీనివాసులు చెమటతో తడిసిపోయాడు. తన్మయత్వంతో కళ్ళు మూసుకుని వాయిస్తున్నాడు. ఆ శబ్దతరంగాలు చెవులకు సోకుతుంటే తాత మనసు ఊగిపోయింది. తన మనసే ఇంత ఊగిపోతుంటే పసిమనసులు, లేతమనసులైన పిల్లల్ని ఆకర్షించడంలో ఆశ్చర్యమేముంది? అందుకే ఎప్పుడూ తన గుడిశ వైపుకూడా తొంగిచూడని పిల్లలు గుంపులు గుంపులుగా వచ్చి లేగదూడల్లా మోరెత్తివింటూ నుంచున్నారు. ఈ నాదం ఆ కుండలో ఉందో! నా శీను చేతుల్లో ఉందో! ఏది ఏమైనా ఆ శబ్దంలో మహత్తు ఉందనిపించింది ఆదెయ్యకు. కాస్త గర్వంగాకూడా అనిపించింది శ్రీనివాసుల్ని చూస్తుంటే. శీనుని ఈ వాయిద్యం గొప్పోడ్ని చెయ్యాలి. ఎంత డబ్బు ఖర్చయినా సరే! నా శీను ఇంతకంటే గొప్పగా మోగించేసెయ్యాలి అనుకుంటుండగానే కుంఠ ఒప్పుమని చిట్లి చిల్లు పడింది. ఉలికిపడి శ్రీనివాసులు కళ్ళుతెరిచి చూశాడు. తాత ఎదురుగా కూర్చుని తననే చూస్తూ కనిపించాడు. శ్రీనివాసులు భయంతో ఒణికిపోతూ అమాంతం లేచి మూలకెళ్ళి ముడుచుకుని నుంచుని,

"తాతా! నన్ను కొట్టొద్దు. నే నెప్పుడూ వాయించను. ఎప్పుడూ వాయించను తాతా," అన్నాడు భయంభయంగా చూస్తూ. ఏడ్చేస్తున్నాడు.

ఆదెయ్యకు ఆశ్చర్యమేసింది. తను ఏమీ అనకుండానే శ్రీనివాసులు అలా అనటానికి కారణం ఏదో ఉండే ఉంటుంది అనిపించింది. మెల్లగా శ్రీనివాసులు దగ్గిరకెళ్ళి వీపుమీద ఆప్యాయంగా రాస్తూ,

"నే నెందుకొట్టడతాన్రా అబ్బీ! నువ్వేం తప్పుచేశావని?" అన్నాడు ప్రేమగా.

"కుండ చిల్లుపడితేకూడా కొట్టవా?" అని అడిగాడు అమాయకంగా శ్రీనివాసులు

"కొట్టన్రా, ఆ కుండపోతే మరో కుండ కొంటాన్రా. అదిపోతే మరోటి. నువ్వు సానా బాగా వాయించేసినావురా. అలాగే ఎప్పటికీ వాయించాలె." అన్నాడు

ముద్దు పెట్టుకుంటూ. పిన్నికంటే చాలా మంచివాడుగా అనిపించాడు తాత. ఎప్పటికీ తాతదగ్గిరే ఉండిపోవా లనిపించింది.

"తాతా ! నేను ఎప్పటికీ నీ దగ్గిరే ఉంటా ! నువు సానా మంచోడివి" అని తనూ ముద్దెట్టుకున్నాడు శ్రీనివాసులు తాతని.

ఆ మాట తాతని కైలాస శిఖరానికి ఎత్తుకెళ్ళింది

తను కోరిందే ఆ పసివాడినోట వచ్చింది. భగవంతుడే తన మొర విని అని పించి ఉంటాడని అనుకున్నాడు ఆదెయ్య తృప్తిగా.

"అలాగేలేరా ! నేనే నీ దగ్గిరుంటారా. సచ్చిపోయిందాకా ఉంటారా. పద బువ్వ తిందాం. మళ్ళీ నాకు రైలు టైమైపోతోంది."

"నేను మీ ఊరెల్లి అమ్మని తెస్తా. ఈ కుండలో అన్నం వండి ఉట్టిమీదెట్టా రెతిరికి తిను. ఇయిగో రెండు రూపాయలు. ఆకలైతే కొనుక్కో తిను. నేను రేపు రేత్రికల్లా తిరిగొస్తా అమ్మతో! ఏం" అంటూ చెప్పివెళ్ళాడు శ్రీనివాసులుకు.

ఆ రాత్రి నిద్ర పట్టలేదు. మనసంతా అమ్మ బొమ్మతో నిండిపోయింది. తాతకి నిద్రపట్టలేదు. తన కూతురొకతె ఎక్కడో ఉన్నట్లు ఆ కూతురు కోసం తను వెదుతున్నట్లు అనిపించింది. మనసంతా గర్వంతో నిండింది. మళ్ళీ శ్రీని వాసులు ఇంత మంచివాడు. వాళ్ళమ్మ ఎట్లాంటిదో అనిపించింది. అంతలోనే శ్రీనివాసులు తల్లి పోలికే అయిఉండొచ్చు అనుకున్నాడు. ప్రయాణం చేస్తూ తనకు తెలియని తను చూడని కూతుర్ని గురించి ఆలోచిస్తూ ప్రయాణం సాగిం చాడు ఆదెయ్య. మర్నాటికల్లా తాత సీతమ్మతో తిరిగొచ్చాడు. తల్లిని చూడగానే కావిలించుకుని చుట్టేశాడు. ఆ తల్లి కళ్ళలో బిడ్డని అంతకాలానికి చూసిన ఆనందం దుఃఖిస్తున్నా కనిపించింది.

"తాతా మా ఇల్లెట్లా కనుక్కున్నావ్ ?" అని అడిగాడు.

"ఎటాగా వినాయకుడిని అడిగా. చెప్పేశాడు." అన్నాడు పట్టపగ్గాలు లేని సంతోషంతో ఆదెయ్య.

"అంటే ఏం అడిగావ్" అన్నాడు తాతఒళ్ళో పడుకుని శ్రీనివాసులు.

"ఏం అడిగానా ? సామి ! మా సీనివాసులు నా మనవడు. ఆడి తల్లి సీతమ్మ నా బిడ్డ. నా మనవడి కోసం ఏడుస్తూ ఉంది నా తల్లి. అందుకోసరం మా సీత మ్ముండేచోటు చెప్పయ్యా అన్నా. చెప్పాడు ఆంజనేయులుసామి. సీతమ్మ వారి కోసం ఎతుకులాడినట్లు ఎతుకులాడారా అమ్మకోసం. అమ్మ దొరికింది. తెచ్చేశా" అన్నాడు. వారిద్దరి అన్యోన్యత, ప్రేమ చూసి మురిసిపోయింది సీతమ్మ.




"అమ్మా! తాత వస్తే పిన్ని ఎల్లగొట్టలేదా?" అన్నాడు. సీతమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి శ్రీనివాసులు అడగ్గానే.

"మీ పిన్నమ్మ లేదురా! మీ కాకయ్య పాంకరిసి సచ్చిపోయినాడు. మీ పిన్నమ్మ ఆల్ల ఊరెల్లిపోయింది. ఒంటికాయ సొంటికొమ్ములా నేను నీ కోసం ఏడుస్తా రోజులు ఎల్లమారుస్తున్నా. ఇంతలో దేముళ్ళా సల్లని వార్త తెచ్చిండు నీ తాత, నా నాయన. అంతే నీ కోసం పడొచ్చేసినారా!" అంది శీను తల నిమురుతూ. పమిటకొంగుతో కళ్ళు తుడుచుకుంది సీతమ్మ.

సాయంత్రం చీకటిపడుతుండగానే శ్రీనివాసులు మాయమయ్యాడు. సీతమ్మ, ఆదెయ్య గాభరాపడ్డారు. సీతమ్మ గాభరాచూసి ఆదెయ్య గాభరాపడ్డారు. వెతకటానికి బయల్దేరాడు. చాలాసేపు వెతగ్గా వెతగ్గా శ్రీనివాసులు అద్దాల తలుపుల ఇంటిదగ్గిర కనిపించాడు. ఎంతో శ్రద్ధగా వింటున్నాడు. ఏమిటో! ఆదెయ్యకు ఇంతవరకూ తెలీదు శ్రీనివాసులు రోజూ ఇక్కడికి వస్తున్నాడని. "ఓరినీ! నువ్విడున్నావేంట్రా? అమ్మ గాబరాపడిపోతాంది. పద పద. చెప్పకుండ వచ్చేసినా వేంటి?" అంటూ శ్రీనివాసుల్ని బలవంతాన వెంటపెట్టుకుని తీసు

వెళ్ళాడు ఆదెయ్య. దారిపొడుగునా, "తాధిత్తోనం, తాధిత్తోనం. తత దిధి తోం తో నం నం" అంటూనే ఉన్నాడు శ్రీనివాసులు. శ్రీనివాసులు అలా అంటూంటే ముద్దొచ్చినా అదేదో భాషలాగా అనిపించింది ఆదెయ్యకు.

"ఏటిరా ఆ బాస" అన్నాడు ఆదెయ్య ముచ్చటగా పలుకుతున్న శ్రీనివాసులు వంక చూస్తూ.

"అదా! మద్దెలమీద అలా వాయించాలి తాతా! గురుబ్రహ్మగారు చెప్పారు. 'తాధిత్తోనం. తతదిద్ధి తోం తోం నంనం.'" అన్నాడు శ్రీనివాసులు ఉత్సాహంగా.

"మద్దెలా! అదంటే నీ కిట్టమేంట్రా అబ్బీ! అది నేర్చుకుంటావేంటి?" శ్రీనివాసులు ఏది నేర్చుకుంటానంటే అది నేర్పించాలనిపించింది ఆదెయ్యకు.

ఆదెయ్యకు చదువు రాకపోయినా చాలామంది తల్లితండ్రులకంటే ఎంతో నయం. తమ పిల్లలు డాక్టర్లు, యాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు అయి నాలుగు చేతుల్తో సంపాదించాలనే తమ కోరిక పిల్లల నెత్తిన రుద్ది, వారి అభిరుచుల్ని చంపేస్తుంటారు చాలామంది తలితండ్రులు.

కాని ఆదెయ్య అలా అనుకోలేదు. అభిరుచి దేనిమీద ఉంటే అది అబ్బుతుంది అని ఆదెయ్య అభిప్రాయం. అభిరుచి దేనిమీద ఉంటే దానిమీద శ్రద్ధ భక్తి, దీక్ష, దాన్ని సాంధించాలన్న పట్టుదల ఉంటుంది. అప్పుడే ఆ విద్య సంపూర్ణంగా ఒంటపడుతుంది.

"ట్ట" అన్నాడు శ్రీనివాసులు సంతోషంతో గంతులు వేస్తూ. ఆ పసివాడి ఉత్సాహం చూస్తుంటే ఆదెయ్యకీ ఉత్సాహం కలిగింది. పెరిగింది.

జీతం అందగానే మద్దెళ్ళ దుకాణానికెళ్ళి ఒక మద్దెల కొని నెత్తిన పెట్టుకుని మోసుకొచ్చాడు. గురుబ్రహ్మగారింటికెళ్ళి అయన్ని అడిగి శ్రీనివాసులికి నేర్పించాలని ఆదెయ్య ఆశ. శ్రీనివాసుల్ని వెంటపెట్టుకుని వెళ్ళాడు.

ఇంటిదాకా వెళ్ళాడు కానీ, ఇంటి లోపలికి వెళ్ళలేదు ఆదెయ్య. గుమ్మంలోనే ఒక పేదవాడు చింకిబట్టలతో కళ్ళనీళ్ళతో ఎదురయ్యాడు గొణుక్కుంటూ.

"ఎంత సదువొచ్చినా డబ్బు, హోదా పెరిగినా, చిన్ననాటి స్నేహం మరచిపోతాడా! పేదవాణ్ణి అంత నీచంగా తేలిగ్గా మాట్లాడి మనిషిచేత గెంటిస్తాడా? పేదవాడికి ప్రేమ ఉండదనుకున్నాడా? పేదరికం డబ్బుకే గాని మనసుకు ఉండదని తెలుసుకోలేని మూర్ఖుడు మృదంగం మాధవయ్య. కాదు. మృగం మాధవయ్య. ఇంటిపేరుని సార్థకం చేసుకున్నాడు" అని కసిగా అనుకుంటూ మెట్లు దిగుతున్నాడు ఆయన. రెండు మెట్లు ఎక్కిన ఆదెయ్య రెండు మెట్లూ అమాంతంగా దిగిపోయాడు.

"పేదవాడైన స్నేహితుడినే అవమానం చేసిన మాధవయ్యగారు తనకు మంగళహారతి పడతాతనిపించలేదు ఆదెయ్యకు. వెళ్ళి అవమానం పొందడం కంటే చావడం మేలనిపించింది. శ్రీనివాసుల వంక నిస్సహాయంగా చూస్తూ వెనక్కి మళ్ళాడు ఆదెయ్య. కాని శ్రీనివాసులుకు ఎట్లాగైనా మద్దెల నేర్పించాలనే కోరిక, పట్టుదల చావలేదు. ఇంకా ఎక్కువైంది. ఇదేమీ ఆ పసివాడికి తెలీదు. దారి పొడుగునా "తాధిత్తోనం తత దిద్ధి తోం తోం నంనం" అంటూ నడుస్తూనే తొడలమీద వాయించుకుంటూ తాతపక్కనే నడుస్తుంటే తాతకి దుఃఖం ముంచుకొచ్చింది.

"అవునూ! వీడికి ఓరూ సెప్పాసెయ్యకుండానే ఇయన్నీ ఎలా వచ్చాయో! ఇయన్నీ ఇని నేర్చుకున్నాడన్నమాట. పిచ్చినాయనా! నీ తెలివితేటల్నీ బూడిదలో పొయ్యాల్నా. వీడి కన్నీ సూత్తేనే వత్తందన్నమాట!" ఆ మాట తాత మనసులో గిరగిరా తిరిగి గోలచేసింది. "ఇలాగే ఇవి నేరవనీకి రాదా! ఇని నేర్తే తప్పా? ఇని నేరుత్తే ఒద్దంటాడా? అలా అననీకి ఆయనెవడు? ఆయనిట్టమేంది?" అనుకున్నాడు ఆదెయ్య. ఇంటికి రాగానే బాధపడుతున్న ఆదెయ్యని చూసి విచారంగా నవ్వింది సీతమ్మ.

"ఎందుకయ్యా! అంత దబ్బెట్టి ఆ డోల్లు కొనుక్కొచ్చినావ్. పేదోల్లకి ఉత్తగా సదువెవడు సెప్తాడయ్యా? సదువొచ్చే వోడికి డబ్బుండదు. డబ్బునోడికి సదువు రాదంట. అరికతలో బాగవతార్‌గారు సెప్పినట్టు సానాకాలం కిందట ఏకలవుడనే ఎరకలసినోడు ఇలువిద్దె నేర్పమని ఓ మారాజు దగ్గిర కెల్లిండంట. ఆ మారాజు గొప్పోల్ల పిల్లలకే సదువొచ్చుద్దని కాబోలు, ఏకలవుడు పేదోడని ఇద్దె సెప్పనని ఎల్లగొట్టిండంట. ఆ కాలంలోనే అట్టుంటే ఈ కాలంలో మాత్తరం సదువు ఉత్తగెవరు సెప్తారయ్యా! మనసంటోళ్ళం ఏ కూలో నాలో సేసుకుని బతుకులు ఎల్లమార్చాలగానీ, పెద్ద పెద్ద ఆశ లెట్టుకోకూడదు. అది అంతేనయ్యా!" అంది బాధగా.

ఏకలవ్యుడు కథ ఆదెయ్య చాలాసార్లు విన్నాడు. శ్రీనివాసులూ విన్నాడు. ఆ కథంటే శ్రీనివాసులుకు ఎంతో ఇష్టం. అందులో ఏకలవ్యుడంటే మరీ ఇష్టం. ఆదెయ్య తలలో ఏదో మెరుపు మెరిసింది. చివ్వున తలెత్తి, "ఒరే అబ్బీ! ఆ మద్దెల ఇట్టా తీసుకురారా!" అన్నాడు. శ్రీనివాసులు దాన్ని తీసుకొచ్చి తాతముందర పెట్టాడు.

"ఒరే! ఇయాల ఇనాయకుడి పూజంట. ఆ దేముని పటానికి మొక్కరా!

ఆ దేవుడికి మొక్కితే ఇద్దె బాగా వచ్చుద్దంట. ఇందాకేటో దారి పొడుగునా బాస అన్నావే! దాన్ని ఈ మద్దెలమీద కొట్టరా! చూద్దాం" అన్నాడు. శ్రీనివాసులు దేముడికి దణ్ణంపెట్టి, గురుబ్రహ్మ శ్లోకాన్ని గురువుగారు చెప్పినట్లు స్వచ్ఛంగా పలుకుతూ చదివాడు. తరువాత మాధవయ్యగారికి దణ్ణంపెడతారు పిల్లలు. కాని మాధవయ్యగారు అక్కడ లేరు కనుక తాత కాళ్ళకు దణ్ణం పెట్టాడు. శ్రీనివాసులు అలా చేస్తుంటే నోరు వెళ్ళబెట్టి చూస్తున్నారు సీతమ్మ, ఆదెయ్యాను.

"ఇయన్నీ ఏడ నేరిస్తివిరా ?" అంది సీతమ్మ, స్వచ్ఛంగా శ్రీనివాసులు పలుకుతుంటే.

"గురుబ్రహ్మగారు వాయించే ముందు ఇలాగే చెయ్యమంటారు," అని మద్దెలకు దణ్ణంపెట్టి కళ్ళకద్దుకుని, తను రోజూ, వింటున్నవి తుచ తప్పకుండా వాయించాడు శ్రీనివాసులు. వాయించిందే వాయించాడు. తాత "ఇయాలకు సాల్లేరా!" అన్నదాకా వాయిస్తూనే ఉన్నాడు శ్రీనివాసులు. అలా వాయిస్తుంటే తన దృష్టే తగులుతుందేమో అని భయపడ్డాడు తాత.

శ్రీనివాసులు మామూలుగా ప్రతి సాయంత్రం మాధవయ్యగారింటికి వెళ్ళడం మానలేదు. ప్రతిరోజూ ఆయన విద్యార్థులకు చెప్పే ప్రతి పాఠం శ్రద్ధగా విని ఇంటికొస్తాడు. మళ్ళీ సాయంత్రందాకా ఆ పాఠాన్ని వాయిస్తూనే ఉంటాడు శ్రీనివాసులు. అతనికి గురువంటే భక్తి. పాఠాలంటే శ్రద్ధ. నేర్చుకోవాలనే దీక్ష పట్టుదల అతనిని క్రమేపీ వృద్ధిలోకి తెచ్చాయి. పాఠ్యక్రమం వరస తప్పకుండా నేర్చుకున్నాడు. కాలం తిరిగి వయసుతోపాటు ఆలోచనలు పెరిగాయి. కొత్త కొత్తవేవో సొంతంగా కనిపెట్టాలనే కోరిక కలిగింది. ఒక మృదంగం పక్కన మరొక మృదంగం పెట్టి వాయించాలనిపించి మొదట చెక్కపెట్టెతో సాధన మొదలెట్టాడు. శ్రీనివాసులు ఉత్సాహం కృషీ చూసి తాత మురిసిపోయి మరో మృదంగం కొన్నాడు. అలాగే ఒకటికి మరొకటి చేర్చి తొమ్మిది మృదంగాలమీద వాయించటం సాధన చేశాడు శ్రీనివాసులు. అతనిలో అంత ఉత్సాహాన్ని ఉసిగొల్పింది తాత. చిన్నప్పటినుంచీ, ఎక్కడ ఏ కచేరీ అయినా, హరికథలైనా నృత్య కార్యక్రమాలైనా డబ్బు ఖర్చుపెట్టైనా సరే శ్రీనివాసుల్ని తీసుకెళ్ళేవాడు.

అనవసరపు ఖర్చెందుకని సీతమ్మ పోరుపెట్టినా వినేవాడుకాదు.

శ్రీనివాసులికి మాధవయ్యగారి మీద భక్తి ఎంతదాకా వెళ్ళిందంటే, మాధవయ్యగారి బొమ్మతోఉన్న ప్రోగ్రాం పేపర్లు, వాల్‌పోస్టర్లు ఏమి కనిపించినా చించి తెచ్చి ఇంట్లో అతికించి నమస్కరించేవాడు చిన్నప్పుడే.

"ఎందుకొచ్చిన మోతయ్యా! అది మనకు కూడెడతగా గుడ్డ ఇస్తదా! వయసొచ్చినోడు ఏ కూలికో నాలికో పంపరాదూ!" అంటుంది చిరాగ్గా సీతమ్మ. ఆమెకు శ్రీనివాసులు పనీపాటా సంపాదనా లేకుండా ఇంట్లో ఉండటం మద్దెల వాయిస్తూ ఉండటం ఇష్టం ఉండదు.

కాని దానికి వెంటనే తాత నవ్వుతూ, "నీకేం తెల్సమ్మా! మనోడుఎప్పుడో గొప్పోడై పోతాడు. అప్పుడనుకుంటావ్. అడు కూలిపనికెడితే ఇంతోడు అయి ఉండేవాడా అని" అంటాడు తాత. ఇలా వారిద్దరి మధ్యా వాదోపవాదాలతో సంవత్సరాలు దొర్లిపోయాయి.

ఓరోజు గోడలో బిగించిన అద్దంపెంకులో శ్రీనివాసులు ప్రతిబింబం చూసి ఆశ్చర్యపోయాడు తాత. చిన్నపిల్లాడనే ఇంతకాలం అనిపిస్తోంది. కాని ఇప్పుడు అందంగా, బలంగా, ఎత్తుగా పెరిగిన శ్రీనివాసుల్ని చూస్తుంటే 'నవయువకు డైనాడు' అనుకున్నాడు తాత.

శ్రీనివాసులొచ్చి పదిహేనేళ్ళైనా తాత ఎప్పుడూ అన్నేళ్ళైనా యనుకోలేదు. కాని కిందటి సంవత్సరం రిటైరైనప్పుడు, ఇంక ఎప్పుడూ ఇంట్లో ఉండి, శ్రీనివాసుల్నే చూస్తుందొచ్చని అనుకున్నప్పుడు, అనిపించింది. ఇంక శ్రీనివాసులే ఇంటికి పెద్ద అని. శ్రీనివాసులికి ఎప్పుడూ అనిపించలేదు తనింతవాడైనట్లు.

కచేరీ ముగిసి నాకు పండు, తాంబూలం ఇచ్చి వాళ్ళు దణ్ణంపెడున్నప్పు డని పించింది.

"ఇదేమిటి! పెద్దవాడిలా వాళ్ళు నాకు దణ్ణంపెడుతున్నారు?" అని.

అంటే నేనూ పెద్దవాడి నయ్యానన్నమాట అని అప్పుడనుకున్నాడు.

## 4

ఎంతోకాలంగా ఆ గుడిశల్లో ఉంటున్నా ఎవరికీ శ్రీనివాసులు పేరు తెలియదు.

"శ్రీనివాసులుగారి ఇల్లెక్కడండీ?" ఒకాయన ఇల్లిల్లూ అడుగుతూవస్తున్నాడు. కాని అతనికి ఆ శ్రీనివాసులగారి ఇల్లు ఎవరూ చెప్పలేదు. కాని పక్కింట్లో అడుగుతుంటే విన్నాడు తాత, నులకమంచం బిగిస్తూ.

'శ్రీనివాసులుగారు.' ఎంత బాగుందో అలా పిలుస్తుంటే! అనుకుని పదిమాట్లు శ్రీనివాసులుగారు శ్రీనివాసులుగారు అని తనలో తనే అనుకుని మురిసిపోయాడు. తన్ని ఎప్పుడూ ఎవ్వరూ ఆదెయ్యగారు అన్న పాపాన పోలేదు. విద్దె నేర్చినోళ్లకి గౌరవం అడక్కుండానే దొరుకుద్ది కాబోలు. ఇంతకాలం నేను కట్టపడి, నా శీనివాసులికి నేనిచ్చిన దనం ఈ గౌరమే నన్నమాట. నా ఋణం

తీర్చుకున్నానో ఏదో! నాకెంత డబ్బుంటే మాత్తరం ఓరికి పట్టింది! శీనివాసులు అడక్కుండా దణ్ణంపెట్టారు. నాకు పెట్టారా? అదంతా నా శీనివాసులి అదురుట్టం" అనుకుని మురిసిపోయాడు. తాత.

ఆ వచ్చిన వ్యక్తి తాతనీ అడిగాడు అదే ప్రశ్న. ఆ వచ్చిన మనిషి శ్రీనివాసులు కోసమే వచ్చిందని తెలిసినా శ్రీనివాసులు గొప్పతనం ఆ మనిషి నోటివెంట వినాలన్న కొంటె కోరిక పుట్టింది ఆదెయ్యకు.

"శీనివాసులు గారా! ఏ శీనివాసులుగారు? ఆయనేటి చేస్తారేటి?" అన్నాడు.

ఆ మనిషినే తేరపారచూస్తూ ఆ మనిషి వచ్చిన కారణాన్ని లోలోపలే అంచనా వేశాడు ఆదెయ్య. ఆయన దారితప్పి ఒచ్చిన మనిషిలా తడబడుతూ,

"అదే! ఇక్కడే ఇల్లని చెప్పారు ఎవరో" అన్నాడాయన.

"అలాగా! ఆయ నెలా ఉంటారో కాస్త చెప్పగలరేటి బాబూ! మా వాడలో పొట్టి సీనువాసులూ, బొండాం సీనివాసులూ, గెడకర్ర సీనివాసులూ అని సీనివాసులు సానమందుండారు బాబూ! మీకే సీనివాసులు కావాలో చెప్తే ఇల్లు ఇట్టే చెప్పేస్తా" అన్నాడు ఆదెయ్య చిలిపిగా.

"ఆయన్ని నేను పర్టింవేంతగా చూడలేదు తాతా! కాని ఆయన మృదంగం చాలా గొప్పగా వాయిస్తారు" అన్నాడు. ఆమాట విన్నాక తాత ఆనందంతో ఉబ్బిపోయాడు. నిటారుగా నిలబడి "అట్టయితే! ఆ శీనివాసులుగారి ఇల్లు ఇదే" అన్నాడు.

"శీనివాసులుగారు!" అన్నైతే అన్నాడు గానీ తనకు శ్రీనివాసులుకీ మధ్య దూరం పెరిగిపోన్నట్లనిపించింది ఆ గారు పిలుపులో. శ్రీనివాసులుకీ నాకూ దూరం పెంచే ఆ గారు నాకెందుకు? అనుకుని చనువుగా ప్రేమగా "ఒరే! సీనూ! నీకోసం ఓరో వచ్చినార్రా!" అని కేకేసి,

"ఇలా ఈ మంచంమీద కూచోండి బాబూ!" అంటూ ఎంతో మర్యాదగా అన్నాడు, ఆదెయ్య చేతులు కట్టుకుని వినయంగా నుంచుని,

"మంచినీల్లు గాని తీసుకుంటారా?" అని అడిగాడు.

అధునాతన కాలంలో మంచినీళ్ళు అడిగినా ఇవ్వరు కొందరిళ్ళల్లో. అవసర మైన పని ఉన్నదనుకొన్నవారినే కూర్చోమని ఆసనం చూపిస్తారు.

"ఈయనకు నేనెవరో, నే నేపనిమీద వచ్చానో!" అన్నైనా అడక్కుండా, ఆలోచించకుండా తనకు కలిగిన ఆసనంపై కూర్చోమని ఆహ్వానించి, ఆదరిస్తున్నాడంటే.... కులం తక్కువైనా గుణం ఎక్కువనీ, ధనం తక్కువైనా

మర్యాద తెలుసనీ అనిపిస్తోంది. మురికివాడల్లో లక్ష్మి నిలువదంటారు. కాని సరస్వతికి ఆ తారతమ్యాలు లేవు కాబోలు" అనుకున్నాడు ఆ వచ్చినాయన ఆ మంచంమీద కూర్చుంటూ. ఆ గుడిశని పరిశీలించి చూశాడు.

"వద్దు తాతా ! పొద్దున్నే దాహం ఏం వేస్తుంది? శ్రీనివాసులుగారు మీకే మౌతారు?" అని అడిగినదానికి అక్కడికి వచ్చిన శ్రీనివాసులు ఏమని సమాధానం చెపుతాడో వినాలని కుతూహలంగా చూశాడు తాత.

"మా తాతగారు. మీరు?.... అర్ధోక్తిలో" ఆగిపోయాడు శ్రీనివాసులు.

"నమస్కారం" అంటూ లేచి శ్రీనివాసులికి నమస్కరించి శ్రీనివాసుల్ని ఎగాదిగా చూశాడు ఆయన. అందమైన ఆ ముఖం చిరునవ్వులు చిందిస్తోంది.

"నా పేరు రామకోటి శర్మ. అన్నట్లు అసలు నేను వచ్చిన విషయం శల వియ్యనేలేదు కదూ ! శ్రీవాణిగారు మిమ్మల్ని ఒక మాటు పిలుచుకుని రమ్మన్నారు. కారు కూడా పంపారు." వచ్చినపని టూకీగానే చెప్పారు రామకోటి గారు.

"ఇప్పుడు సాధన చేసుకునే సమయం. సాయంత్రం వస్తాను" అన్నాడు శ్రీనివాసులు నమ్రతగా.

"అలాగే! సాయంత్రం కారు పంపమంటారా?" అని అడిగారు రామకోటిగారు.

"అక్కర్లేదు. నేనే వస్తాను. ఇల్లు ఎక్కడ?" అని అడిగాడు. రామకోటి గారు వివరాలన్నీ చెప్పి వెళ్ళిపోయారు.

## 5

సాయంత్రం చల్లపాటున స్నానంచేసి ఉతికిన బట్టలు వేసుకుని శ్రీవాణి ఇంటికి బయలుదేరాడు శ్రీనివాసులు.

చినబాబుగారిల్లు కనుక్కోడం ఏమంత కష్టం కాలేదు శ్రీనివాసులికి. రామకోటిగారు చెప్పిన గుర్తుల్నిబట్టి సూటిగా ఇంటిముందటికొచ్చి నిలిచాడు. లోపలి కెళ్ళడానికి బెరుకుగా అనిపించింది. కాని గేటులోపలికి వెడితేగాని ఇల్లు రాదు. ఇంట్లో కెడితేగానీ వారు కనపడరు. ఇంతదాకా వచ్చి తిరిగెళ్ళిపోతే వాళ్ళేమనుకుంటారు? రాలేదనుకుంటారు. పెద్దవాళ్ళంటే నిర్లక్ష్యమనుకుంటారు. ఎలాగైనా లోపలి కెళ్ళాలని ధైర్యంచేసి చిన్నగేటు మెల్లగా తోసుకుని లోపల అడుగుపెట్టాడు శ్రీనివాసులు. ఇల్లు చాలా లోపలికి ఉంది. ముందంతా చెట్లు ఉన్నాయి. బాట కిరువైపులా పూలమొక్కలు విరగపూసి ఉన్నాయి. అక్కడక్కడ పళ్ళచెట్లు కూడా కనిపించాయి. ఆ బాటవెంట నడుస్తుంటే చల్లని

మలయమారుతం మెల్లగా వీచింది. ఆ గాలి కదలికకే పూలబాలలు తల్లి ఒడి ఒదిలి శ్రీనివాసుల పాదాలు తాకి స్వాగతమిచ్చాయి. చీకటి పడకపోయినా ఇంట్లో లైట్లు వెలుగుతున్నాయి. ఇంట్లోకెళ్ళడానికి శ్రీనివాసులు సంశయించాడు. వరండా మెట్లదగ్గిరే ఆగిపోయాడు. ఇంతలో ఎవరో తియ్యని కంఠంతో, "ఎవరు మీరు? ఎవరు కావాలి?" అన్నారు. మాటలైతే వినిపించాయిగానీ మనుషులెవరూ కనిపించలేదు. మళ్ళీ రెట్టించి అడిగారు. శ్రీనివాసులు బిత్తర పోయాడు.

"మనిషి కనిపించకుండా మాటలేమిటి?" అనుకున్నాడు. అంతలో శ్రీవాణి బయటకు వస్తూ "ఎవరే! ఎవరొచ్చారు" అంది. వాకిట్లో శ్రీనివాసుల్ని చూడగానే_

"ఓ! మీరా? రండి. మీకోసమే ఎదురుచూస్తున్నాం" అంటూ శ్రీనివాసుల్ని లోపలికి పిలుచుకుని వెళ్ళింది శ్రీవాణి. హాల్లో ఎవరెవరో ఉన్నారు.

"రా శ్రీనివాసులూ!" అంటూ ఆప్యాయతగా ఆహ్వానించారు చినబాబుగారు. తన పక్కనున్న సోఫా చూపించారు. శ్రీనివాసులు ఇంతవరకూ ఎవరింటికీ వెళ్ళినవాడు కాదు. అందులో ఇటువంటి ఇంటికి, పెద్దలైనవారి ఎదుటికి కూడా ఎప్పుడూ వెళ్ళలేదు. అప్పుడప్పుడు తాత కచేరీలకు తీసుకెళ్ళినా ఎక్కడో చివరగా కూర్చుని విని ఇంటికొచ్చేయడమే అలవాటు. టిక్కెట్లు కొనుక్కుని వెళ్ళినా తక్కువ ధరది కొనుక్కుని చివరగా కూచునిరావటం తప్ప ముందు సోఫాల్లో ఎప్పుడూ కూచోలేదు. తనింట్లో సోఫాలు లేవు. చినబాబుగారి పక్కన కూచోవాలంటే ఎందుకో భయంతోపాటు బిడియం పుట్టుకొచ్చింది. ఎలాగో ఒకలాగా సోఫా అంచున ఒదిగి కూచుని తల వంచుకుని ముడుచుకుపోయాడు శ్రీనివాసులు. అక్కడివారంతా అతన్ని అదోరకంగా బైతుని చూసినట్లు చూశారు. ఆ చూపుల వాతావరణం మార్చాలనుకుంది శ్రీవాణి. శ్రీనివాసుల్ని అలా చూడటం సభ్యత కాదనుకుంది.

"నాన్నా! శ్రీనివాసులుగారికి అందర్నీ పరిచయంచేస్తే బాగుంటుందేమో!" అంది.

"ఔనౌను. ఏమిటో! అతనొచ్చిన సంతోషంలో మరిచేపోయా తల్లీ! శ్రీనివాసులూ! వీరు కుబేరరావు గారని మంచి సంగీత ప్రియులు. కళాకారులకు కావలసిన చుట్టం. పేరుకే కాదు నిజంగా కుబేరులే" అంటూ పరిచయం చేశారు చినబాబుగారు.

"గ్లాడ్ టూ మీట్ యూ" అంటూ షేక్‌హాండ్ ఇయ్యబోయారు కుబేరరావు









---

గారు. పాపం శ్రీనివాసులకీ సంఘ మర్యాదలేమీ తెలియవు. చెయ్యి అందించ లేదు సరికదా, నమస్కారం అని కూడా అనలేదు. ఓ మాటు తలెత్తి కుబేర రావుని పెళ్ళికొడుకుని పెళ్ళికూతురు పెళ్ళిచూపుల్లో చూసినట్లు చూసి తల దించుకున్నాడు శ్రీనివాసులు. కుబేరరావు ముఖం చిన్నబోవటం శ్రీవాణి గమనించింది. కాని శ్రీనివాసులు అలా ఎందుకు చేశాడో తెలియలేదామెకు.

"వీరు నీకు తెలుసుగా! రామకోటిగారు మాకు దూరపు బంధువులేకాక ఆప్తులు. మిత్రులు" అన్నారు, రామకోటిగార్ని చూపిస్తూ. రామకోటిగారు, "నీకూనోయ్! నేను అందరికీ మిత్రుడ్ని. ప్రజామిత్రుడ్ని" అంటూ నవ్వారు. దానికీ శ్రీనివాసులు నోరెత్తలేదు. శ్రీవాణి అతన్నే పరికిస్తోంది.

"ఇకపోతే నా సంగతి. నే నెలా చెప్పాలి? రామకోటిగారూ! ఆ వంతు మీది" అన్నారు చిట్టిబాబుగారు.

"చినబాబుగారు వీణా విద్వాంసులేకాక శ్రీవాణికి తండ్రి. సంగీత విభావరికి కూడా జన్మనిచ్చిన తండ్రి. అంతకుమించి వారి ఎదుట నేనెక్కువ చెప్పలేని బలహీనుడ్ని" అన్నారు నవ్వుతూ.

ఇంతవరకూ అన్నీ విన్నాడు శ్రీనివాసులు. కాని పెదవి కదపలేదు. కన్ను ఎత్తి చూడలేదు. అన్నిటికీ తల ఒంచుకుని చిరునవ్వు నవ్వాడు.

"నన్నెందుకో రమ్మన్నారని...." పిలిచిన విషయం చెపితే వెళ్ళిపోతా అన్నట్లుగా అడిగాడు శ్రీనివాసులు భయంభయంగా.

శ్రీవాణి అతని అవస్థ చూసి జాలిపడింది అతనిలో ఏదో లోపం, భయం కనిపించాయి ఆమెకు అందుకే అతను అందరిలా ప్రవర్తించలేకపోతున్నా డనుకుంది. అవటివారెవరికీ శ్రీనివాసుల విషయం, స్థితిగతులు తెలియవు.

"అవును. కచేరీలో చాలా అద్భుతంగా మృదంగం వాయించిన నీకు తన అభినందనలు తెలుపుకోవాలనుకుంది అమ్మాయి. అందుకని ఆడపిల్లని మీ యింటికి పంపడం కంటే, మిమ్మల్నే ఇక్కడికి ఆహ్వానిస్తే బాగుంటుందని..." శ్రీనివాసుల్ని పిలిపించిన కారణం వివరించారు రామకోటిగారు.

అంతలో పనిపిల్ల కాఫీలు తెచ్చింది. శ్రీవాణి అందరికీ ఆదరంగా అందించింది. అందరూ తాగుతున్నా శ్రీనివాసులు తాగలేదు. అతనికి అలవాటు లేదు. "నాన్నా! వారికి కాఫీ అలవాటు లేదేమో! పోనీ పాలు తెప్పిచ్చమంటారేమో అడుగు" అంది శ్రీవాణి. శ్రీనివాసులు ఎదురుగుండా ఉన్నా, తను అడక్కుండా తండ్రినే అడగమని అడగటం రామకోటిగారికి నచ్చచేసింది. అలా ఆమె అడగకపోవడం ఆమె సంస్కారం: పెద్దల ఎదుట వయసొచ్చిన పిల్లలు అలా ప్రవర్తించడం, వారికీ పెద్దలకూ గౌరవాన్ని తెచ్చిపెడతాయి. రామకోటిగారికి తెలుసు శ్రీవాణి పదిమందిలోకి వెడుతున్నా హద్దులు మీరదు. అతిచనువు తీసుకోదు. ఎదుటివారు అతిచనువు తీసుకుని వెకిలిగా ప్రవర్తిస్తే సహించదు.

"ఔనౌను. కాఫీ ఆరోగ్యానికి మంచిది కూడా కాదు కదూ! ఏం బాబూ! శ్రీనివాసులూ! పాలు తీసుకుంటావా?" కూతురు ఏదీ అపసవ్యంగా మాట్లాడదని చినబాబుగారి నమ్మకం. అందుకని ఆమె చెప్పింది వేదవాక్యంగా పాటిస్తారు చినబాబుగారు. తన బరువు భారం అంతా ఆమెమీద వదిలేసి నిశ్చింతగా ఉంటారు. ఆమె ఏం చెపితే అది చేస్తారు. ఏది అంటే అది వింటారు.

శ్రీనివాసులు అదీ ఒద్దన్నట్లుగా అడ్డంగా తల ఊపాడు. కుబేరరావుకి శ్రీనివాసులు మాట్లాడకపోవడం నచ్చలేదు. అది తనని అగౌరవ పరుస్తున్నట్లుగా ఊహించాడు. తాము తన తాహతుకు తగనివాళ్ళమని, తమ ఎదుట మాట్లాడటం తనకి ఇష్టంలేదని వ్యక్తంచేస్తున్నట్లు భావించుకున్నాడు కుబేరరావు.

"శ్రీనివాసులుగారికి పాలు, కాఫీటీలు అలవాటు లేనట్లుంది. ఇంకేదైనా పుచ్చుకునే అలవాటేమో!" అన్నాడు విషపూరితంగా నవ్వుతూ, శ్రీనివాసులు వంక చూస్తూ.

అతనన్న 'ఇంకేదైనా' అన్నమాటకు అర్థం శ్రీవాణికి అర్థమైంది. కుబేరరావు వంక చురచురా చూసింది. కాని కుబేరరావు ఆమెని చూడటంలేదు.

శ్రీనివాసులుకి ఈ ద్వంద్వార్థాలూ, వ్యంగ్యాలు ఏమీ తెలియవు. అర్థంకావు. అతనికి తెలిసిన ప్రపంచం తన గుడిశ. తెలిసిన మనుషులు తల్లి, తాత దూరాన్నించి చూస్తున్నా గురువుగారు.

తాతకు ఏ దురభ్యాసాలూ లేవు. అటువంటి మాటలు గానీ, అటువంటివారి సంపర్కం గానీ తాతకు లేవు. శ్రీనివాసుల్ని అటువంటివారితో ఎన్నడూ స్నేహం చెయ్యనివ్వలేదు. అతని ప్రపంచంలో అతను విన్నవి మంచిమాటలు. మెలిగింది తల్లీ తాతల మధ్య. అందుకే కుబేరరావు మాట అతనికి అర్థం కాలేదు. అపార్థం చేసుకోలేదు. అతనికి ఉప్పేసిన గంజి, తరువాణి తప్ప మరే ద్రవపదార్థం తాగడం అలవాటు లేదు. చిన్నప్పటినుంచీ అదే తల్లి నేర్పింది. అదే అలవాటు అయింది.

కుబేరరావు అన్నమాటలు శ్రీనివాసులుగార్ని అవమానిస్తున్నట్లుగా అనిపించింది శ్రీవాణికి. ఎవరినీ పరుషంగా మాట్లాడినా, అవమానించినా శ్రీవాణి సహించ లేదు. "వారికే అలవాటున్నా మీకు మాత్రం మరేదో పుచ్చుకునే అలవా టున్నట్లుంది! పెద్దవాళ్ళ ఎదుట మాట్లాడేటప్పుడు కాస్త ఇదిగా మాట్లాడాలి. ద్వంద్వార్థాలు, వ్యంగ్యాలు ఎదుటివారిలో అపార్థాలు రేపుతాయి." ఒకపక్క చురకలేస్తూనే, మరొక పక్క నవ్వింది. ఆమె నవ్వుతూ మాట్లాడినా ఆమె సూది కాల్చి వాతపెట్టిందని తెలుసుకున్నాడు కుబేరరావు. విషయం మార్చకపోతే సూది చురకలు మాని గడ్డపలుగులతో వాతలు పెడుతుందని కుబేరరావుకు తెలుసు. అందుకే మాట మారుస్తూ, "శ్రీనివాసులుగారూ! నాకే కాదు చాలామంది సభలో మాధవయ్యగారు చెప్పింది నమ్మలేకపోయారు. తాను ద్రోణాచార్యుడి నన్నట్లుగా మీరు ఏకలవ్యుడుగా పోల్చిచెప్పారు కదా! అది నిజమే నంటారా? ఒకటి మాత్రం నిజమని నమ్మవచ్చు. మీరు వెళ్ళి విద్య చెప్పమని కోరితే ఆయన నిరాకరించి ఉండొచ్చు ద్రోణాచార్యుల వారిలాగా. అవునా?" కుబేరరావు హేళనస్వరంతో అన్నాడు.

దానికి శ్రీనివాసులేమీ సమాధానం చెప్పలేదు. కాని చినబాబుగారికి చిరాకనిపించి, "ఏం! అందులో నమ్మశక్యం కాని మర్మరహస్యం ఏముంది? భారతంలో ఏకలవ్యుడి కథ, ఎవరో కవి ఎప్పుడో వ్రాస్తే, అది జరిగినట్లే నమ్ముతున్నారు. ఇప్పటికీ నమ్ముతూనే ఉన్నారు. మరి మాధవయ్యగారు చెపితే నమ్మలేకపోవడానికి కారణమేమిటి? అలా ఈ రోజుల్లో జరగదనా? జరక్కూడదనా?" అన్నారు చినబాబుగారు.

కుబేరరావు తలెత్తి "ఉన్నది చినబాబుగారూ! భారతంలో ద్రోణుడు ఏకలవ్వుడు ఒక్కడికే విద్య నేర్పనన్నట్లు వ్రాశాడు వ్యాసుడు. కాని....అభినవ ద్రోణాచార్యులనని చెప్పుకున్న మృదంగం మాధవయ్యగారు ఎవరికీ, మర్మం విడిచి విద్య నేర్పించలేదు. ఎవర్నీ పైకి తీసుకురాలేదు. అందుకే నమ్మలేక పోతున్నాను." కుబేరరావు మాటల్లో కసి కచ్చతో కూడి కటువుగా వినిపించాయి అందరికీ. శ్రీనివాసులు గురువే తల్లి, తండ్రి, దైవం అని గురువుగారు ఎన్నోమాట్లు చెప్పగా విన్నాడు. అదేమాట తాత కూడా చెప్తాడు. శ్రీనివాసులు తలలో ఆ మాటలే నాటుకుపోయాయి. అదే అతనికి గురువంటే అమిత భక్తి, భయం, విశ్వాసం కలిగించాయి. దైవంలాంటి గురువుగారిని కటువుగా మాటలంటే విని సహించలేకపోయాడు. చివ్వున తలెత్తి చూశాడు. ఏదో అనబోయాడు. అంతలో కుబేరరావు అందుకుని "ఆ కారణంగానే శ్రీనివాసులు గారికి తానే గురువునని అబద్ధం చెపుతుంటే ఎలా నమ్మమంటారండీ!" అన్నాడు తేలికభావంగా.

"మీరు నమ్మలేకపోయినా ఆయనే నా గురువులు" అంటూ లేచి నుంచున్నాడు శ్రీనివాసులు అసహనంగా. అతని ముఖం చిరాకుగా ఉండటం అక్కడివారంతా గమనించారు, కుబేరరావు తప్ప. శ్రీనివాసులు మాట్లాడటమే అపురూపంగా భావించింది శ్రీవాణి. అందులో నూతన అభిప్రాయాన్ని అంత ఖచ్చితంగా భయంలేకుండా చెప్పినందుకు సంతోషించింది. శ్రీనివాసులు అందమైన మనిషి, ఆరోగ్యమైన మనిషేకాక, మానసిక అందం, ఆరోగ్యకరమైన గురుభక్తి కూడా ఉందని గ్రహించింది శ్రీవాణి. వాతావరణం అదోరకంగా మారింది.

"విన్నారుగా కుబేరరావుగారూ! శ్రీనివాసులుగారికి ఎవరి నమ్మకాలతోనూ ప్రమేయం లేదు. పైగా వాదనలంటే కూడా వారికి గిట్టనట్టుంది. అది సరే!.... నాకూ ఓ ధర్మ సందేహం. అసలాయన ఎవరికీ విద్య నేర్పించలేదని అనటానికి సాక్ష్యమేమైనా ఉందా?" కుబేరరావు అసలు బాధ ఏమిటో తెలుసుకోవాలన్నట్లుగా అన్నారు రామకోటిగారు. అసలు విషయమేదో ఉందని అనుమానం. "నేనున్నాను చాలదుటండీ" కోపంగా ముఖం గిర్జాగాచేసుకుని అన్నాడు కుబేరరావు.

"ఐతే మీరు మృదంగం కూడా నేర్చుకున్నారా ఏమిటి?" రామకోటిగారు ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిగా చేసి అన్నారు. కుబేరరావు సంగీతం, నృత్యం, సాహిత్యం, చదువు ఒకటేమిటి సమస్త కళల్లోనూ వేలెట్టి తీసిన వ్యక్తని రామకోటిగారికి తెలుసు. ఒక్క మృదంగం విషయం మాత్రం ఎప్పుడూ చెప్పే

అవకాశం రాలేదు కుబేరరావుకి. కుబేరరావుకి ఆ ప్రశ్నతో కాస్త హుషారు పుట్టింది.

"ఎప్పుడూ మీకు చెప్పలేదా ? అదీ వెలగబెట్టాలెండి చిన్నప్పుడు" అన్నాడు.

"అలాగా! చాలా సంతోషం. ఎంతకాలం నేర్చుకున్నారు ? ఎంతదాకా నేర్చుకున్నారు ?" రామకోటిగారికి కబుర్లంటే మహా ఇష్టం. అందులోనూ చర్చలు, వాదనలంటె మరీను. కుబేరరావుని కదిలిస్తే కబుర్లు దొర్లి కాలక్షేపం అవుతుంది.

"అయ్యోరామ. ఎంతకాలం నేర్చుకున్నా ఎంతదాకానూ వెళ్ళలేదు. అసలాయన చెప్తేగదా నాకొచ్చేది." అన్నాడు వెటకారంగా.

వారిద్దరి మాటలూ శ్రోతలకు వినోదకరంగా ఉన్నాయి. శ్రీనివాసుల్ని కూర్చోమన్నట్లు అర్థింపుగా చూశారు చినబాబుగారు. పెద్దలమాట జవదాటలేని శ్రీనివాసులు చతికిలబడ్డాడు అయిష్టంగానే. రామకోటిగారు మెల్లగా మాటల్లోకి దించారు కుబేరరావుని. "అంటే మీకు ఆయన నేర్పలేదంటారు. నేర్పితే, మీకొచ్చేదే అంటారు! అసలింతకీ అడగటమే మరిచాను. మీరు ఏం చదివారు ? ఏమేం నేర్చుకున్నారు ? మీ విద్యాభ్యాసం ఎన్నో ఏట ప్రారంభించారు ? మా కందరికీ వినాలని ఉంది. మీ చురుకుదనం, మీ తెలివితేటలూ మాకు తెలిసినవే అయినా మీనోట వినాలని ఉంది." అంటూ కుబేరరావుని ఉబ్బేశారు రామకోటిగారు. కుబేరరావు ఉబ్బిపోయాడు.

"నా మూడో ఏటే మా అమ్మ బళ్ళో వేసిందట. నేను చాలా చురుగ్గా ఉండేవాణ్ణిట. ఇప్పుడూ చురుకే అనుకోండి. ఆటలు, పాటలు, నాటకాలు, చదువు, మృదంగం ఒకటేమిటి అన్నింట్లోనూ నావే ఫస్టు మార్కులు." అన్నాడు గర్వంగా

"అలాగా ! అయితే ప్రతి సబ్జక్టులోనూ పర్ఫెక్ట్ అన్నమాట మీరు. అన్నింట్లోనూ డిగ్రీలు సంపాదించి పారేశారనుకుంటాను ?" అన్నారు రామకోటిగారు నవ్వుతూ

"లేదు." తలదించుకుని అన్నాడు కుబేరరావు.

"ఏం !"

"మొదట్లో అన్నింట్లోనూ ఉండమని అమ్మ ప్రోత్సహించింది. ప్రతి క్లాసూ రెండు రెండు మార్లు తప్పి పదోక్లాసు కంపార్టుమెంట్లుగా కూడా పాసుకాలేదు. అందుకే చదువుతో పాటు అన్నీ మానేశాను."

"చూశారా! అన్నింట్లోనూ విద్య గడించి ప్రవీణత పొందడం చాలా కష్టం. ఏదో ఒక విద్య ఎన్నుకోవాలి. దాన్ని సాధించాలి. లేకపోతే రెంటికీ చెడ్డ రేవడిలా అవుతుంది జీవితం." అన్నారు రామకోటిగారు.

"అదేం కాదు. మృదంగమంటే నా కెంతో ఇష్టం. అది నేర్చుకుని సినిమాల్లో వాయించాలని నా కోరిక. కాని మాధవయ్యగారు ఎప్పుడూ నేర్పించేవారు కాదు. ఎవడో డబ్బా శిష్యుడ్ని నేర్పించమనేవారు. ఆయన ఊళ్ళో ఉండేదే అరుదు. కబుర్లతో కాలక్షేపం చేయటం తప్ప విద్యార్థులని వృద్ధిలోకి తేవాలనేదే లేదాయనకు. నా నాశనానికి కారకుడాయన" కసిగా అన్నాడు కుబేరరావు.

"ఏం! ఆయనొక్కరే దొరికారా మీకు నేర్పడానికి? ఉచితంగా చెప్తారు విద్వాంసులన్న ఆశతో వెళ్ళారు. ఆయన చెప్పేది చీమంతే ఉన్నా ఏనుగంత సాధన అవసరం. లలితకళకు జీవితంలో సగభాగం నిద్రకైతే మిగతా సగ భాగం సాధనకే వినియోగించాలి. కుబేరరావుగారూ! మీరు సకలవిద్యాపారంగతులు కావాలని ఆశించారు. పూర్వులు వేలసంవత్సరాలు జీవించేవారు. అనేక కళలు సాధించేవారు. కాని మన కాలపరిమితి స్వల్పం. ఏదో ఒకదానిలోనే సంపాదించడం కష్టం. తొక్కుడు బిళ్ళ ఆడినట్లు ఎగురుతూ ఇక్కడో కాలూ అక్కడో కాలూ పెడితే ఏ గడిలోనూ నిలవక బయటే మిగిలిపోతాం. గురునింద మహాపాపం. ఆయన చెప్పలేదనే కంటే ఆయన దగ్గిర నేర్చుకోలేకపోయామని అనుకోడం మంచిది. అందుకే పూర్వం విద్యార్థులు గురువుల వెంటవెంట తిరుగుతూ వారు చెప్పినప్పుడే నేర్చుకునేవారు. ఇప్పుడో విద్యార్థులు వచ్చినప్పుడు చెప్పాలని అనుకుంటున్నారు. మీలాగా ఈ దేశంలో ఎందరెందరో ఏ విద్యలోనూ పాండిత్యం సంపాదించలేక దిగబడిపోతున్నారు. సాధనతో సాధించలేనిది లేదు." పత్తివిప్పి పోగుపోసినట్లు చెప్పారు రామకోటిగారు. కుబేరరావు సిగ్గుపడినా దాన్ని క్షణంలో దులిపేసి—

"అయినా లక్ష్మీసరస్వతులు ఒకచోట ఉండవని సామెతేగా! అందుకే నాకు చదువు రాలేదు," అన్నాడు తేలిగ్గా నవ్వేస్తూ.

"అదేం లేదు. అమ్మాయి శ్రీవాణికి సరస్వతి నాలుకపైన, లక్ష్మి చేతుల్లోనూ ఉంది మరి. చినబాబుగారు అమ్మాయిగార్ని చదువుకునే సమయంలో ఎప్పుడూ తన కూతురుగా చూడలేదు. ఒక విద్యార్థినిగా చూశారు. కఠినంగా శాసించేవారు. అమ్మాయికి లోకజ్ఞానం కోసం కొంత చదివించారు. ఆ తరువాత పాండిత్యం సంపాదించాలని చదువు మాన్పించి సాధన చేయించారు. దాని ఫలితం మన




మంతా చూస్తూనే ఉన్నాం." అని రామకోటిగారు ప్రశంసించారు చినబాబుగారిని పరోక్షంగా.

"మరి చాలా సమయం అయింది. నేను శలవు తీసుకుంటాను," అని అక్కడి వారందరికీ పేరుపేరునా చెప్పి వెళ్ళిపోయారు కుబేరరావు. ఆయన వెంట రామకోటిగారూ శలవు తీసుకున్నారు.

ఇక మిగిలింది తండ్రీకూతుళ్ళ మధ్య శ్రీనివాసులు. తలదించుకుని క్షణాలు లెక్కిస్తూ కూర్చున్నాడు. సిగ్గుపడుతున్నాడని గ్రహించారు చినబాబుగారు.

"శ్రీనివాసులూ! సాధనతో సాధించలేని దేమీలేదు నాయనా! కచేరీలో మరి కొన్ని మెళకువలు తెలుసుకుంటే నీకు మంచి భవిష్యత్తు ఉంటుంది. నీకు వీలు చిక్కినప్పుడు వస్తుండు. నా అనుభవాన్ని మాటల్లో నీకు అందిస్తాను. అన్నట్లు నీ నవమృదంగం ఎప్పుడెప్పుడు వినాలా అనిపిస్తోందయ్యా!" అప్యాయతగా అడిగారు చినబాబుగారు.

"పోనీ మన సంగీత విభావరిలో ఏర్పాటుచేస్తే అందరూ విని ఆనందిస్తారుగా నాన్నా?" సలహాయిచ్చింది శ్రీవాణి.

"అలాగే! ఎప్పుడో వీలునుబట్టి ఏర్పాటు చెయ్యమని రామకోటిగారితో చెప్తానులేమ్మా. అన్నట్లు స్నానం చెయ్యాలి. చిరాగ్గా ఉంది. మీరిద్దరూ మాట్లాడుతూ ఉండండి.. నే నిప్పుడే వస్తా" అంటూ చినబాబుగారు లోపలికి

వెళ్ళారు. శ్రీవాణి ఒక్కతే ఉండటంతో ఇష్టంగా శ్రీనివాసులు మరీ ముడుచుకుని పోయాడు.

"నిన్న మీరు చాలా అద్భుతంగా వాయించారు. ముగించిన కచేరీ మళ్ళీ ప్రారంభించి పాడాలనిపించింది మీరు మొహర వాయిస్తుంటె. ముక్తాయింపు ఇవ్వకుండా మీరు అరాగే వాయిస్తూఉంటే బాగుండుననిపించింది. ఎప్పుడూ నేను పక్క వాయిద్యకారులని తలకిందులు చేస్తానని భయపడతారు. కాని నిన్న మీరే నన్ను తలకిందులు చేశారు. నేను నా ఓటమిని అంగీకరిస్తున్నాను. కంగ్రాచ్యులేషన్స్ మిష్టర్ శ్రీనివాసులూ!" అంది, శ్రీవాణి హృదయపూర్వకంగా అభినందిస్తూ.

శ్రీనివాసులూ అన్నమాట తప్ప దానికి ముందున్న మాటల అర్థం శ్రీనివాసులుకు తెలీదు. చిరునవ్వు నవ్వి,

"మీరు కూడా చాలా బాగా పాడారు." అన్నాడు.

"థాంక్స్" అంది శ్రీవాణి. ఆమె అన్నదేమిటో అర్థంకాక నోరు వెళ్ళబెట్టాడు శ్రీనివాసులు. ఆమె పదాలకు అర్థాలు ఏమిటో అడగాలనిపించింది కాని బిడియపడి అడగలేదు శ్రీనివాసులు బాగుండదని. కాని శ్రీవాణి గ్రహించింది, అతను పదిమందిలో తిరిగినవాడు కాదని.

కాని శ్రీవాణి మెత్తని మాటలు శ్రీనివాసుల్ని అకర్షించాయి.

"ఇదే మొదటి కచేరీనా ? లేక ఇదివరకెక్కడైనా వాయించారా ?" సందేహ నివృత్తి కోసమే అడిగింది శ్రీవాణి.

"ఇదే మొదలు. ఇదివరకు నే నెప్పుడూ వాయించలేదండీ!" చాలా చీకటైనట్లుంది. నేను వెడతాను. నాన్నగారు నవమృదంగం ఎప్పుడు వాయించమంటే అప్పుడు వాయించి వినిపిస్తానని చెప్పండి" అన్నాడు నమ్రతగా.

"చాలా థాంక్స్" అంది శ్రీవాణి.

మాటిమాటికీ ఆ పదం వాడుతుంటే తెలుసుకోకపోతే ఏం కొంపముంచే పదమో ! అదేం భాషో అని భయంవేసి, అతి కష్టంమీద మాట పెగల్చుకుని

"శ్రీవాణిగారూ ! థాంక్స్ అంటే ఏమిటి ?" అని అడిగాడు. శ్రీవాణికి ఎందుకో శ్రీనివాసుల్ని చూస్తే జాలేసింది. అతనికేమీ తెలియదని గ్రహించుకుంది. అందుకే ఎవరేది అడిగినా ముభావంగా ఉన్నారనుకుంది.

"అదా ! థాంక్స్ అంటే అభినందనలన్నమాట. ఎవరైనా ఏదైనా ఇచ్చినా పొగిడినా థాంక్స్ అంటారు. అది నాగరికత. ఎవరినైనా ఏదైనా అడగాలంటే

ప్లీజ్ అని అడగటం మర్యాద. ఎవరినైనా మెచ్చుకోవాలంటే కంగ్రాట్యులేషన్స్" అని అంటారు." శ్రీనివాసులుకి తెలియనివి తెలియచెప్పాలనిపించింది శ్రీవాణికి శ్రీవాణి చెపుతుంటే శ్రద్ధగా ఆలకించాడు బుద్ధిమంతుడైన విద్యార్థిలాగా. శ్రీనివాసులు వెడుతుంటే "గుడ్‌నైట్ అంటే మంచి రాత్రని అర్థం" అంది, మరో పదం నేర్పుతూ. శ్రీనివాసులు వరాండాలోకి రాగానే "గుడ్‌నైట్" అని వినిపించింది. ఎవరా అని ఆగి చూశాడు.

శ్రీవాణి నవ్వుతూ "అది మా మైనా లెండి. మహా వాగుడుకాయి. అది పేరుకు పక్షిగాని నాకు మంచి స్నేహితురాలు. నా మంచిచెడులు, కష్టసుఖాలు అన్నీ దాంతోనే చెప్పుకుంటాను ఒంటరిగా ఉన్నప్పుడు. అదీ ఏదో ఒకటి నేను చెప్పింది చెప్పినట్లుగా వాగుతుంది. కదూ మైనా ?" అంది శ్రీవాణి నవ్వుతూ.

"కదూ మైనా ?" అంది మైనా తనూ నవ్వుతూ.

"ఛీ ! పోవే పోకిరీ ! వారెవరనుకున్నావ్. శ్రీనివాసులువారు. మర్యాదగా నేర్చుకో. చుప్" అంది. అదీ అలాగే అని నోరు మూసుకుంది.

శ్రీనివాసులుకి ఆ మాట్లాడే పిట్ట చిత్రంగా ఉంది.

దారి పొడుగునా, "థాంక్స్, గుడ్‌నైట్, కంగ్రాచ్యులేషన్స్" అని మననం చేస్తూ ఇల్లుచేరాడు.

## 6

శ్రావణమేఘాలు దట్టంగా అలుముకున్నాయి. రెండు మూడు రోజుల్నించీ కురిసినవాన ఆ రోజు తెరిపిచ్చింది. సూర్యభగవానుడు మూడురోజుల తరువాత కనిపించాడు. పచ్చని చెట్లపై తన లేలేత కిరణాలు ప్రసరింపచేశాడు. చెట్ల ఆకులపైన నిలిచిన నీటిచుక్కలు భానుని కిరణాలు తగిలి ఆకుపచ్చ ముత్యాల్లా మెరుస్తున్నాయి.

సీతమ్మ వాకిలి ఊడ్చి ముగ్గేస్తోంది. తాత అనపపాదుకు కుదురుచేసి తాళ్ళు కడుతున్నాడు. శ్రీనివాసులు అప్పటికే సాధన ముగించి స్నానంచేసి గురువుగారి పాదాలకు నమస్కరించుకుని బయటకు వచ్చాడు. శ్రీనివాసులు అడుగుల శబ్దం విని తలెత్తి,

"ఎక్కడికిరా ! ఇంత పొద్దున్నే బయలుదేరావు ?" అంది సీతమ్మ. తెల్ల పైజామా, తెల్ల లాల్చీ వేసుకున్న శ్రీనివాసులు ఎంతో అందంగా కనిపించాడు. తన దృష్టి బిడ్డకు ఎక్కడ తగులుతుందో అని తలతిప్పి థూథూ అని ఉమ్మేసి కళ్ళనులుముకుంది. తాతకూడా అప్పుడే తల తిప్పిచూశాడు శ్రీనివాసుల్ని.

రెండు నెలల క్రితం శ్రీనివాసులుకీ ఇప్పటి శ్రీనివాసులుకీ ఎంతో తేడా కనిపించింది. వేషం, భాష మారాయి. శ్రీనివాసుల్ని చూస్తే గర్వంగా అనిపిస్తోంది తాతకి.

"ఎల్లుండి శ్రీవాణిగారి ప్రోగ్రాం ఉంది. ప్రాక్టీసుకోసం వెడుతున్నానమ్మా" అన్నాడు దువ్వుకున్న తల చేతితో సర్దుకుంటూ.

ఇప్పుడు శ్రీవాణి చినబాబుగార్ల కచేరీల కన్నిటికీ శ్రీనివాసులే మృదంగం వాయిస్తున్నాడు. క్రమంగా ఈ రెండు నెలల్లో లోకానికి చాలామటుకు పరిచయమయాడు.

"సర్లే. ఇప్పుడెడితే ఎప్పుడొస్తావో ఏందో! కూసింత సద్దెన్నం ఉంది. తినిపో!" అంది. సీతమ్మ చెయికడుక్కొని చీరకు చెయ్యి తుడుకుంటూ లోపలికెళ్ళింది. శ్రీనివాసులు ఆమెవెంట లోపలికి వెళ్ళాడు.

"తాతా! నే వెళ్ళొస్తా. ఎవరైనా నాకోసం వస్తే చినబాబుగారింటికి పంపు" అని చెప్పి వెళ్ళాడు. ఈ మధ్య ఊళ్ళో ఒకరిద్దరి కచేరీలకు వాయించాడు. అందుకని ఎవరో ఒకరు వస్తూంటారు. పూర్వంలాగా చినబాబుగారు శ్రీవాణిల దగ్గర ఇప్పుడు శ్రీనివాసులు అంత బయపడటంలేదు. సిగ్గుతో ముడుచుకుపోవటంలేదు. ఆ తండ్రీకూతుళ్ళ దగ్గిర కొత్త చనువు ఏర్పడింది. చినబాబుగారి ఇంటికి తరుచు రావడం, సంగీతపరమైన విషయాలు మెళకువలు చినబాబుగారు చెప్పటం, శ్రీనివాసులు శ్రద్ధగా ఆలకించి ఆ విషయాల్లో కృషిచెయ్యడంవల్ల ఎన్నెన్నో మెళకువలు అవగాహన అవుతున్నాయి. శ్రీవాణికూడా ఇతర విషయా మాట్లాడదు. సంగీత సాహిత్యాల గురించి, కృతికర్తల గురించి, వారి జీవితాల్ని గురించీ ఎన్నెన్నో చెబుతుంది. అతని పరసనల్ విషయాల జోలికి పోలేదు. శ్రీనివాసుల్ని ఆమె ఎప్పుడూ అడగలేదు. ఊరు, పేరు, అతని ఇంటి పరిస్థితి, కులం, గోత్రం వాటితో ఆమెకు పనిలేదు.

శ్రీనివాసులు మాట్లాడడు. శ్రీవాణి చెప్పేవన్నీ అతిశ్రద్ధగా వింటాడు. మననం చేస్తాడు. ఆమె భాష అతనికి నచ్చింది. అసలుకూడా శ్రీనివాసులు తల్లీ తాత లాగా మాట్లాడకపోవడానికి మాధవయ్యగారే కొంత కారకులు. చిన్నప్పటి నుంచీ ఆయన మాట్లాడినట్లే మాట్లాడి అనుకరించటంతో మాటలో స్పష్టత, మంచి పదజాల ఉపకరణ వచ్చింది. ఇప్పుడు శ్రీవాణి స్నేహంతో తనింత వరకూ తెలుసుకునే అవకాశంలేని లోకనాగరికతా విషయాలలోకూడా సంస్కరింప బడ్డాడు.

చినబాబుగారి ఇల్లు ఆరోజు ముగ్గులు తోరణాలతో కళకళలాడిపోతోంది. శ్రీనివాసులు అడుగుపెట్టగానే, వరండాలో ఉన్న మైనా ముందుగా మర్యాదచేసింది. శ్రీనివాసులు గుమ్మంలో కాలుపెట్టగానే "రండి. కూర్చోండి. మంచినీళ్ళు కావాలా?" అంది. దాని మర్యాద శ్రీనివాసులుకి ఎంతో ఇష్టం. పంజరం దగ్గిరకెళ్ళి, "మాటలు నేర్చిన మైనా! మంచినీళ్ళొద్దమ్మా! నీ మంచి మనసు చాలమ్మా!" అన్నాడు. మైనా వెంటనే "శ్రీనివాసా! ఎక్కడున్నావయ్యా! నా మనసెరిగి మాట్లాడవయ్యా!" అంది. శ్రీనివాసులికి ఆశ్చర్యమేసింది. మైనాకి ఇన్ని మాటలెలా వచ్చాయో అని ముచ్చటేసింది.

"ఏం! నాతో మాట్లాడాలని నీకంతకోరికా? నీతో ఎన్నెన్నో మాట్లాడాలని నాకూ ఉంటుంది. నువ్వంటే నాకెంతో ఇష్టం. అందుకే, నీకోసమే నేనిక్కడికి వస్తున్నా" అన్నాడు. చిలకని ముద్దెట్టుకున్నట్లుగా పంజరాన్ని ముద్దెట్టున్నాడు. ఎవరో వచ్చిన అలికిడై తల తిప్పిచూశాడు. గుమ్మంలో శ్రీవాణి కనిపించింది. తనవంకే తదేకంగా చూస్తోంది. తలంటి పోసుకున్నట్లుంది. ఒదులుగా జడ లేసుకుని తలనిండా చేమంతులు తురుముకుంది. నుదుట పెద్ద కుంకుమబొట్టు, కళ్ళనిండా కాటుక, మెడనిండా నగలు, ఆరెంజికలర్ బార్డరున్న ఆకుపచ్చ పట్టుచీర, అదే రంగు జాకెటు, కాళ్ళకి పసుపు, గజ్జెలపట్టాలు, అచ్చు మహాలక్ష్మి లాగా ఉంది శ్రీవాణి.

రోజూ తను చూసే అలంకరణకు ఇప్పుడు శ్రీవాణి అలంకరణకు చాలా తేడా కనిపించింది. అసలు ఆమెని అంత ఇదిగా చూసిందికూడా ఇవాళే. ఆమె ఎప్పుడూ చాలా సింపుల్‌గా అలంకరించుకుంటుంది అయినా అందంగా ఉంటుంది. తననే రెప్పవాల్చకుండా చూస్తున్న శ్రీనివాసుల్ని చూసి సిగ్గుపడింది శ్రీవాణి.

"ఏమిటి మా మైనా మిమ్మల్నేమైనా అంటోందా? పెంకిపిల్ల," అంది నవ్వుతూ. ఆ నవ్వులో పారిజాతాలు విరిసి రాలినాయి. ఆమె మాట విని మైనా "పెంకిపిల్ల" అంది చిన్నగా. శ్రీవాణి నవ్వినట్లే ముసిముసిగా నవ్వింది.

"ఇదే దీంతో కష్టం శ్రీనివాసులుగారూ!" దానిముందు నుంచుని ఎవరు ఏది మాట్లాడితే అదే పొద్దంతా వాగుతుంది. మళ్ళీ ఎవరైనా వచ్చి మరోమాట మాట్లాడిందాకా అదేమాట వాగుతుంది. అన్నట్లు ఎల్లుండి మన ప్రోగ్రాం కాన్సిలైందిట. ఇప్పుడే ఫోనొచ్చింది" అంది శ్రీవాణి, పమిటనిండుగా కప్పుకుంటూ.

"అలాగా! అయితే అనవసరంగా వచ్చానన్నమాట. మరైతే నే వెళ్ళొస్తా నండీ!" అంటూ వెనక్కితిరిగాడు. ఎదురుగా చినబాబుగారు వస్తున్నారు.

"ఎక్కడికమ్మా శ్రీనివాసులు వెళ్ళేది. ఇవాళ చక్కగా మనతో కబుర్లు చెపుతూ మనతోనే భోంచేస్తాడు. నీ పూజ త్వరగా కానీయమ్మా" అన్నారు చినబాబుగారు. శ్రీవాణి లోపలికి వెళ్ళిపోయింది.

"రోజూ అహర్నిశలూ సాధనచేస్తూ సాధించటం అవసరమే కానీ కాస్త సరదా విశ్రాంతి కూడా అవసరమే శ్రీనివాసులూ. రా లోపల కూర్చుందాం." అన్నారు చినబాబుగారు. ఆయన మాటకి ఎదురుచెప్పలేక ఆయన్ని అనుసరించాడు శ్రీనివాసులు.

శ్రీవాణి పూజ ముగించుకుని తండ్రిని శ్రీనివాసుల్ని కాళ్ళు కడుక్కుని భోజనానికి రమ్మని ఆహ్వానించింది. శ్రీనివాసులు ఇంతవరకూ వారింట ఏదీ తినలేదు. అందులో భోజనం చినబాబుగారితోపాటు అనగానే ఒక్కమాటుగా ఏదో కళ్ళకు కట్టింది. ఎప్పుడో తన చిన్ననాటి విషయం. అది తనెప్పుడూ మరిచిపోలేదు.

"చిన్నప్పుడు తనూ బాబయ్యా పూజారిగారింట్లో పెళ్ళికి పాలవెల్లి పిడతలు పట్టుకుని వెళ్ళారు. అప్పుడు వాళ్ళు భోంచెయ్యమని పందిట్లో ఒకపక్కన అన్నంపెట్టారు. అంతలో ఎవరో ఒకాయనొచ్చి, "ఛీ! ఛీ! ఈ అలగాజాతి వాళ్ళందరికీ ఈ పందిట్లో భోజనంపెడితే మేం భోంచెయ్యం" అని అల్లరిచేశాడు. అప్పుడు తనూ బాబయ్యా విస్తళ్ళు తీసుకెళ్ళి వాకిట్లో పెట్టుకుని తిన్నారు.

ఎందుకో చినబాబుగారింట్లో భోంచెయ్యబుద్ధి కాలేదు. పెద్దవారింట్లో పంచభక్ష్యాలతో వాకిట్లో భోంచెయ్యడంకంటె తన ఇంట్లో గంజితాగడం ఆనందంగా అనిపించింది శ్రీనివాసులుకి. చినబాబుగారితో చెప్పి వెళ్ళిపోవాలనిపించింది. కాని లేచి వెళ్ళబోతుంటే, చినబాబుగారు వచ్చి బలవంతంగా లోపలికి తీసుకెళ్ళారు. శ్రీనివాసులుకి మారుమాటాడే అవకాశం కూడా ఇవ్వలేదాయన. శ్రీనివాసులు బెరకుబెరుగ్గానే లోపల అడుగుపెట్టాడు.

డైనింగ్‌హాలు నిండా చక్కని ముగ్గులుపెట్టి ఉన్నాయి. హాలు ఎదురుగా దేముని మందిరం. ఆ మందిరం మామిడి తోరణాలు, పువ్వులతో కళకళలాడుతూ ఒక పవిత్ర మందిరంగా గోచరిస్తోంది. గుమ్మం ముందే ఆగిపోయాడు శ్రీనివాసులు సంకోచంతో. ఒక పక్కగా రెండు పీటలు ఒకదాని పక్కన ఒకటివేసి ఉన్నాయి. వాటి ముందు ఆకుపచ్చని లేత అరిటాకులు వాటి పక్కన వెండి మరచెంబు గ్లాసులు కనిపించాయి శ్రీనివాసులికి. చినబాబుగారు పట్టు పంచె కట్టుకుంటూ వచ్చారు.




"రావోయ్! రా. హారతి అద్దుకుందాం. లేకుంటే అమ్మాయి నన్ను ఉపోషం ఉంచేస్తుంది ఈ రోజు" అని నవ్వుతూ మందిరం దగ్గరకు దారితీశారు. శ్రీనివాసులికి లోపలి కెళ్ళాలనిపించింది. మెల్లగా దేముడి మందిరం దగ్గరకెళ్ళి శ్రీవాణి ఇచ్చిన హారతి అందుకున్నాడు శ్రీనివాసులు. తీర్థం ప్రసాదం కూడా ఇచ్చింది శ్రీవాణి. చినబాబుగారు ఎలా కళ్ళకద్దుకుంటే తనూ అలాగే కళ్ళ కద్దుకుని ప్రసాదం తిన్నాడు శ్రీనివాసులు. ఒకరిని అనుసరించాలని తెలిసినందుకు సంతోషపడ్డది శ్రీవాణి.

విస్తట్లో ఏమేమిటో వడ్డించింది శ్రీవాణి. చినబాబుగారి పక్కని బిడియంగా కూర్చున్నాడు శ్రీనివాసులు బిగపట్టుకుని. కాని చినబాబుగారిలో మాత్రం శ్రీనివాసులు వేరే కులస్తుడన్న భావమే ఉన్నట్లు కనపడలేదు. సరదగా కబుర్లు చెపుతూ భోంచేస్తున్నారు. శ్రీనివాసులికి ఆశ్చర్యం, ఆనందం కలిగింది. ఇది వరకు చినబాబుగారంటే పెద్దవాడన్న గౌరవం ఉండేది. ఆయనలోగల సంస్కారం, సహృదయత, ఇప్పుడు శ్రీనివాసుల్ని మురిపించాయి. ఇప్పుడు ఆయన్నో ఉన్నత శిఖరంపైన కూచోబెట్టాయి.

భోజనానంతరం చినబాబుగారు, శ్రీనివాసులు హాల్లోకొచ్చి కూచున్నారు. శ్రీవాణి తాంబూలం తెచ్చింది.

"అమ్మా ఇవాళ నీ వరలక్ష్మి భుక్తాయాసంగా భోజనం పెట్టిందమ్మా! ఆ

చేత్తోనే నాచేత శ్రీనివాసులికి తాంబూలం ఇచ్చుకోమ్మా" అన్నారు చినబాబుగారు భుక్తాయాసంతో సోఫాలో ఒరిగిపోతూ.

"నాకు అలవాటు లేదండీ!" అన్నాడు శ్రీనివాసులు. చినబాబుగారు ఆశ్చర్య పోయారు.

"అలవాటు లేదా! ఏమిటోయ్ కాఫీ టీలు తాగవ్, సిగరెట్లు ముట్టవ్. ఆఖరికి కిళ్ళీకూడా అలవాటు లేదా? భలేవాడివోయ్! నీ భార్య అదృష్టవంతురాలు. అన్నట్లు నీకు పిల్లా పీచూ...." శ్రీనివాసులు సిగ్గుపడుతూ ముడుచుకుపోయాడు చినబాబుగారు అలా అనగానే.

"ఓ.... నీకు పెళ్ళి కాలేదేమిటోయ్. ఫరవాలేదులే. అవుతుందిలే. ఊ! అయితే అమ్మాయ్! ఆ అబ్బాయి తింటానన్నా తాంబూలం ఇవ్వకు. బ్రహ్మ చారులు తాంబూలం వేసుకోకూడదు. నువ్వానూ!" అంటూ హాయిగా నవ్వేశారు చినబాబుగారు. అందరూ నవ్వేశారు. మైనా కూడా నవ్వింది. చినబాబుగారు ఆవలిస్తూ,

"నాయనా శ్రీనివాసులూ! నువ్వేమీ అనుకోకోయ్! నాకు నిద్దరొస్తోంది. కాస్సేపు నడుంవాల్చి వస్తా. అందాకా అమ్మాయితో కబుర్లు చెప్పు" అంటూ లోపలికి వెళ్ళిపోయారు.

"నాన్నగారికి కంచం పక్కనే మంచంవేస్తే కూడా కాదనరు. మహా సంతో షిస్తారు" అంటూ నవ్వుతూ శ్రీనివాసులు ఎదుటి సోఫాలో కూర్చుంది శ్రీవాణి. శ్రీనివాసులు కూడా నవ్వాడు. అతడలా కలిసిమెలిసి తిరుగుతూ, మాట్లాడుతూ నవ్వుతుంటే అతనిలో కలుగుతున్న మార్పుకు పొంగిపోయింది శ్రీవాణి, తన కృషి ఫలిస్తున్నందుకు సంతృప్తిపడింది.

"శ్రీనివాసులుగారూ! ఇప్పుడు మీ వాయిద్యంతో నాకు పేరు తెస్తున్నారు. నా పాటకి అందం మీ వాయిద్యమేనని అందరూ మెచ్చుకుంటూ ప్రతి పేపర్లోనూ మీ పేరుకో ప్రాముఖ్యత ఇస్తున్నారు. అందరి అభిమానం మన్ననలూ పొందు తున్నారు. స్వీకరిస్తున్నారు. మరి నా అభినందనలు స్వీకరించరూ!" అంది. ఆమె కన్నుల్లో నీరు తిరిగింది ఆనందంతో. ఆమె కన్నుల్లో తిరిగిన నీరు చూడగానే శ్రీనివాసులు కళ్ళల్లో నీరు తిరిగాయి.

"శ్రీవాణిగారూ మీరు నన్నేదో గొప్పవాడుగా ఎత్తి అనుకోడం మీ సంస్కా రం. కాని నేను అతి బీదవాడిని. చదువూ సంస్కారం లేనివాడ్ని. చెప్పాలంటే మీ అంత ఉన్నత కులస్థుడిని కూడా కాదు. మీ అభినందనలు కళ్ళ కద్దుకుని

పూజాపుష్పంలా స్వీకరిస్తాను," అన్నాడు శ్రీనివాసులు. అంతలో చినబాబు గారి నిద్ర పూర్తికావడం, అక్కడికి రావడం జరిగింది. ఆయన ఆవలిస్తూ "ఆ! భలే నిద్రపట్టిందమ్మా! చాలాసేపు నిద్రపోయానల్లే ఉంది కదూ! కాసిని మంచినీళ్ళు దాంతోపాటే కాఫీ అందుకో తల్లీ! ఆ ఫోనుపిల్ల నిద్ర లేపింది లేకపోతే రేపొద్దున లేచేవాడినో ఏమిటో!" అన్నారు. శ్రీనివాసులు ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చుంటూ. "ఏమోయ్! మధ్యాన్నం నిద్ర నీ కలవాటు లేదేమిటి! ఆ! అయినా చిన్నపిల్లలు మీరు. పగటి నిద్ర పని చెడుపు. రాత్రి మెలకువ ఆరోగ్యం చెడుపట. ఆ! ఇంతకీ ఆ ఫోను నాకు కాదోయ్. నీకు" అన్నారు చినబాబుగారు నవ్వుతూ

శ్రీనివాసులికి ఆశ్చర్యమేసింది. ఫోను తనకు. అదీ ఇక్కడికి.

"నాకు ఫోనేమిటండీ!" అన్నాడు శ్రీనివాసులుకు అర్థంకాక.

"అదేనోయ్! వాళ్ళెవరో శ్రీకాకుళంలో నీ నవమృదంగ కార్యక్రమం ఏర్పాటు చెయ్యాలనుకుంటున్నారుట. నీ రేటు ఎంత ఉంటుందని అడిగారు. నాకు తెలీదు. అడిగి చెప్తాను. మళ్ళీ ఫోను చెయ్యమన్నాను. ఇంతకీ నువు కచేరీకి ఎంత తీసుకుంటున్నావ్?" అని అడిగారు. నిజానికి ఈ రెండు నెలలబట్టి తమవెంట వస్తూ వాయిస్తున్నా తనకింత కావాలని ఎప్పుడూ అడగలేదు. అతని అవసరాలు కనిపెట్టి రామకోటిగారే అన్నీ చేసేవారు. శ్రీనివాసులికి ఇంతవరకూ కచేరీకి ఇంత ఇస్తారనీ, తీసుకోవాలనీ తెలీదు. ఎవరైనా తాంబూలంలో ఏదైనా ఇస్తే సంతోషంగా స్వీకరించాడు. ఇంత, అంత కావాలని ఎవరితోనూ పేచీపెట్టాలనికూడా అతనికి తెలీదు. అందుకే చినబాబుగారు అలా అడగ్గానే ఆశ్చర్యపోయాడు.

"అదేమిటి బాబుగారూ! నా వాయిద్యానికి రేటా. ఇంట్లో చేస్తున్న సాధకం కచేరిలో చేస్తున్నానన్న తృప్తి, సంతోషమే నా ధర." అన్నాడు.

అతనిమాట వినగానే చినబాబుగారు ఉప్పొంగిపోయారు.

ఇంకా ధనదాహం కలిగి ఎంత డబ్బు గడించినా దాహంతీరని వారి వలలో శ్రీనివాసులు పడలేదనిపించింది. ఇతనికి మంచీచెడు విచక్షణ, భయంభక్తి అన్నీ ఉన్నాయి. అవి లోకపు లోతుల సుడిగుండంలో చిక్కుకోకుండా రక్షించాలి. శ్రీనివాసులు మనసొక మంచి క్షేత్రం. అందులో ఉత్తమ లక్షణాలనే ఎరువులో ముంచిన మంచి విత్తును నాటితే అదీ అతనితోపాటు ఎదుగుతుంది. మహావృక్షమై సుఫలాలని ఎంతో మందికి పంచి ఇస్తుంది అనిపించింది చినబాబుగారికి.

"నాయనా శ్రీనివాసులూ! నీ ఆశయాలు అదర్శప్రాయమైనవి. నీకు తెలియకపోయినా నీలో ఆ మంచి విషయాలు జీర్ణించుకుపోయాయి. వాటిని పారద్రోలకు. దానాలన్నిటిలోకీ విద్యా దానం, ప్రధానమైనవి. ఏది ఇచ్చినా తరుగుతుంది కానీ విద్య తరగదు. పెరుగుతుంది. కానీ విద్యకు ధరకట్టు ప్రారంభమై అది అతి ఆశగా దురాశగా పెరిగినకొద్దీ నీ విద్య తరుగుతుంది. అప్పుడే మనిషి పతనం ప్రారంభమౌతుంది. పతనమౌతున్న మనిషి సాలెగూడులో చిక్కిన ఈగలాగా, డబ్బు చూపే రంగుల విషవలయంలో చిక్కుకుని విద్యను విస్మరించి గిలగిలా కొట్టుకుంటాడు.

"పూర్వం సాటి విద్వాంసులతో పోటీపడి తమ విద్వత్ ప్రదర్శనలో ఎదుటి వాడిని ఓడించాలనుకునేవారు. అనాడు విద్యకి కొలబద్ద పోటీ ఓటమి గెలుపు.

"కాని ఈనాడు విద్వాంసుల కొలబద్ద వారు తీసుకునే డబ్బు.

"నువు ఉత్తమ కళాకారుడివిగా కలకాలం నిలవాలని నా కోరిక. ఈ పవిత్ర భారత భూమి కళామతల్లి ఒడిలో వేలాది కళాకారుల్ని నిస్వార్థబుద్ధితో తయారుచేసి వదిలెయ్యి. వాళ్ళు హాయిగా పసిపాపల్లా ఆనందంగా ఆ బడిలో ఆడుకుంటారు" అంటూ పరవశంతో చెప్పుకుపోతున్నారు చినబాబుగారు. శ్రీవాణి కాఫీట్రేతో వచ్చింది. తండ్రికి కాఫీ అందిచ్చి మజ్జిగ శ్రీనివాసుల దగ్గిర పెట్టింది.

"ఏమిటి నాన్నా! రోజూ నాకు నూరిపోసే పాఠం ఇవాళ నేను దొరకలేదని శ్రీనివాసులుగారికి బోధిస్తున్నావా? అసలే ఇవాళ ఆయనకు సాధకం టైము మనం తినేశాం. ఇప్పుడు బోరుకొట్టి ఉంటుంది" అంది నవ్వుతూ.

"బోరేం లేదులెండి. నా ముందు జీవితం ముళ్ళబాట కాకుండా ఉండాలని మంచి విషయాలు చెప్పారు. అన్నట్లు నేనొచ్చి చాలా సేపైంది. అమ్మ, తాత నా కోసం ఎదురుచూస్తుంటారు. మరి వెళ్లొస్తా. నమస్తే" అంటూ చినబాబుగారికి నమస్కరించి బయలుదేరాడు శ్రీనివాసులు. శ్రీవాణి కూడా వరండాదాకా వచ్చింది.

"నీతో ఎన్నెన్నో మాట్లాడాలని ఉంది. నువ్వంటే నాకు ఇష్టం" అంది మైనా. శ్రీనివాసులు సిగ్గుపడ్డాడు. ఆ మాటలు తను ఎవరూ వినకుండా మైనాతో అన్నమాటలు బట్టబయలు చేసింది. ఆ మాటలు శ్రీవాణి వింటే ఏమనుకుంటుందో అనుకున్నాడు.

"ఆ మాటలు శ్రీనివాసులు తనతోనే అంటున్నట్లుగా భావించి మురిసిపోయింది

శ్రీవాణి. మైనా చేత పదిమాట్లు ఆ మాటలు అనిపించుకుని వింది. వెడుతూ వెడుతూ శ్రీనివాసులు అన్నమాట తలుచుకుని పరమానందాన్ని పొందింది. పరవసించిపోయింది శ్రీవాణి.

# 7

శ్రీనివాసులు లోకానికి పరిచయమైన కొత్తల్లో అయితే ఒక్క శ్రీవాణి-చినబాబుగార్ల కచేరీలకు మాత్రమే వెళ్ళేవాడు. వారి దగ్గర దగ్గరగా తిరుగుతూ శ్రీవాణి ప్రేమతోచెప్పే సంస్కార పాఠాలు, చినబాబుగారు చెప్పే లోకానుభవ సూక్తులు వింటూ తనని స్మరించుకుంటూ వచ్చాడు శ్రీనివాసులు. కాని కాలక్రమేణా వారిద్దరికే పరిమితికావడం చినబాబుగారికి నచ్చలేదు. అయన ప్రోత్సహించి, వివిధ ప్రాంతాలకూ, రాష్ట్రాలకూ కూడా శ్రీనివాసులు వెళ్ళే ఏర్పాటుచేశారు. తీరికలేని శ్రీనివాసులు శ్రీవాణికి దూరంగా ఉండలేకపోతున్నాడు. ఆమె సాన్నిధ్యంలో ఉండాలనీ, ఆమె పాటవింటూ పరవసించాలనీ, ఆమెతో ఏదో తనకు తెలియని తియ్యని మనసు విప్పి శ్రీవాణిముందు పరచాలనీ అనిపిస్తోంది. కాని ఎన్నో మాట్లు ఆమె కనిపించినపుడు ఏదో చెప్పాలనీ, చెప్పలేక విడియపడ్డాడు. ముందుగా ఆమె మనసులో తనస్థానం ఏమిటో తెలియకుండా తొందరపడకూడదనుకున్నాడు కొన్నిసార్లు. కాని ఈ రోజు ఆమెని చూడాలన్న తహతహతో కచేరీ నుంచి రాగానే బయలుదేరాడు శ్రీనివాసులు. చినబాబుగారి వాకిట్లో అడుగు పెడుతూనే హతాశుడైనాడు. పనికుర్రవాడు చెప్పాడు అమ్మాయిగారు అయ్యగారు కచేరీకి వెళ్ళారని. నిరాశతో వెనక్కి తిరిగినవాడు మైనా పిలుపుతో ఆగిపోయాడు. కాసేపు మైనా మాటలు వినాలనిపించింది శ్రీవాణికి బదులుగా.

"శ్రీనివాసా! శ్రీనివాసా! నా గుండె చీల్చి చూడు శ్రీనివాసా! నా గుండె నిండా నువ్వే నిండిపోయావయ్యా!" అని "శ్రీనివాసుడు కనిపిస్తే చెప్పవుచే మైనా?" అంది మైనా ఆగకుండా పాఠంచెప్పినట్లుగా.

శ్రీనివాసులు ఆశ్చర్యపోయాడు. మైనాకి ఇన్ని మాటలెలావచ్చు! మాటలన్నీ ఎవరు నేర్పిఉంటారు?" అని.

ఒకరోజు శ్రీవాణి చెప్పినమాట జ్ఞాపకమొచ్చింది శ్రీనివాసులికి.

'నాకు తోచనప్పుడల్లా నా మైనాతో కబుర్లాడుకుంటాను. నా మనసులో ఉన్న మంచీ, చెడూ మనసిప్పి చెప్పుకుంటాను. అది నా స్నేహితురాలు నా ప్రియ నెచ్చెలి,' అని.

మరైతే ఈ మాటలన్నీ శ్రీవాణే నేర్పిందా? శ్రీనివాసుడు ఎవరు? నేనేనా?

లేక ఆ ఏడుకొండల శ్రీనివాసుడా? ఏమో! ఈ ఇంట్లోవారంతా ఆ ఏడుకొండల వాడి భక్తులే! ఆయననే ఉద్దేశించి అంటుండొచ్చు. నన్ను గురించీ అయి ఉండొచ్చు. శ్రీవాణి మనసులో నాకంత చోటుండడంకంటే భాగ్యం మరోటి ఏముంటుంది? నన్ను గురించే శ్రీవాణి అని ఉండొచ్చు. అదే నిజమైతే ఎంత బాగుండును!" అని అనిపించింది శ్రీనివాసులుకు. మెల్లగా వరండాలోకి అడుగు పెట్టాడు.

మైనా తనలో తనే ఇందాకన్న మాటలు మాటిమాటికీ అనుకుంటోంది. శ్రీనివాసుల అలికిడికాగానే, "రండి. కూర్చోండి. మంచినీళ్ళు కావాలా?" అంది మైనా. ఎవరొచ్చినా ఆ మాటలు అనడం దానికి అలవాటు. శ్రీనివాసులు పంజరం దగ్గరకెళ్ళి,

"ఊఁ. మాటలు, మర్యాదలు బాగా నేర్చావు. అది సరేగానీ శ్రీనివాసుడిని చూడకుండా ఉండలేంది ఎవరే? మన శ్రీవాణా లేక చినబాబుగారా?" అని అడిగాడు శ్రీనివాసులు. చెప్పింది అనడం తప్ప ప్రశ్నలకు సమాధానం చెప్పడం రాదు దానికి. ముసిముసిగా నవ్వింది మైనా. దానికి సంతోషం కలిగితే అలాగే నవ్వుతుంది.

"ఊఁ! జాణవే! శ్రీవాణీ! ఈ బొమ్మకి మాటలు నేర్పింది నువ్వు. రెక్కలిచ్చి ఎగరమంది నువ్వు. నా గుండెమీద తల అన్చి చూడు—నీ పాట నీ మాటే వినపడుతుంది. నా గుండె చీల్చిచూస్తే నువ్వే కనిపిస్తావు" అంటూ ఆ పంజరంలో మైనా శ్రీవాణిలా తలిచి పంజరాన్నే ముద్దెట్టుకున్నాడు. వెంటనే ఆ మాటలన్నీ నేర్పించినట్లు పల్లించింది మైనా. చివరికి ముద్దుకూడా పెట్టుకుంది.

తను అన్నమాటలు మైనా అనగానే శ్రీనివాసులుకు సిగ్గేసింది.

"వెళ్ళొస్తా మైనా! ఎవరైనా వస్తే శ్రీనివాసులు వచ్చాడని చెప్పు" అని వెళ్ళాడు. ఒకపక్క ఇంతదూరం వచ్చి శ్రీవాణిని చూడకుండా వెడుతున్నానే అని బాధకలిగింది. మరోపక్క తన మనసులో మాట మైనాతో చెప్పాను కదా! అది శ్రీవాణికి అందిస్తుంది. ఎదురుగుండా చెప్పలేని విషయాలు మైనాతో చెప్పుకోవచ్చు" అనుకున్నాడు సంతృప్తిగా. ఆ తరువాత కూడా ఎన్నోసార్లు శ్రీనివాసులు వచ్చి వెళ్ళాడు. కాని శ్రీనివాసులు వచ్చినప్పుడు శ్రీవాణి ఉండటంలేదు. శ్రీవాణి ఊళ్ళో ఉన్నప్పుడు శ్రీనివాసులు ఊళ్ళో ఉండటంలేదు. ఆ విధంగా కొన్ని నెలలుగా ఒకరినొకరు చూసుకునే అవకాశం కలగటంలేదు.

కాని మైనాద్వారా ఒకరి గురించి మరొకరు తెలుసుకుంటూనే ఉన్నారు.మనసులు

విప్పి మైనా సందేశాలు పంపుకుంటూనే ఉన్నారు. కానీ ఆ మాట కేవలం ఇద్దరి మధ్య ఊహాగానాలు మాత్రమే. శ్రీవాణి ప్రేమిస్తోం దనిపిస్తుంది శ్రీనివాసులుకు. శ్రీనివాసులు ప్రేమిస్తున్నాడని ఊహిస్తుంది శ్రీవాణి. అది ఊహేనని ఇద్దరికీ అనుమానాలే. కాని వినేవారికి ఎవరికీ పట్టుపడేట్టు ఇద్దరూ రాయబారాలు జరపటం లేదు. వినేవారికి ఆ ఏడుకొండలవాడిని గురించి భక్తితో అనుకుంటున్నట్లే వినిపిస్తుంది. అందుకే ఆ ప్రేమికులు ఎవరికీ పట్టుపడలేదు, ఒక్క రామకోటి గారికి తప్ప. మైనా మాటలు అంచనాకట్టి అల్లుతుంటే అందులో శ్రీవాణి శ్రీనివాసులు పట్టుబడ్డారు ఆయనకు. కాని పైకి అయనా పొక్కలేదు.

## 8

మాధవయ్యగారు సాయంత్రం చల్లపాటున దొడ్లో బాదంచెట్టుకింద వాలు కుర్చీ వేసుకుని విశ్రాంతిగా కూచున్నారు. అయన మనసులో ఏదో ఆలోచన వచ్చి నాదబ్రహ్మంకోసం చూశారు. అంతలో "గురువుగారూ! గురువుగారూ! శంకరాభరణం! శంకరాభరణం" అంటూ పరిగెత్తుకుంటూ, ఆయాసపడుతూ వచ్చాడు నాదబ్రహ్మం. అంతదాకా నాదబ్రహ్మం చెట్లకి గొప్పులు తవ్వుతూనే ఉన్నాడు. ఎక్కడికి కెళ్ళాడో ఎందుకు ఆయాసపడుతూ పరిగెత్తుకొచ్చాడో, శంకరాభరణం ఏమిటో అర్థంకాలేదు మాధవయ్యగారికి. శంకరాభరణ రాగానికీ నాదబ్రహ్మం ఆయాసానికీ సంబంధం అర్థంకాలేదు.

"శంకరాభరణం ఏమిట్రా? నీ బొంద. కంఠాభరణంలాగా! దానికింత ఉరకలు పరుగులెందుకు? శంకరాభరణ రాగం నీకంత ఇష్టమా!" అన్నారు నవ్వుతూ.

"కాదండీ! శంకరాభరణం ఆ ఎలకకలుగులోకి మారింది." అన్నాడు ఎలక కన్నంవేపు భయంగా చూస్తూ. అప్పటికి అర్థమైంది మాధవయ్యగారికి.

"ఆ శంకరాభరణమా! అదే పోతుందిలేరా! దానికేమైనా హానిచేస్తే కరుస్తుంది కానీ లేకపోతే దాని మానాన అదే పోతుంది" అన్నారు నవ్వుతూ.

"ఆ. పోతుంది. ఎట్లాగైనా పాము పామే. విషప్పురుగుని శత్రువుని, ఉంచ కూడదంటారు. అది మనకు హానిచేస్తుందని తెలిసినప్పుడు దాన్ని చంపా ల్సిందే!" అంటూ కర్రపుచ్చుకుని కూచున్నాడు దాన్ని చంపటానికి.

ఆమాట నిజమే అనిపించింది. ఋణశేషం, శత్రుశేషం ఉంచకూడదు అనుకుని "ఎవరినైనా పిలిపించి దాన్ని పట్టించు" అని లోపలికి వెళ్ళారు మాధ వయ్యగారు. ఆయనకి పామంటే తగని భయం.

"మళ్ళీ వేరొకరు ఎందుకో! నేనే దాన్ని ఒకుపుగా పట్టి పచ్చడి పచ్చడిచేసి చంపుతా" అనుకున్నాడు. కానీ, చీకట్లో అదెక్కడొచ్చి కాటేస్తుందో అని భయమేసి తనూ లోపలికి వెళ్ళాడు నాదబ్రహ్మం అయన వెనకాలే. నాదబ్రహ్మం రాగానే మాధవయ్యగారు చిరాకుగా,

"ఒరే! నాదం. ఏం తోచటంలేదురా!" అన్నారు. ఆయన ఎప్పుడూ ఉత్తగా కూర్చున్న వ్యక్తి కాదు. కచేరీలో, విద్యార్థులో, సాధనో, పెద్దలతో ముచ్చట్లో, ఏదో ఒక విధంగా కాలంగడపటం ఆయనకు అలవాటు. ఈ మధ్య చాలా మాట్లు ఆయన నోటివెంట ఇదేమాట వింటున్నాడు నాదబ్రహ్మం. దానికి కారణం నాదబ్రహ్మానికి తెలుసు. ఒళ్ళు మండిపోతుంది నాదబ్రహ్మానికి ఆ విషయం తలచుకుంటేనే.

"ఏం ఎందుకు తోచటంలేదు? ఇదంతా, మృదంగం వాయించండి" అంటూ మృదంగం ముందర పెట్టాడు. అదంతా దుమ్ముకొట్టుకుపోయి ఉంది. చిరాకుగా అనిపించింది. "అబ్బ ఇప్పుడు వాయించాలని లేదురా! అయినా ఆ మృదంగ నాదం సరిగా లేదు. కొత్త చూడు" అన్నారు. అసలే మనసంతా పాడైపోయి ఉంది ఆయనకు. వాయించే మనసు లేదు.

"చూస్తా చూస్తా! మృదంగం పాతదై పోయింది. దానికితోడు వారు తెగిపోతోంది. ఇక నాదం ఎక్కడ! శృతి ఎక్కడ? మంగళహారతి పాడేస్తే సరి." అన్నాడు మృదంగం మీద దుమ్ము దులుపుతూ.

"అదేం మాటరా! మృదంగం పాతదైనకొద్దీ గట్టిపడి చక్కని నాదం వస్తుంది. విలువ పెరుగుతుంది. కానైతే వారు పోతే కొత్తదేసుకుంటే సరి."

"సరి సరి. పాత మృదంగానికి విలువ పెరుగుతుందని తెలుసునన్నమాట. మరి మీకు తోచకపోవడమేమిటి? ఊసుపోకపోతే చక్కగా సాధన చేసుకుంటూ వాద్యించండి. మీలో మీరే వినండి. ఆనందించండి" నాదబ్రహ్మం మాటల్లో ఎత్తిపొడుపు ధ్వనించింది.

"అందుకే గదుట్రా! ఎంచక్కా ఓ టి.వి. ఉంటే కాస్త కాలక్షేపం అవుతుంది. కొంత కాలంగా చేతికి తగినంత పనిలేక విసుగ్గా ఉందిరా!" అన్నారు మాధవయ్యగారు ఈజీ చైర్లో పడుకుని కాళ్ళాడిస్తూ. ఎప్పుడూ అలా పడుకుని ఎరుగరు మాధవయ్యగారు.

"ఆ కాళ్ళలా ఆడించకండి. చుట్టుకుంటున్న దరిద్రం చాలు. ఇప్పుడు మన సంబరానికి టి.వి. ఒక్కటే తక్కువ." విసురుగా మృదంగం పుల్లలు తీస్తూ అన్నాడు నాదబ్రహ్మం కసరుసా చూస్తూ.




"తక్కువే మరి. ఎంచక్కా టి.వి. ఉంటే మన ప్రోగ్రాములు మనమే వినొచ్చు. బొమ్మలు కూడా చూడొచ్చు. ఏమంటావ్! నీ బొమ్మ నీకు చూసుకోవాలని ఉండదా?"

"అయ్యో! ఎందుకుండదు. నా బొమ్మా మీ బొమ్మా చూడాలనే ఉంటుంది. కానీ అడ్డమైనవాళ్ళ బొమ్మలు చూడాలని లేదు." నాదబ్రహ్మానికి మాధవయ్యగారి దగ్గర కాస్త చనువు ఎక్కువే, లాలిస్తాడు. బుజ్జగిస్తాడు, అవసరమైతే కోప్పడతాడు కూడా. ఇంటి బాధ్యంతంతా నెత్తినేసుకుని ఈదుతున్నాడు. నా మంచిచెడ్డలు చూసేది వాడేకదా!" అనుకుని మాధవయ్యగారు కూడా నోరెత్తరు. కాని ఇవాళ నాదబ్రహ్మం మాటలతీరు వింతగా అనిపిస్తోంది. అతని మనసులో ఏదో దాచుకుని మాట్లాడుతున్నాడనిపించింది మాధవయ్యగారికి.

"బాగుందిరా నీ వరస. మనం టి.వి. కొనుక్కున్నామని మన బొమ్మలే వేస్తారా ఏమిటి? మన బొమ్మలూ చూడాలి ఇతరులవీ చూడాలి? అందుకే మనకూడా ఒక టి.వి. కావాలి. ఆ భారం నీదే" తన బలీయమైన కోరిక వెల్లడించారు మాధవయ్యగారు. కాని నాదబ్రహ్మం ఎదురుతిరిగాడు.

"ఇతరుల బొమ్మల్ని చూసే ఖర్మ నాకేంపట్టలేదు. సరికదా! నేనింక ఎవ్వర్నీ ఏదీ అడగను. అడగను అడగను. అయినా ఇంకా మీ దగ్గర నేర్చుకోడానికి ఎవరు వస్తారండి. ఇదవరకంటే ఎవరో ఒకరు వచ్చేవాళ్ళు. కొద్ది రోజులు నేర్చుకుని వెళ్ళిపోయేటప్పుడు మనం అడిగిన వేవో కొనిచ్చి పోయేవాళ్ళు. ఇంక మీరు ముక్తాయింపు వాయించుకోవచ్చు." మృదంగం వారు అంతా ఊదపీకుతూ అన్నాడు.

"ఎందుకురా అంత కోపం! ఇప్పుడు నే నేమన్నానని? ఆ వారు ఊడపీకేస్తున్నావ్?"

"కోపంకాదు. ఒళ్ళుమంట" అన్నాడు నాదబ్రహ్మం పుల్లలు విసురుగా నేలకేసి కొడుతూ. ఈమధ్య కొద్దిరోజులుగా నాదబ్రహ్మం అలాగే సమాధానాలు చెపుతున్నాడు. ఎందుకో అర్థంకావటం లేదు ఆయనకు.

"టి.వి. నీకు మాత్రం చూడాలని లేదా? ఎక్కడో ఒకచోట అప్పు తెచ్చైనా కొనిస్తాడు. ఏం నాలుగేళ్ళనుంచీ విద్య నేర్చుకోటంలే! ఆ అనపర్తి అబ్బాయిని అడుగు!"

"అందుకు గురుదక్షిణ టి.వి. అంతేనా! వాడు టి.వి. కొనలేడు. కొనగలిగినా నే నడగనండీ! అంతే!" నిక్కచ్చిగా అన్నాడు నాదబ్రహ్మం.

"రేడియో ప్రోగ్రాములు రోజూ ఏదో ఒక స్టేషన్నుంచి మీవి వస్తాయనీ, వినాలనీ అంటే గురుదక్షిణగా రేడియో కావాలన్నాం. వాళ్ళిచ్చారు. మనం తీసుకున్నాం. ప్రోగ్రాములన్నీ టేపు చేస్తున్నారు. అవి మాటిమాటికీ అందరికీ వినిపిచ్చాలి అని టేపు రికార్డరు అడిగాం. అవి H. M. V. వాళ్ళు రికార్డు చేశారు అని రేడియోగ్రాం అడిగాం. ఇక్కడికీ అక్కడికీ ప్రోగ్రాముల కెళ్ళాలంటే "తాతా" వారి మనవడు కారు కొనిచ్చాడు. ఇవన్నీ గురుదక్షిణలుగా అమిరాయి. బాగుంది. ఇక చిన్న చిన్న దక్షిణలు సరేసరి. సోఫాసెట్లు, కార్పెట్లు, సామాన్లు వగైరా వగైరాలు. కాని ఇప్పుడు మీకు టి.వి. శుద్ధ దండగ" అన్నాడు ఖచ్చితంగా నాదబ్రహ్మం, చివరి పదాన్ని నొక్కి పలుకుతూ.

నాదబ్రహ్మం మనసు అంతుపట్టలేదు ఆయనకి.

"ఎందుకనిరా! ఇప్పుడు మనం టి.వి. ప్రోగ్రాములు కూడా ఇస్తున్నాంగా! మరి చూసుకోవడానికి టి.వి. ఒద్దా?" మాధవయ్యగారు ఒక పసిపిల్లాడిలాగా అడిగారు అమాయకంగా!

"అసలు చెప్పాలంటే, టి.వి. కాదుకదా, రేడియో కూడా శుద్ధ దండగే మనకు."

"మీరే చెప్పండి. మీరు ఈ మధ్య రేడియో ప్రోగ్రాములు ఎన్నిచ్చారు?"

"నెలకి ఒకటో రెండో! ఆ కాంట్రాక్టులు నీకే తెలుసు కదుట్రా!" చిరాగ్గా అన్నారు మాధవయ్యగారు. ఆయనకంటే నాదబ్రహ్మానికే తెలుసు ఆయన కార్యక్రమ వివరాలు. అ విషయాలన్నీ అతనే చూసుకుంటాడు.

"మరే! ప్రోగ్రాములు ఎన్నిచ్చారు?"

"అవీ....నెలకి నాలుగో అయిదో! అయితే ఏమిటంటావ్?" డొంక తిరుగుడుగా నాదబ్రహ్మం మాట్లాడుతుంటే తల తిరిగిపోతోంది మాధవయ్యగారికి.

"ఏమిటంటానా! అదంతా మీరే చేతులారా చేసుకున్నారు. ఎంచక్కా రోజూ ఎక్కడో ఒకచోట మీ ప్రోగ్రాం జరిగేది. నెల తిరిగేసరికి ఖర్చులు పోను యాభై వేలు మిగిలేవి. ఇప్పుడో! ఇంటి ఖర్చులకు సరిపోతోంది." అన్నాడు కసిగా ఎటో చూస్తూ.

"అప్రనా! నిజమే! కాని ఎవరూ పిలవందే మనమేంచేస్తాం? పిలవకపోయినా నేనే వెళ్ళి వాయించనా?' మాధవయ్యగారు నిస్సహాయతగా అన్నారు.

"ఏం! ఎందుకు పిలవరు? మీ విద్వత్తు తరిగిందా? వయసు ఉడిగి చేతులు ఒణుకుతున్నాయా ?" అన్నాడు నాదబ్రహ్మం. పుల్లలు పెడుతూ ఆ మాటా నిజమే ఎందుకు పిలవటంలేదు? అన్న ప్రశ్న మాధవయ్యగారికీ అనిపించింది. ఎంత ఆలోచించినా అంతుచిక్కలేదు కారణం.

"మరెందుకు పిలవటంలేదంటావ్?" అని అడిగారు కాస్త లేచి నిటారుగా కూర్చుంటూ. ఆ మాట వినగానే మృదంగం కాళ్ళ సందుకు తీసుకుని "ఎందుకా! మీ నోట్లో మీరే గడ్డకొట్టుకున్నారు. నా శిష్యుడు, నా శిష్యుడు అంటూ ఏకలవ్యుడంటూ తెగపొగిడేసి రంగప్రవేశం చేయించేశారుగా. ఏ పేపర్లో చూసినా వాడి పేరే! రేడియోల్లో వాడి ప్రోగ్రాంలే. టి.వి.లో వాడే. నవమృదంగం. అదొ పెద్ద దొమ్మరి ప్రదర్శన చేస్తున్నాడుగా. దానిమీదే వేదాలు, పాటలు. ఓ! ఇంగిలీషు మ్యూజిక్కులట, ఎవడి పక్కన చూసినా వాడిదే వాయిద్యం. సముద్రంలో తిమింగలం ఈదినట్టు ఈదేస్తున్నాడు. సొరచేప పెద్దదనుకునే రోజులు పొయ్యాయి తిమింగలం వచ్చాక! మొన్న సినిమా కూడా తీశార్ట వాడికి."

"ఇంకా కొన్నాళ్ళుపోతే శ్రీకృష్ణుడి చుట్టూ గోపికల్లాగా షోడశ మృదంగాలు పెట్టుకుని వాయిచ్చేస్తాడు. అప్పుడు మీ ముఖం చూసేవాడు కూడా ఉండడు" అన్నాడు కచ్చగా, వారు బిగిస్తూ.

"ఆ! అంత గొప్పగా వాయించేస్తున్నాడంటే చాలా గొప్పే మరి." మాధవయ్యగారు మెచ్చుకుంటుంటే నాదబ్రహ్మానికి అరికాలిమంట నెత్తికెక్కింది.

"గొప్పే! మరి....కాదూ! వాడలా పైకి పైకి పోతూంటే బొంబాయిలో విమానాల ఆఫీసులో చూశ్ళే....ఒక బెల్టు పైకిపోతుంటే మరో పక్క బెల్టు కిందకి దిగింది. మీరూ అంతే. మృదంగం మాధవయ్యగారు చనిపోయిందాకా మరోవ్యక్తి ఆ చోట ఉండటం నేను సహించలేను." అన్నాడు బదులుగా ఉన్న

మృదంగా [illegible] లాగుతూ "మీకు టి.వి. ఎందుకు? వాడ్ని చూట్టానికా?" మాధవయ్యగారికి కూడా అలానే అనిపించింది.

"మరైతే ఇప్పుడు నేను చావాలా? చచ్చిపోయానా? ఏమిటో నాకు అయోమయంగా తల తిరిగిపోతోందిరా నాదం" అన్నాడు మాధవయ్యగారు.

"మీరు చచ్చిపోతే నాకు ఈ బాధేలేదు. మీరు చావకుండా బ్రతకాలనేదేగా మీ ప్రియశిష్యుడి బాధ. మీ తల తిరక్కుండానే జాతకాలు తిప్పుదాం," అన్నాడు వారు ఇంకా స్త లాగి బిగిస్తూ.

"ఎలా?" కుతూహలంగా అడిగారు మాధవయ్యగారు తలవంచి.

"ఇలా?" అంటూ వారు మదేసి కొద్దిసేపు బాగా ఆలోచించి మాధవయ్యగారి చెవిలో ఏదో రహస్యం చెప్పాడు. ఆయన సందేహిస్తూ,

"అలా చేస్తే బాగుంటుందంటావా? అది జరిగే పనేనా?" అన్నారు.

"ప్రయత్నం చెయ్యాలి. ఆ తరువాత కాకపోతే మరో ఉపాయం ఆలోచిద్దాం," అంటూ కరిణీమీద మెల్లగా కొట్టాడు మాధవయ్యగారివంక చూస్తూ. తన మాట నచ్చినట్లుగా ఆయన తనవంకే ముక్కుశోణాలు ఎగరేస్తూ, ఉద్రేకంతో ఊగిపోతూ ఎదో చూస్తున్నారు. ఆయన కళ్ళలో రగులుతున్న అసూయ, కసి, పగ సెగలు పొగలై కనిపించాయి నాదబ్రహ్మానికి. తన మనసులో మొలచి మహావృక్షమై తనను దహించివేస్తున్న విషవృక్షం తాలూకు విత్తు అతి కష్టంమీద మాధవయ్యగారి తలలో నాటాడు. అది క్షేత్రం మంచిది కనుక వెంటనే నాటుకుంది. నాదబ్రహ్మానికి చాలా సంతృప్తిగా అనిపించింది. మొలిచిన మొక్కని ఏ పురుగు పుట్రా కొరికి నాశనం చెయ్యకుండా కాస్త కాపాడగలిగితే అది వేళ్ళు పాతుకుని శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది అనుకున్నాడు మనసులో.

"విత్తు నాటడం మటుకే నా పని. ఆ తరువాత దైవేచ్ఛ. ఆ విషవృక్ష జ్వాలలు ఎవరిని దహిస్తాయో! ఎదుటివారినే నాశనం చేస్తాయో లేక భస్మాసురిడి వరంలా తనను తానే దహించుకుంటుందో చూడాలి" అనుకుంటూ కుడి కరిణీమీద వేళ్ళతో రెండుసార్లు కొట్టాడు. అది ఖంగున మోగింది. సంతృప్తిగా మాధవయ్యగారిని చూసి,

"అమ్మయ్య. గురువుగారూ! సాధించాను. ఈ పాత డొల్ల పనికిరాదేమోనని భయపడ్డాను. ఫరవాలేదు. తెగిపోతున్న పాతవారైనా కాస్త ముడివేసి బిగిస్తే బాగానే శృతి పలుకుతోంది. ఇంక ఫరవాలేదు. ఈ మృదంగాన్ని ఎలా

శృతిచెయ్యాలో తెలిసిపోయింది." అంటూ ఓరగా ఓ కోరచూపు చూస్తూ ఓ విషపు నవ్వు విసిరాడు నాదబ్రహ్మం.

"నాదం! మరి మనకు విముక్తి లేదంటావా? బయటపడే మార్గం...." నిస్సహాయంగా చూశారాయన. ఎంతసేపు ఆలోచించినా ఈ కష్టాల నుంచి బయటపడే మార్గం కనిపించలేదాయనకు.

"చెప్తా. కాని మీరు నేను చెప్పింది వినాలి కదా!" అన్నాడు. మనసులో మాత్రం 'వినకేం చేస్తావ్. చచ్చినట్లు వింటావ్. చెప్పుడు మాటలు వినే పక్షి' అనుకున్నాడు తేలిక భావంతో.

"చెప్పరా! నువ్వు చెప్పింది సమంజసంగా వుంటే వినడానికేం తీపరమా?"

"అలా కాదు. నేను చెప్పింది వింటానంటేనే చెప్తా. ఆ పైన నా మీద అభాండాలు వేసి, కసిరి విసిరికొడితే కాదు. నేనేది చెప్పినా మీ కోసం చెప్తానని విశ్వసించితేనే చెప్పగలను." బెట్టుసరిగా వాగ్దానం చెయ్యమన్నట్లుగా అన్నాడు. అలా బిగిస్తే కానీ మాధవయ్యగారు లొంగరని తెలుసు నాదబ్రహ్మానికి.

మాధవయ్యగారు కూడా చాలాసేపు ఆలోచించి "సరేలేరా! నువ్వు నా మీద అంత అభిమానంతో చెపుతుంటే కాదనే మాట ఉండదు. చెప్పు" అన్నారు.

నాదబ్రహ్మం మనసు ఎగిరి గంతేసింది తన కోరిక నెరవేరుతున్నందుకు మాధవయ్యగారి దగ్గర కెళ్ళి చెవులో ఏదో చెప్పాడు.

మాధవయ్యగారు నోరు వెళ్ళబెట్టారు ఆ మాట వినగానే.

* * *

"కుర్రోడు పెద్దోడౌతాడు, పెద్దోడౌతాడు అంటే కామోసు పెద్దోడై రెండు సేతులా సంపాదించి నిన్నూ నన్నూ సుక పెడతాడని అనుకున్నా." సీతమ్మ పొద్దుట్నించీ గొణుగుతూనే ఉంది. ఆదెయ్యతాతకి తెలుసు ఆమెచిరాకుకు కారణం. శ్రీనివాసులు పొరుగూరెళ్ళి పది రోజులైంది. అన్నాళ్ళు చూడకుండా ఉండలేదు. మొదటి కారణం. రెండు ఇరుగు పొరుగులంతా 'నీ కొడుకు అంతా సంపాదిస్తుంటే నీ మెళ్ళో బంగారం లేదు. ఇంట్లో సామాన్లేవి,' అంటూ పోచికోలు కబుర్లు చెప్పి అడుగుతుంటే అవన్నీ తనకు లేవే అని ఉక్రోషం. తాతకి తెలుసు సీతమ్మ బాధ.

"అంటే ఆడు పెద్దోడు కాలేదంటావా? ఇప్పుడు నీ సుకానికేం తక్కువైందంట. ఆడు సంపాదించుకోవా లనుకోటంలో తప్పులేదు తల్లీ! కాని ఆడు నికరంగా సంపాదించాల్సింది డబ్బు కాదమ్మా! కీరితి. డబ్బు ఇయాలొచ్చి రేపు కర్గైపోద్ది కీరితి. కర్గై పోదమ్మా! అయినా నాకు తెలీకడుగుతా! ఆడి డబ్బు

నీ కెందుకంట. నువు బీడీలు కట్టి సంపాదిస్తానే ఉంటివి. నాకు పించను వస్తానే ఉండె. ఇంకా ఏం తక్కువైందట. ఆడు నాలుగు సేతులా కీరితి సంపాదిస్తున్నాడు సాలదేంటమ్మా." మెత్తమెత్తగా చివాట్లుపెట్టాడు తాత. సీతమ్మకి ఒళ్ళు మండింది తాత నీతులు విని

"ఆ! ఆ! కీరితొస్తే ఏం లాబం. దాంతోపాటు డబ్బు కూడా రెండు సేతులా సంపాదిత్తే.... ఆ! అయినా ఆడ్ని నేం లాబం. నువ్వేచెప్పుంటావు డబ్బు సంపాదించొద్దని. నేకుంటే ! మద్దెల వాయిత్తే వేలకి వేలిత్తారంటగా! ఆ మాధవయ్యగారిని సూడు. పెద్దిల్లంట. బోలెడు సామానంట. కారంట. మనోడు నాలుగేల్లబట్టి వాయిత్తున్నాడు ఏం లాబం. పూరి గుడిశ, చట్టికుండ, కుక్కి మంచం మారలేదు. నువ్వూ నేనూ ఉన్నంత కాలం సక్కగానే ఉంటది. కాస్తో కూస్తో ఇప్పుడే వెనకేసుకోకపోతే రేపు మాపు ఎట్టుంటదో ఏరికెరికంట." సీతమ్మ తన మనసులో మగ్గుతున్న బాధంతా మాటల్లో వెళ్ళగక్కింది. తాతకి బాధనిపించింది సీతమ్మ వరస.

"సీతమ్మ, శీనివాసులు తల్లే అయినా ఆడది అనిపించుకుంది. నేను రిటైర్ అయినప్పుడు వచ్చిన పదివేల రూపాయల్తో గుడిశ తీసి పెంకుటిల్లు వేయిస్తానంటే శీనివాసులు రెండేళ్ళ క్రితమే ఏమన్నాడు? గొప్పోల్లు సెప్పుకుని సిగ్గదే మాటన్నాడు."

"ఒద్దు తాత! ఈ గుడిశలోనే నేను పెరిగా. ఇంతకాలం నా కోసం ఎవరూ రాలేదు. ఇప్పుడూ రారు. ఇప్పుడెవరొచ్చినా నా విద్యకోసం వస్తారు. నాకోసం వచ్చేవారికి నేనెక్కడుందీ, ఎలా ఉందీ, ఏం కట్టుకుందీ, నా యిల్లూ, సామాన్లూ కావాలి.

"కాని నా విద్యకోసం వచ్చేవారికి అవేమీ అక్కర్లేదు. నేనెలా వాయిస్తాను? వాయించగలను? నా వాయిద్యం వినడంకోసం ఎంతమంది విరగబడివస్తారు? నా మీద ఎంత డబ్బు గడించగలం! అన్నదే వారి ఆలోచన. ఆశయం. మనకీ పూరిగుడిశే ఎంతో బాగుంది. చాలు." అన్నాడు.

శ్రీనివాసులు అంతదీర్ఘోపన్యాసం ఇస్తుంటే సీతమ్మ మూతివిరిచింది. ఆదెయ్య గర్వపడ్డాడు ఆరోజు. అన్ని మాటలు విన్నా ఆమె మనసు మారలేదు. ఇంకా సీతమ్మ మనసులో అదేమాట పెట్టుకున్నదని తెలియగానే ఆదెయ్యకు బాధ కలిగింది. ఆమె మనసులో ఆ ఆలోచన, ఆశ పురుగులా తొలిచేస్తోంది. ఆ పురుగును చంపెయ్యకపోతే అశాంతితో అలమటించిపోతుం దనిపించింది. అందుకే మెల్లగా లేచి సీతమ్మ దగ్గిరకెళ్ళి కూర్చున్నాడు తాత.




"సీతమ్మా! మనోడు డబ్బు సంపాదించాలనీ, గొప్పవాడై పెద్ద పెద్ద ఇల్లూ, సామాన్లూ చేర్చుకోవాలనీ తల్లిగా నువు కోరుకోవటంలో తప్పులేదమ్మా! కాని అడికి ఇద్దెమీదున్న ఆశ డబ్బుమీద లేదు. కాస్తోకూస్తో తెచ్చింది బియ్యం, పప్పు, ఉప్పు తెస్తూనే ఉన్నాడు. అంతకంటే ఏంకావాలి మనకు? కడుపునిండా తింటన్నాం."

"అడికి డబ్బు మదుపు మనం పెట్టాలమ్మా! అప్పుడు అడు మనకు ఋణపడి పోతాడు. ఆ ఋణం తీర్చుకుందాకా అడు బతుకుతాడు. అడు కష్టంచేసి తెచ్చిన డబ్బు మనం ముట్టామో, అది ఋణం తీరిపోద్దమ్మా! అడు సుకంగా సానాకాలం బతకాలి. మనిద్దరం సచ్చిపోయిందాకన్నా బతకాలమ్మా! అడి డబ్బుకోసం ఆరాటపడి అడ్ని అర్ధాయుష్మంతుడిగా సెయ్యబోకమ్మా!" సీతమ్మ రెండుచేతులూ పట్టుకుని భోరున ఏడ్చాడు తాత. తాత ఏడుస్తుంటే సీతమ్మకీ ఏడుపొచ్చింది. తాత చెప్పిందీ నిజమేననిపించింది. తన తప్పు తెలుసుకుంది సీతమ్మ.

"తప్పైందిలే అయ్యా! అడి సుకమే కావాలి మనకు. అడు నూరేల్లు చల్లగా బతకాల. నా ఆయుషుకూడా అడికియ్యమని బగమంతుడ్ని అడుగుతా" అంటూ పశ్చాత్తాపపడింది సీతమ్మ. ఆదెయ్య సంతోషపడ్డాడు.

"అయ్యా! మనోడు ఎల్లి వారం రోజులైంది. ఇంకా రాలేదేంటో? ఇన్నాల్లూ అడిఎంట నువు ఎడితే నాకు బెంగుండేది కాదు. అడ్ని సూసి ఏన్నో ఏల్లైనట్లుంది.

నా నేత్తో ఆడికి అన్నం ఎప్పుడైనా పెట్టానా అని పిత్తోందయ్యా!" కళ్ళు నీళ్ళెట్టుకుంది సీతమ్మ బెంగగా. ఆదెయ్యకూ అలాగే అనిపిస్తోంది. సీతమ్మ పైకని కళ్ళు తుడుచుకుంటుంటే, ఆదెయ్య లోలోపలే బాధపడుతున్నాడు. సీతమ్మ చూడకుండా కళ్ళు తుడుచుకుంటున్నాడు. వాకిట్లో టాక్సీ ఆగిన చప్పుడైతే ఇద్దరూ ఒకేమాటు తలతిప్పి చూశారు. ఆనందంతో ఎదురెళ్ళారు. శ్రీనివాసులు వాళ్ళిద్దరిమీదా చేతులేసి ఇంట్లోకి నడిచాడు. మూడు హృదయాలు మూడు పువ్వుల్లా వికసించాయి.

సీతమ్మ కొడుకొచ్చిన సంబరలో ఏవేవో వండాలనుకుంది. ఆ సంతోషంలో కొడుకునే చూస్తూ మైమరచిపోయింది. కంచంలో పడ్డిస్తూ సిగ్గుపడింది అన్నం తప్ప మరేమీ వొండనందుకు. కాని శ్రీనివాసులు అదే పంచభక్ష్యాలుగా భావించాడు తల్లి ప్రేమామృతంకంటే మరేదీ లేదన్నట్లుగా. తాత శ్రీనివాసులు ఒళ్ళంతా తనితీరా తడిమి తృప్తిపడ్డాడు.

"అమ్మా! గురువుగార్ని చూసి చాలాకాలమైంది. సాయంత్రం వెళ్ళిరానా?" తల్లి అనుమతి కోరుతున్నట్లు అడిగాడు శ్రీనివాసులు భోజనంచేస్తూ. అలా కొడుకు తన అనుమతి కోరుతుంటే అతనికి తల్లిపైగల అభిమానానికి, గౌరవానికి అబ్బురపడింది సీతమ్మ.

"అలాగే సాయింతరం సల్లపాటున ఎల్లిరా!" అంది అనుమతిస్తూ.

"అలాగే శివాణెమ్మ గారింటికికూడా ఎల్లిరారా అబ్బిగా! ఈ రోజున నివ్వింత ఇదిగా ఉన్నావంటే ఆ యమ్మ సలవే. సల్లని తల్లి," అన్నాడు ఆదెయ్య. ఆదెయ్యకు శ్రీవాణి అన్నా చిట్టిబాబుగారన్నా చాలా గౌరవం.

"అలాగే తాతా!" అని వెళ్ళి పడుకున్నాడు వరండాలో మంచంమీద.

"అయ్యా! నేనోమాట అడుగుతా! మనం పెద్దోల్లమైపోయినాం. నువు ముందో? నేను ముందో! మనిద్దరం లేకుంటే ఆడు ఒంటరిగాడైపోడా అంట" అంది సీతమ్మ. ఆమె మనసులో ఉన్న ఏదోమాటకి ముందు ఉపోద్ఘాతమని తాతకి తెలుసు.

అందుకే నవ్వి, "ఒంటరిగాడుగా ఎందుకుంటాడంట. జంట కలిపేత్తే సరి" అన్నాడు. అదే ఆమె మనసులో మాట. శ్రీనివాసులికి వారి మాటలు వినిపిస్తూనే ఉన్నాయి.

"అవును వాడేం సంటిపిల్లాండేంటి. పెళ్ళి చేస్తే ముగ్గురు పిల్లల్ని కనేసి ఉండేటోడు" అంది మురిపెంగా.

"ఆ. ఆ! ముగ్గురొద్దంట. ఇద్దరే! నీకోడు, నాకోసు మనవలు. ఎంచక్కా ఆళ్లనెట్టుకుని ఆడుకుంటా ఉంటే, నీకు బెంగా ఉండదు. నాకు తీరికా ఉండదు. ఏంటంటావ్ సీతమ్మతల్లీ?" అన్నాడు. వారిద్దరికీ అప్పుడే శ్రీనివాసులి పెళ్ళయినట్లూ, మనవళ్ళూ మనవరాళ్ళూ పుట్టేసినట్లూ కలలు కన్నారు.

"మరి పిల్లెవరేంటి? కోడలుపిల్ల" అన్నాడు ఆదెయ్య, సీతమ్మ ఏరి ఉంచిందేమోనని.

"ఏమో! నేనేం చూసిపెట్టానా ఏంటి? ఏడనో పుట్టే ఉంటది. అ బంగారబ్బొమ్మ," అంది మురిసిపోతూ సీతమ్మ. తన కోడలు బంగారుబొమ్మలా ఉండాలనే ప్రతి అత్త ఆశ.

'అవును. అమ్మకోడలు ఎవరైనా బంగారపుబొమ్మే!' అనుకున్నాడు శ్రీనివాసులు నవ్వుకుంటూ.

శ్రీనివాసులు కళ్ళలో శ్రీవాణి కదిలింది. పట్టుచీరలో, పరమపావని పార్వతిలా కనిపించింది శ్రీవాణి. చిరునవ్వులు నవ్వుతూ సిగ్గులొలకబోస్తోంది. అతి సున్నితంగా, నా మనసు నొవ్వకుండా నన్ను మెప్పించి నాకు లోకజ్ఞానాన్ని అందించింది శ్రీవాణి. ఆమె కళ్ళలో కాంక్ష లేదు కరుణ తప్ప. మనసులో ప్రేమ, ఆరాధనతప్ప అసూయ ఎరుగదు. ఆమె సన్నిధానంలో కోటి వీణా నాదాలు వినిపిస్తాయి. ఆమె పాడుతుంటే గంధర్వగానం అంటే అదేనేమో అనిపిస్తుంది. శ్రీవాణి సాన్నిధ్యం ఎప్పటికీ నాకు కావాలనిపిస్తుంది. ఆమె గానం వినకపోతే పిచ్చెక్కుతుం దనిపిస్తుంది. ఆమె శృతి, నేను లయగా వీణపై నాట్యం చెయ్యాలనిపిస్తుంది," అనుకుంటూ నోటితో శివతాండవ శబ్దాలు పలికిస్తూ పరవశించిపోయాడు.

ఆమె పార్వతిగా గానంచేస్తుంటే తను శివుడిగా నృత్యం చేస్తున్నట్లనిపించింది శ్రీనివాసులుకు.

తను శ్రీనివాసుడు, శ్రీతిరుపతి వెంకటేశ్వరుడుగా శ్రీవాణి తన హృదయంలో నిలిచినట్లనిపించింది శ్రీలక్ష్మిలాగా. కాని తన మనసులో ఆలోచనకు తనకే సిగ్గేసింది. ఇదంతా తన ఊహ. తన ఊహారాణి శ్రీవాణి. కాని ఆమె మనసులో తనమీద ఎటువంటి అభిప్రాయముందో తెలుసుకోకుండా కలలు కనటం అవివేక మనిపించింది శ్రీనివాసులుకు. ఆమె నవ్వుతూ ఆహ్వానిస్తే ఆమె తన ప్రియుడికోసం వేచిఉందనుకోటం అనుచితం. మైనా మాట్లాడుతున్న మాటలు ఆ శ్రీనివాసుడ్ని గురించి శ్రీవాణి భక్తితో పలికే మాటలై ఉండొచ్చు.

ఆమె చనువుగా మాట్లాడితే ఏవేవో ఊహించుకోవడం ఆమెని అపార్థం చేసుకోవడమే అవుతుందేమో! ఆత్మవంచన అవుతుందేమో! ఆమె ఆరాధన నా విద్యకే పరిమితం అయితే ఆమెని కోరటం నా తెలివితక్కువకు నిదర్శనం. అవమానం పొందటానికి ఆస్కారం. ఏది ఏమైనా ఆమె విద్యావతి. గానకోకిల. ఆమె కంఠంతోనే మా పరిచయం. నా లయతోటే ఆమె స్నేహం ప్రారంభమైంది. ఈ స్నేహబంధం కలకాలం పవిత్రంగా నిలవాలి. తరతరాలకీ సువర్ణ దీపంగా వెలగాలి అనుకున్నాడు. ముందుగా శ్రీవాణి దగ్గర కెళ్ళాలనిపించినా, గురువుగారింటి కెడితే బాగుంటుం దనిపించింది.

దేముడి దగ్గరకూ, పెద్దల దగ్గరకూ, గురువు దగ్గరకూ, పసిపాపల దగ్గరకూ ఉత్తచేతులతో వెళ్ళకూడదని తాత నేర్పిన అలవాటు ప్రకారం ఒక బుట్టనిండా పళ్ళు తీసుకుని మాధవయ్యగారి ఇంటికి బయలుదేరాడు సాయంత్రం చల్లపాటున శ్రీనివాసులు.

మాధవయ్యగారు హాల్లో కూర్చుని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. నాదబ్రహ్మం లేడు. ఎవరో ఒకరిద్దరు పిల్లలు మృదంగం తమకు తామే ప్రాక్టీసు చేసుకుంటున్నారు. శ్రీనివాసులు లోపలికి వస్తూనే,

"నమస్కారం గురువుగారూ!" అంటూ వచ్చి ఆయన పాదాలకు నమస్కరించి కళ్ళకు అద్దుకున్నాడు భక్తిభావంతో. మాధవయ్యగారు ఆ భక్తికి పులకించి పోయారు. నిర్మలమైన అతని భక్తిలో కుత్రిమం గానీ, కుతంత్రం గానీ ఆయనకు గోచరించలేదు. ఆ క్షణంలో తన పగ, అసూయ జ్ఞప్తికే రాలేదు మాధవయ్యగారికి.

"ఏం నాయనా! కులాసానా? ఏం ఎక్కడా కనిపించటం లేదు. చాలా కాలమైనట్లుంది నిన్ను చూసి" అన్నారు. ఆశీర్వదిస్తున్నట్లుగా అతని తలమీద చెయ్యి పెట్టి. తీరిక చిక్కినప్పుడల్లా మాధవయ్యగారింటికి వస్తాడు శ్రీనివాసులు.

"ఏదో మీ ఆశీర్వాదం. నెల రోజులుగా విధీవిరామం లేకుండా ప్రోగ్రాముల్లో తిరుగుతూ ఈరోజే వచ్చాను," అన్నాడు వినయంగా.

"అయితే నీ వాయిద్యం అందర్నీ ఆకట్టుకున్న దన్నమాట." ఆ మాట అంటుంటే ఒద్దనుకున్నా అసూయ గిచ్చింది మాధవయ్యగార్ని.

"చాలా తక్కువ కాలంలోనే అఖండమైన పేరు ప్రఖ్యాతులు గడించుకుంటున్నావన్నమాట. చాలా సం...." దగ్గు తెరవచ్చింది అడ్డుగా. "నీ గురువుగా నాకూ చాలా గొప్పగానే ఉంది," అంటూ ఎగాదిగా చూశారు మాధవయ్యగారు, శ్రీనివాసుల్ని.

ఐదేళ్ళ క్రితం గుడిశలో చూసిన ఆనాటి శ్రీనివాసులికీ ఇతనికీ కొద్దే తేడా. అదే చిరునవ్వు. అదే నమ్రత. అదే భక్తి. అదే విశ్వాసం. కాని కొద్దిగా లావయ్యాడు. 'మరి సంపాదన పెరిగితే సంతోషం కదా! అందులోనూ ప్రతి చోటా ప్రశంసలు. సంతోషం సగం బలం' అనుకున్నారు. అప్పుడే అసూయ ముల్లు పైకి లేచింది. మనసులోనే శ్రీనివాసుల స్థితిగతులు అంచనావేస్తున్నా రాయన. 'కాస్త రంగు కూడా వచ్చాడు. బలిస్తే రంగు రావటం సహజం. అందులోనూ, రేడియో స్టేషన్లు, టి.వి. స్టేషన్లు ఎయిర్‌కండిషన్లాయె. ఏకలవ్య బిరుదాంకితుడు, నవమృదంగ వాద్య విద్వాంసుడు చిన్న చిన్న హోటళ్ళలో ఎందుకుంటాడు! ఏ ఐదు నక్షత్రాల హోటల్లోనో ఎయిర్ కండిషన్ గదుల్లో ఉంటుండొచ్చు. మొన్నీమధ్య విదేశాలు కూడా వెళ్ళొచ్చాట్ట. అందుకే రంగొచ్చుంటాడు.' ముల్లు కసుక్కున గుచ్చుకుని బాధ పెట్టింది. రక్తం చిమ్మింది. మెళ్ళో బంగారు గొలుసు. చేతికి వాచి కనిపించాయి. గండ పెండేరాలు, సింహతలాటాలు ఈ రోజుల్లో తొడగటం మానేసి పద్మశ్రీలు కళాప్రపూర్ణలు బిరుదులిస్తున్నారుగా. ఎప్పుడో అదీ కొట్టేస్తాడు వీడు. మనిషి కాస్త హుందాగా కనిపించాడు. పదిమందిలో తిరుగుతుండటంవల్ల మంచి మంచి బట్టలు కట్టుకున్నాడు. కాస్త భాషకూడా మారింది' అనుకున్నారు. 'బురద పాముని తెచ్చి శివుని మెడలోవేస్తే నాగుపామై కూర్చుంది. బుసలు కొడుతోంది. ఎప్పుడో కాటేస్తుంది' అనిపించింది మనసులో. తననే ఎగాదిగా చూస్తున్న గురువుగారిని చూస్తుంటే సిగ్గేసింది శ్రీనివాసులికి.

"ఇవిగో ఈ పళ్ళు స్వీకరించండి" అంటూ బుట్టలోంచి రెండు ఎర్రటి దానిమ్మపళ్ళు కాబూలువి తీసి ఆయన చేతిలో పెట్టబోయాడు. అంతలో నాదబ్రహ్మం వచ్చి స్విచ్ వేశాడు. లైటు వెలిగింది. శ్రీనివాసులు కనిపించగానే "చీకట్లో కూచోవద్దని చెప్పినా వినరు," అంటూ లోపలికి వచ్చి,

"ఓ! నువ్వా! అభినవ ఏకలవ్యులు. నీపేరు వాడవాడలా రేడియోల్లోనూ, టి.వి. ల్లోను, పేపర్లులోనూ మోగిపోతుంటే వింటున్నాం. కంటున్నాం. నువు చాలా బిజీ అయిపోయావటగా! పాపం మన గురువుగారు మాత్రం ఈ మధ్య కాస్త విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆయన బాధంతా నీ గురించే! ఎలా చిక్కిపోయారో చూడు" అన్నాడు నాదబ్రహ్మం. అతనికి భయం శ్రీనివాసుల మెత్తని పలుకులకి ఎక్కడ మురిసిపోయి అసలు విషయం మర్చిపోతారో అని జ్ఞాపకం చేశాడు. తెలివిగా మాధవయ్యగారికి ఇషారా ఇచ్చాడు.

శ్రీనివాసులు కళ్ళకి మాధయ్యగారు కాస్త నలిగినట్లనిపించింది.

"నన్ను గురించి మీరు బాధపడి ఆరోగ్యం పాడుచేసుకోకండి. మీ శిష్యుడిగా మీ పేరు నిలబెట్టి మీకు సంతోషాన్ని కలుగచేస్తాను. నా మాట నమ్మండి" అన్నాడు అమాయకంగా. వినయంగా ఆయన్ని బాధపడవద్దన్నట్లుగా.

"ఆయన పేరు నువు నిలబెట్టేదేంటయ్యా! ఆయన పేరు ఆయనే నిలబెట్టు కున్నారు. కుంటారు. కాని నీ భవిష్యత్తు గురించే ఆయన ఆందోళన. కాదండీ గురువుగారూ!" అన్నాడు నాదబ్రహ్మం కన్నుగీటి జిత్తులు ప్రయోగిస్తూ. ఔనన్నట్లుగా తలూపి తల దించుకున్నారు మాధవయ్యగారు.

ఏదో భీతి, సన్నటి ఒణుకు ప్రారంభించింది మాధవయ్యగారిలో. తనని గురించి గురువుగారు అంత బాధపడుతున్నారని తెలియగానే శ్రీనివాసులు గుండె బరువై పోయింది. తన క్షేమం కోరి ఆలోచించేవారు, బాధపడేవారు నాకు నాలుగురున్నా రన్నమాట. ఆ నలుగురికోసం ఏమైనా చెయ్యాలి తను అనుకున్నాడు శ్రీనివాసులు ధృడంగా. గురువుగారివంక దీనంగా చూస్తూ, "నా భవిష్యత్తుని తీర్చిదిద్దిన మీకే నా భవిష్యత్తుని గురించి బాధకలుగుతోందంటే....నాలో ఏదైనా లోపం ఉందా గురువుగారూ! నేనేమైనా తప్పు చేశానా? చేస్తున్నానా? చేస్తానని అనుమానమా? చెప్పండి. సరిదిద్దుకుంటాను...."అన్నాడు బాధగా. అతని వినయం చూస్తుంటే మాధవయ్యగారు ఏదీ చెప్పలేకపోతున్నారు. సంశయిస్తుంటే నాదబ్రహ్మం అందుకుని,

"గురువుగారు చెప్పటానికి ఇదౌతున్నారు. పోనీ....నేను చెప్పనా?" అంటూ ఇద్దరి వంకా చూశాడు. ఇద్దరూ చెప్పమన్నట్లు చూశారు.

"నీకు సత్యన్నారాయణస్వామివారి కథ తెలుసుగా! ఆ వ్రతం చేసినవారు ప్రసాదం నలుగురికీ పెట్టి తినకపోతే స్వామివారు శపిస్తారుట. ఫలితం సూన్యంట."

నాదబ్రహ్మం చెప్పే కథ తనకు ఏమాత్రం అన్వయించుకోలేక తికమక పడ్డాడు శ్రీనివాసులు.

"ఈ కథకీ నాకూ ఏం సంబంధం అనుకోవచ్చు నువ్వు. కాని ఉంది. విద్య కూడా ఒక వ్రతం లాంటిదే. దేనికైనా భక్తి, శ్రద్ధ, వినయం, ఓర్పు, శాంతం, త్యాగం, తృప్తి అన్నీ కావాలి. అవన్నీ నీలో ఉన్నాయని గురువుగారు అందరితోనూ చెప్పుకుని మురిసిపోతారు. గర్వపడుతుంటారు. కాని ఇంకా నీలో ఏదో లోపం కనిపిస్తోందని బాధపడతారు. నీతో ఏదో చెప్పాలనీ, అడగాలనీ అంటూంటారు.

ఐదేళ్ళ క్రితం గుడిశలో చూసిన ఆనాటి శ్రీనివాసులికీ ఇతనికీ కొద్దే తేడా. అదే చిరునవ్వు. అదే నమ్రత. అదే భక్తి. అదే విశ్వాసం. కాని కొద్దిగా లావయ్యాడు. 'మరి సంపాదన పెరిగితే సంతోషం కదా! అందులోనూ ప్రతి చోటా ప్రశంసలు. సంతోషం సగం బలం' అనుకున్నారు. అప్పుడే అసూయ ముల్లు పైకి లేచింది. మనసులోనే శ్రీనివాసుల స్థితిగతులు అంచనావేస్తున్నా రాయన. 'కొస్త రంగు కూడా వచ్చాడు. బలిస్తే రంగు రావటం సహజం. అందులోనూ, రేడియో స్టేషన్లు, టి.వి. స్టేషన్లు ఎయిర్‌కండిషన్లాయె. ఏకలవ్య బిరుదాంకితుడు, నవమృదంగ వాద్య విద్వాంసుడు చిన్న చిన్న హోటళ్ళలో ఎందుకుంటాడు! ఏ ఐదు నక్షత్రాల హోటల్లోనో ఎయిర్ కండిషన్ గదుల్లో ఉంటుండొచ్చు. మొన్నీమధ్య విదేశాలు కూడా వెళ్లొచ్చాట్ట. అందుకే రంగొచ్చుంటాడు.' ముల్లు కసుక్కున గుచ్చుకుని బాధ పెట్టింది. రక్తం చిమ్మింది. మెళ్ళో బంగారు గొలుసు. చేతికి వాచి కనిపించాయి. గండ పెండేరాలు, సింహతలాటాలు ఈ రోజుల్లో తొడగటం మానేసి పద్మశ్రీలు కళాప్రపూర్ణలు బిరుదులిస్తున్నారుగా. ఎప్పుడో అదీ కొట్టేస్తాడు వీడు. మనిషి కొస్త హుందాగా కనిపించాడు. పదిమందిలో తిరుగుతుండటంవల్ల మంచి మంచి బట్టలు కట్టుకున్నాడు. కొస్త భాషకూడా మారింది' అనుకున్నారు. 'బురద పాముని తెచ్చి శివుని మెడలోవేస్తే నాగుపామై కూర్చుంది. బుసలు కొడుతోంది. ఎప్పుడో కాటేస్తుంది' అనిపించింది మనసులో. తననే ఎగాదిగా చూస్తున్న గురువుగారిని చూస్తుంటే సిగ్గేసింది శ్రీనివాసులికి.

"ఇవిగో ఈ పళ్ళు స్వీకరించండి" అంటూ బుట్టలోంచి రెండు ఎర్రటి దానిమ్మపళ్ళు కొబూలువి తీసి ఆయన చేతిలో పెట్టబోయాడు. అంతలో నాదబ్రహ్మం వచ్చి స్విచ్ వేశాడు. లైటు వెలిగింది. శ్రీనివాసులు కనిపించగానే "చీకట్లో కూచోవద్దని చెప్పినా వినరు," అంటూ లోపలికి వచ్చి,

"ఓ! నువ్వా! అభినవ ఏకలవ్యులు. నీపేరు వాడవాడలా రేడియోల్లోనూ, టి.వి. ల్లోను, పేపర్లులోనూ మోగిపోతుంటే వింటున్నాం. కంటున్నాం. నువు చాలా బిజీ అయిపోయావటగా! పాపం మన గురువుగారు మాత్రం ఈ మధ్య కొస్త విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆయన బాధంతా నీ గురించే! ఎలా చిక్కిపోయారో చూడు" అన్నాడు నాదబ్రహ్మం. అతనికి భయం శ్రీనివాసుల మెత్తని పలుకులకి ఎక్కడ మురిసిపోయి అసలు విషయం మర్చిపోతారో అని జ్ఞాపకం చేశాడు. తెలివిగా మాధవయ్యగారికి ఇషారా ఇచ్చాడు.

శ్రీనివాసులు కళ్ళకి మాధయ్యగారు కాస్త నలిగినట్లనిపించింది.

"నన్ను గురించి మీరు బాధపడి ఆరోగ్యం పాడుచేసుకోకండి. మీ శిష్యుడిగా మీ పేరు నిలబెట్టి మీకు సంతోషాన్ని కలుగచేస్తాను. నా మాట నమ్మండి" అన్నాడు అమాయకంగా. వినయంగా ఆయన్ని బాధపడవద్దన్నట్లుగా.

"ఆయన పేరు నువు నిలబెట్టేదేంటయ్యా! ఆయన పేరు ఆయనే నిలబెట్టుకున్నారు. కుంటారు. కాని నీ భవిష్యత్తు గురించే ఆయన ఆందోళన. కాదండీ గురువుగారూ," అన్నాడు నాదబ్రహ్మం కన్నుగీటి జిత్తులు ప్రయోగిస్తూ. ఔనన్నట్లుగా తలూపి తల దించుకున్నారు మాధవయ్యగారు.

ఏదోభీతి, సన్నటి ఒణుకు ప్రారంభించింది మాధవయ్యగారిలో. తనని గురించి గురువుగారు అంత బాధపడుతున్నారని తెలియగానే శ్రీనివాసులు గుండె బరువైపోయింది. తన క్షేమం కోరి ఆలోచించేవారు, బాధపడేవారు నాకు నాలుగురున్నారన్నమాట. ఆ నలుగురికోసం ఏమైనా చెయ్యాలి తను అనుకున్నాడు శ్రీనివాసులు ధృడంగా. గురువుగారివంక దీనంగా చూస్తూ, "నా భవిష్యత్తుని తీర్చిదిద్దిన మీకే నా భవిష్యత్తుని గురించి బాధకలుగుతోందంటే....నాలో ఏదైనా లోపం ఉందా గురువుగారూ! నేనేమైనా తప్పు చేశానా? చేస్తున్నానా? చేస్తానని అనుమానమా? చెప్పండి. సరిదిద్దుకుంటాను...."అన్నాడు బాధగా. అతని వినయం చూస్తుంటే మాధవయ్యగారు ఏదీ చెప్పలేకపోతున్నారు. సంశయిస్తుంటే నాదబ్రహ్మం అందుకుని,

"గురువుగారు చెప్పటానికి ఇదౌతున్నారు. పోనీ....నేను చెప్పనా?" అంటూ ఇద్దరి వంకా చూశాడు. ఇద్దరూ చెప్పమన్నట్లు చూశారు.

"నీకు సత్యన్నారాయణస్వామివారి కథ తెలుసుగా! ఆ వ్రతం చేసినవారు ప్రసాదం నలుగురికీ పెట్టి తినకపోతే స్వామివారు శపిస్తారుట. ఫలితం సూన్యంట."

నాదబ్రహ్మం చెప్పే కథ తనకు ఏమాత్రం అన్వయించుకోలేక తికమక పడ్డాడు శ్రీనివాసులు.

"ఈ కథకీ నాకూ ఏం సంబంధం అనుకోవచ్చు నువ్వు. కాని ఉంది. విద్య కూడా ఒక వ్రతం లాంటిదే. దేనికైనా భక్తి, శ్రద్ధ, వినయం, ఓర్పు, శాంతం, త్యాగం, తృప్తి అన్నీ కావాలి. అవన్నీ నీలోఉన్నాయని గురువుగారు అందరితోనూ చెప్పుకుని మురిసిపోతారు. గర్వపడుతుంటారు. కాని ఇంకా నీలో ఏదో లోపం కనిపిస్తోందని బాధపడతారు. నీతో ఏదో చెప్పాలనీ, అడగాలనీ అంటూంటారు.

అప్పుడు నీ సమాధానం బట్టి నీ భవిష్యత్తులో నీ గురించి బాధ తొలగించు కోవడమో, ఇలాగే కుళ్ళిపోవడమో జరుగుతుంది అంటారు. అంతే కదండీ!" అంటూ మాధవయ్యగారికి కన్ను గీటాడు చాలా అన్నట్లుగా.

"అలాగా! అయితే అడగండి గురువుగారూ! మిమ్మల్ని సంతోష పెట్టడం కన్న నాకీ జీవితంలో మరో ధ్యేయం లేదు." శ్రీనివాసులు కళ్లలో అర్థింపు ఆ వెనక దృఢత్వం గోచరించిం దాయనకు. పక్కనే కూచున్న శ్రీనివాసులు తల నిమురుతూ,

"మన సృష్టిలో ప్రతిదానికీ ఒక ధర్మం ఒక న్యాయం ఉందికదా! ఉదాహరణకు చింతకాయ పులుపు. పంచదార తీపి. కాకర చేదు. ఇలాగే ప్రతిదానికీ ఒక న్యాయం. అది తప్పితే దాన్ని ఆ పేరుతో పిలుస్తామా? పిలవం. నిప్పు కాలుతుంది. అది దాని దర్మం. అది తెలిసి చేతులు పెడతామా? అందుకే పసివాడివైన నీకు ఏది ఉప్పో ఏది కప్పూరమో విప్పిచెప్పాలనిపించింది. అది గురువుగా నా ధర్మం. నేను చెప్పింది వినడం నీకు న్యాయం. ఏ యుగమైనా గురుశిష్యులుండక తప్పదు. ఏ విద్యకైనా గురువు కావాలి. గురువు దగ్గర నేర్చిన విద్యకు విలువ లేదు. ఉండదు. అంచనాకట్టే అర్హత, సామర్థ్యం ఎవరికీ లేదు. ఎందుకంటే భూమి విలువలాగా విద్య విలువ పెరుగుతుంది కనుక. మరి అంత పెరిగిపోయే ధనాన్ని ఇచ్చిన గురువును సంతోషపరచటం శిష్యుడి ధర్మం కదా!" ఆయన పెదవులు ఒణికాయి. కొద్దిసేపు మాటలు రాలేదు ఎందుకో! కాస్త భయంకూడా కలిగింది.

"అవును ధర్మమే. గురువు త్రిమూర్తులతో సమానం. తల్లిదండ్రులతో సమానం అని మీరే చెప్పారు ఎప్పుడో. మరి మీ కోసం ఏదైనా వెనకాడక చెయ్యడం మా ధర్మం" అన్నాడు శ్రీనివాసులు. మనస్ఫూర్తిగా అన్నాడని మాధవయ్యగారికి తెలుసు.

అతను అలా అనటమే కాదు తనకోసం తన మాట మేరకు ఏదైనా చేస్తాడని తెలుసు మాధవయ్యగారికి. అంత త్యాగమూర్తిని అడగటానికి నోరు రావటం లేదు. కాని అడక్క తప్పదు. అడిగి తీరాలి. అది తన భవిష్యత్ సమస్య. తనే పరిష్కరించుకోవాలి.

పదవి అనుభవించినవాడికి ఆ పదవి పోతూందంటే బాధ. డబ్బు గల వాడికి డబ్బు పోతూందంటే బాధ. సంపాదించిన పేరు కరిగిపోతూందంటే కొందరికి బాధ. అనుకున్నది సాధించలేకపోతే కొందరికి బాధ.

వీరందరికీ ప్రాణం పోతుందనే బాధ లేదు. కాని అవి దక్కితే చాలు. మాధవయ్యగారి పరిస్థితీ అదే ఇప్పుడు.

"విద్యాభ్యాసానంతరం గురువు దీవన పొందాలి. నువ్వలా నా దీవన పొందావు. కాని గురు దక్షిణ ఇవ్వడం గురువును సంతృప్తిపరచటం సాంప్రదాయం. అది నువ్వు చెయ్యలేదు. ఎంత చేసినా అది లోపిస్తే కలిగే అనర్థం ఊహాతీతం" అని కళ్ళు మూసుకున్నారు. బలిపీఠం మీదకు ఎక్కిన వాడికంటే కసాయి వాడికే ఎక్కువ బాధ కలుగుతున్నట్లుగా ఉంది ఆయన బాధ.

"గురుదక్షిణగా మీకేం కావాలో కోరండి, ఇస్తాను. నా స్థోమత మీకు తెలుసు. నేనివ్వగలిగిందైతే తప్పక ఇస్తాను" అన్నాడు శ్రీనివాసులు.

"భలేవాడివేనయ్యా! నాకే దేవ పారిజాతం అక్కర్లేదు. ఏడు సముద్రాల అవతల ఉన్న మాంత్రికుడి ప్రాణం అక్కర్లేదు నీ దగ్గర ఉన్నదే!" ఆయన మనసు కర్కశంగా మార్చుకున్నాడు. కఠినంగా ఎటో చూస్తూ "ఈ రోజు నుంచీ నువు మృదంగం ముట్టరాదు" శాశించి మరి ఆ చోట ఉండలేక లోపలికి చకచకా వెళ్ళిపోయారు మాధవయ్యగారు. మ్రోగుతున్న వెయ్యి మృదంగాలు ఒక్క మాటుగా సీమటపాకాయలా పేలి పగిలి ముక్కలై పోయినట్లుగా, శ్రీనివాసులు ఆమాట వినగానే హృదయం ముక్కలైపోయింది. కాని అంతలోనే తనకు తాను సంబాళించుకుని, మాధవయ్యగారి అరడుగుల తైల వర్ణ చిత్రానికి నమస్కరించి, ఆయన పాదాలు కళ్ళకద్దుకుని కాయలు కాసిన తన రెండు చేతులూ చూసుకుని వెళ్ళిపోయాడు శ్రీనివాసులు. ఆ తరువాత శ్రీవాణి ఇంటికి వెళ్ళబుద్ధి కాలేదు. ఇంటికెళ్ళినా తల్లి, తాతతో కూడా జరిగిన విషయం చెప్పలేదు. చెప్పకూడదనుకున్నాడు. ఎవరికైనా ఈ విషయం తెలిస్తే బాధ పడతారు. మాధవయ్యగారిని నిందిస్తారు. ఆయన్ని నిందిస్తే తను విన లేడు. సహించలేడు.

తెల్లవారు ఝామున నుంచీ ఆలకిస్తున్నాడు తాత, మృదంగశబ్దం వినిపిస్తుందేమోనని. తెల్లవారుఝామున మూడు గంటల్నించీ శ్రీనివాసులు మామూలుగా సాధన చేసుకునే వేళ. తొమ్మిదైతే గాని లేవడు. కాని ఆ రోజు మృదంగ శబ్దం వినిపించలేదు. ప్రయాణ బడలికో ఒళ్ళు బాగుండలేదేమోనన్న అనుమానం కలిగింది. అంతలో ఎవరో పెద్దమనుషులు వచ్చారు శ్రీనివాసులు కోసం. వారిని కూచోమని కుర్చీ చూపించి ఆదెయ్య శ్రీనివాసుల్ని లేపటానికి వెళ్ళాడు. శ్రీనివాసులు గోడ పక్కకు తిరిగి పడుకున్నాడు మంచంమీద.







"ఒరే శీనూ! ఎవరో వచ్చార్రా నీ కోసం" అన్నాడు ఆదెయ్య. శ్రీనివాసులు మెల్లగా లేచి బయటకు వస్తుంటే ఒళ్ళు పట్టి చూశాడు. చల్లగానే ఉంది. ప్రయాణ బడలిక కాబోలు అనుకున్నాడు, వాడిపోయిన ముఖం చూసి.

"నమస్కారం ఏకలవ్యుడుగారూ! రేపు మన ఊళ్ళోనే ప్రోగ్రాం. తమరు వచ్చారని తెలిసి...." శ్రీనివాసులుకు నవ్వొచ్చింది తనని ఆ పేరుతో పిలవగానే. ఆ పేరుకూ, నా బ్రతుక్కూ చక్కగా సరిపోయాయి అనుకున్నాడు మనసులో. కొందరు పేరుతోనూ కొందరు అలాగూ పిలవటం పరిపాటై పోయింది.

"క్షమించండి. వేరెవరినైనా మాట్లాడుకోండి." అన్నాడు తలొంచుకుని.

"ఏం? ఎందుకని? మీ ఒంట్లో బాగోలేనా?" అని అడిగాడు గాభరగా.

'అవును. ఇది శాశ్వతమైన జబ్బు! ఈ శరీరాన్ని, మనసునునీ కృంగతీసే జబ్బు" నా జబ్బు మీకెలా చెప్పగలను? చెప్పినా గురువుని నలుగురి చేతా ఎలా తిట్టించగలను. ఈ విషయం నాతోపాటే సమాధి కావాలి ఎవరికి తెలియకుండా' అనుకున్నాడు మనసులో దృఢంగా.

పైకి మాత్రం "అవునండీ!" అన్నాడు శ్రీనివాసులు.

"అలాగా! మీ నవమృదంగం సోలో ప్రోగ్రాం మన ఊళ్ళో ఏర్పాటుచేయాలని అనుకున్నాం. పోనీ తమకు కులాసాగా ఉన్నాకనే ఏర్పాటు చేసుకుంటాం లెండి" అన్నాడు ఆయన లేస్తూ.

"మీ అభిమానానికి నా కృతజ్ఞతలు. కాని డాక్టరుగారు నన్ను ఎప్పటికీ మృదంగం వాయించవద్దన్నారు. వాయిస్తే ఆ అదురుకు ప్రాణంకూడా పోవచ్చు అన్నాడు. అందుకని...."

ఆ మాటలు విని ఆశ్చర్యపోయింది ఆ వచ్చిన ఆయనే కాదు సీతమ్మ ఆదెయ్య కూడా ఆశ్చర్యపోయారు.

కాబోలని ఆయ ననుకున్నా, కాకమ్మ కథ అనుకున్నారు సీతమ్మ, ఆదెయ్య. ఆయన వెళ్ళిపోగానే ఆదెయ్య నిలదీసి అడిగాడు నీకు జబ్బేమిటని?

"ఆ ఇంగిలీసు పేర్లు మనకు చెప్పినా ఏం తెలుస్తాయి తాతా? వాయించ వద్దన్నాడు. అంతే" అన్నాడు తేలిగ్గా.

తాత నమ్మలేదు. "ఎవరా డాక్టరు. పదరా నేనే అడుగుతా నీ జబ్బేమిటో. నీకేదో దయ్యంపట్టి ఉంటుంది. లేకుంటే నిన్నూ, నీ పేరూ చూసి ఓర్చలేక చేతబడి చేసిఉంటారు. లేకుంటే మద్దెల్లో నీ పానాలుంటం ఏంటంట" అన్నాడు. ఆదెయ్య గుండెలు ఒకపక్క బద్దలౌతూనే అనుమానాలకు దారితీస్తోంది. కాని శ్రీనివాసులు తిండిలోగాని, ఆరోగ్యంలోగాని ఏ జబ్బూ కనిపించలేదు సీతమ్మకి. కాని రాత్రులు సరిగా నిద్రపోని శ్రీనివాసుల్ని చూస్తే అనుమానంగా అనిపించేది శ్రీనివాసులికి మూలనున్న మృదంగాలు రమ్మని పిలుస్తున్నట్లుగా తన ముందరికి దొల్లుకొస్తున్నట్లుగా అనిపిస్తోంది. వాటిని చూసినప్పుడల్లా చేతులు అల్లల్లాడి పోతున్నాయి. శరీరంలో ఏ బాధా లేకపోయినా ఈ బాధ భరించలేకపోతున్నాడు శ్రీనివాసులు ఎందరొచ్చినా అదే సమాధానం చెప్పి పంపిస్తుంటే.

'పోనీలే! ఆ మాయదారి మద్దెల వాయించకపోతే పీడాపాయిరి. అడు సుకంగా ఉంటే అంతే చాలనుకుంది, సీతమ్మ. ఒక రకంగా సంతోషించింది కూడా ఇక నుంచీ శ్రీనివాసులు తన కళ్ళ ఎదుటే ఎక్కడికీ వెళ్ళకుండా ఉంటాడని. కాని శ్రీనివాసులు ఒక సమస్యగా మారాడు వారం తిరిగేసరికి.

తిండి తినడు. ఒకరితో మాట్లాడడు. ఆడిపోతున్న చేతుల్ని చంకలో పెట్టి కట్టేసుకుని నవనాడులూ బిగించుకుని గురువుగారి బొమ్మల్నే చూస్తూ కూచుంటాడు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ తనలో తనే నవ్వుకుంటాడు.

రాత్రి అయేసరికి మాత్రం గురువుగారి ఇంటి కెడతాడు. కాని లోపలికి వెళ్ళడు. అక్కడ కాస్సేపు గోడవారగా కిటికీ పక్కగా కూచుంటాడు. మాధవయ్యగారు సాధన చేస్తుంటే విని తెల్లారేసరికి ఇంటి చేరతాడు. గడ్డాలు మీసాలు పెరిగి గుర్తుపట్టలేకుండా అయాడు శ్రీనివాసులు.

శ్రీనివాసుల్ని చూస్తుంటే ఆదెయ్యకు దుఃఖం పొల్లుకొస్తోంది. బెంగగా అనిపిస్తోంది. కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు ఆదెయ్యతాత. శ్రీనివాసులుకి నిజంగా ఏదో అయిందన్న నమ్మకం కలుగుతోంది. కాని వైద్యుడు దగ్గిరకు రానంటాడు, ఏ తాయిత్తైనా కట్టిద్దామనుకుంటే ఇష్టపడడు. భూత వైద్యులను పిలిపిస్తే వారికేదేదో చెప్పి పంపేశాడు. తాత జబ్బుమనిషిలా అయ్యాడు.

"ఒరే! శీనూ! తాతకు జ్వరమొచ్చింది మందు తీసుకురారా!" అంది ఓనాడు సీతమ్మ. శ్రీనివాసులు డాక్టర్ని పిలుచుకుని వచ్చాడు. ఏవేవో మందులు మాకులు రాసి ఇచ్చాడు. కాని తాతది శ్రీనివాసుల్లా దొంగ జబ్బు కాదు. వయోభారం, మనోభారం, రోగభారం మూడు కలిసి తాతని కుంగతీసి కాన్సర్ వ్యాధిగా బయటపడ్డాయి.

తాత వ్యాధి బయటపడ్డట్టే శ్రీనివాసులు రోగ విషయం కూడా ఆనోట ఆనోట బయటపడి శ్రీవాణి చిట్టిబాబుగారి చెవుల పడింది. ఎప్పుడూ శ్రీనివాసులే శ్రీవాణి ఇంటికెళ్ళేవాడు. కాని ఇప్పుడు శ్రీవాణే వచ్చింది శ్రీనివాసుల్ని చూడటానికి. ఆమెను చూడగానే శ్రీనివాసులు ఆమె ముఖం చూడలేక తన ముఖం చాటుపెట్టుకున్నాడు. అతని ఈ వింత ప్రవర్తనకు పరివర్తనకు శ్రీవాణి ఆశ్చర్యపోయింది.

ఇతను ఆ శ్రీనివాసులేనా? లేక తెలుగు సినిమాల్లో లాగా మనిషిన బోలిన మనిషి ఉండి, మహా విద్వాంసుడైన నా శ్రీనివాసుడ్ని ఏదైనా చేసి నకిలీ శ్రీనివాసుడు ఇక్కడ చేరాడా? వీడికి మృదంగ వాయిద్యంరాక ఇలా వేషం వేస్తున్నాడా? ఇందులో ఏదో మోసం ఉంది. ఇతను ముమ్మాటికీ నా శ్రీనివాసుడు కాదు. నా ఏకలవ్యుడు దొంగ కాదు. నవమృదంగ విన్యాసకేళీ విలాసుడు!"

శ్రీనివాసుని విముఖత చూస్తుంటే శ్రీవాణికి దుఃఖం పొంగుకొచ్చింది.

నా శ్రీనివాసుడు నన్ను చూచి చూడనట్లు నటించలేడు. నా కనుసన్నలు దాటిపోయి తనను తాను బంధించుకోలేడు. నా పాట చెవులకుసోకితే, ఎక్కడున్నా రెక్కలు కట్టుకుని వస్తాడు. నా శ్రీనివాసులు కోసం వాడవాడలా ఊరూరా గొంతెత్తి పాడతా. నా శ్రీనివాసుల్ని మళ్ళీ నేనే తెచ్చుకుంటా అనుకుంది. శ్రీనివాసుల్ని గురించి సీతమ్మ చెప్పినదంతా వింది. సీతమ్మకు ధైర్యం చెప్పి తాతను పరామర్శించి వెళ్ళిపోయింది శ్రీవాణి.

కూర్చుని తింటే కొండలైనా కరిగిపోతాయి. అందులోనూ డాక్టర్లు మందు కంటే పచ్చే తినిపిస్తున్నారు. ముట్టుకుంటే డబ్బు. పట్టుకుంటే డబ్బు. చూస్తే జబ్బు. వొదిలించుకోవాలంటే డబ్బు.

అందులో తాతకొచ్చిన జబ్బు సామాన్యమైనది కాదు. మందులిచ్చినా బ్రతికించేదీ కాదు. కాని ప్రాణమున్న మనిషిని చంపడం అందరివల్లా కాదుగా. తాత దాచుకున్నదీ, సీతమ్మ సంపాదిస్తున్నదీ అంతా తాత మందులకే ఖర్చౌతోంది కాని శ్రీనివాసులుగానీ సీతమ్మగానీ అందుకు బాధపడలేదు. శ్రీనివాసుల వాచి, గొలుసు అన్నీ మరో చేతిలోకి వెళ్ళినా, మృదంగాలు మాత్రం అమ్మలేక పోతున్నాడు శ్రీనివాసులు. సీతమ్మకి అవి ఇంట్లో ఉండటం అనవసరమనిపిస్తోంది. వాటిని అమ్మితే కాస్తో కూస్తో డబ్బొచ్చి వేడినీళ్ళకు చన్నీళ్లై తాతకు ఇంకా మంచి వైద్యం చేయించి బ్రతికించుకోవా లనిపించింది. కాని నోరు తెరిచి వాటిని అమ్మమనే ధైర్యంలేదు సీతమ్మకు. శ్రీనివాసులుకు కనీసం వాటిని కళ్ళతో చూసుకుంటూ కలలో వాయించుకోవాలనే కాంక్ష చావటంలేదు. అందుకే వాటిని అమ్మటంలేదు.

ఇల్లు గడవటం కష్టంగా ఉంది. ఏదైనా పనిచేసి నాలుగురాళ్ళు సంపాదించా లనిపించింది శ్రీనివాసులికి. కాని తనకేం పని వచ్చు? ఇంతకాలం తినడం వాయించడం తప్ప తాత మరే పనీ చెయ్యనివ్వలేదు. ఇప్పుడు ఏది చెయ్యాలన్నా చేతకావటంలేదు. రెండు మూడు రోజులు బైటికెళ్ళి ఏ పనీ చెయ్యలేక ఉత్త చేతుల్తో తిరిగివచ్చాడు. బాధపడ్డాడు. తాత కివేమీ తెలియనివ్వలేదు. ఓ రోజు పొద్దున్నే సీతమ్మ, శ్రీనివాసులు దగ్గిరకొచ్చి "ఒరే సీనూ! ఉత్తగా కూసుంటే పిచ్చి పిచ్చి అలోసెన్లతో పిచెక్కుతుందిరా! మాయదారి మద్దెల. మంతరం వేసినట్టు మాయమైపోయింది. ఆ మద్దెల లేకుంటే మరోటి. ఏదో రకంగా సంపాదించుకోవాలి. కడుపు మాడ్చుకుని సత్తారా ఏంట్రా. ఏదో ఓ పని సెయ్యటం నేర్చుకోవాలిగానీ" సీతమ్మ మెత్తగా కొట్టివేసింది శ్రీనివాసుల్ని.

తల్లి అన్న మాటలో తప్పు కనిపించలేదు శ్రీనివాసులికి. కాని.... తనేం పని చెయ్యాలి? తన కొచ్చింది ఆ మృదంగం వాయించడం ఒక్కటే. ఆ ఒక్క పనీ గురువుకు అర్పితమైపోయింది. పోనీ కులవృత్తి చేసుకుందామంటే అది చిన్నతనంలోనే తనకు దూరమైపోయింది. ఏదో ఒక పనిచేసి తల్లిని పోషించటం తన ధర్మం. ఈ శరీరం ఆ తల్లిది. ఆ తల్లికే అంకితం కావాలి. అనుకున్నాడు.

ఏ పని దొరికితే ఆ పని చెయ్యాలనుకున్నాడు. అలాగే చెయ్యటం ప్రారంభించాడు. కొద్ది రోజులు కష్టమే అయింది ఆ కూలి పన్లు చెయ్యటానికి. కాని తనకొచ్చిన విద్యకు అంతకంటే గొప్ప ఉద్యోగం రాదని తెలుసు శ్రీనివాసులికి.



రాళ్ళు మోసి, మట్టి మోసి, బస్తాలు మోసి కూటికి సరిపోయేది సంపాదిస్తూ ఆ పన్లకి అలవాటుపడ్డాడు కాలక్రమాన శ్రీనివాసులు.

ఇప్పుడు శ్రీనివాసుల వాల్ పోష్టర్లు అంటించే చోటులో మళ్ళీ మాధవయ్యగారి బొమ్మలు అంటిస్తున్నారు. మళ్ళీ రేడియోలో ఆయన పేరు, వాద్యం వినిపిస్తుంటే శ్రీనివాసులు పరమానందంతో వింటూ పేద తీర్చుకుంటున్నాడు పాకల్లో కూర్చుని. టి. వి. లు అమ్మే దుకాణాల దగ్గర ఆగుతాడు సాయంత్రం ఇంటికి వస్తూ. దుకాణాల్లో వ్యాపారం కోసం టి.వి.లు పెడతారు. మాధవయ్యగారి ప్రోగ్రాములు తరచు కనిపిస్తుంటే సంతోషంతో చేతులెత్తి దణ్ణం పెడతాడు

గురువుగారు ఎదురుగా ఉన్నట్లే భావిస్తూ, భక్తి భావంతో ఉంటాడు. గురువుగారి ఇంటికి వెళ్ళాలనిపిస్తుంది.

కానీ అక్కడికి వెళ్ళి ఏం ప్రయోజనం? ఏం నేర్చుకోవాలి? అనుకుంటాడు.

శ్రీనివాసుల్ని చూస్తుంటే తాత అంతులేని బాధపడుతున్నాడు. శారీరక బాధకంటే మానసికవ్యధ ఎక్కువై పోతోంది తాతకు.

'నేను నాటినచెట్టు పెద్దదై అమృత ఫలాలిస్తుందనుకుంటే, గొడ్డుమోతుదేకాక పురుగట్టి పుచ్చి చచ్చిపోయిందేం భగవంతుడా!' అని విలపిస్తున్నాడు. జబ్బుతో పాటు ఈ బాధ రోజురోజుకీ ఎక్కువై క్రుంగతీస్తోంది తాతని.

'శ్రీనివాసులు కూలీ నాలీ చేసి కడుపు గడుపుకుంటుంటే నేను చూస్తూ బ్రతకడం కంటే ఎంత తొందరగా చచ్చిపోతే అంత బాగుండు.' అనుకుంటూ ఏడుస్తున్నాడు. కాని తాతకు అసలు విషయం తెలియదు. తెలిస్తే లేవలేని స్థితిలో కూడా పరిగెత్తుకెళ్ళి మాధవయ్యగారిని ఏంచేసిఉండేవాడో! తెలియదు కనకే సీతమ్మ దృష్టిలో అదెయ్య మనసులో మాధవయ్యగారు మహనీయుడుగానే మనుగడ సాగిస్తున్నాడు.

అతి కష్టంమీద కూలీ నాలీ చేసుకుంటూ బ్రతుకు వెళ్ళమారుస్తున్నా శ్రీనివాసులికి మాధవయ్యగారంటే భయం, భక్తి ఇసుమంత కూడా తగ్గలేదు. శ్రీనివాసులు మనిషో! దేముడో (రాతిబొమ్మ)! కానీ అసూయగానీ, అసహ్యంగానీ, కసిగానీ, కోపంగానీ లేదు. మాధవయ్యగారంటే ఇంకా భక్తి గౌరవం పెరిగింది. శ్రీనివాసుల్లో.

అప్పుడప్పుడు తను వాయించటానికీ అవకాశం లేదే! అని బాధ కలిగినా ప్రాణమిచ్చిన దేముడు ప్రాణం తీసుకుంటే ఆయన్ని తిడతామా? ఎందుకు ప్రాణం తీస్తున్నావని అడగగలమా? అది ఉచితంగా వచ్చింది. వచ్చిన దారినే పోయింది అనుకునేవాడు తెల్గా.

ఆయనడిగింది నా మృదంగం. కాని నా కళ్ళు కాదు. నా కాళ్ళు కాదు. నా హృదయం కాదు. అవన్నీ నా స్వాధీనంలోనే ఉన్నాయిగా అనుకున్నాడు తృప్తిగా. ఆయన్ని తలుచుకుంటూ, ఆయన బొమ్మల్ని చూస్తూ గురువుగారు నా దేవుడు అనుకుంటాడు.

ఎక్కడో శ్రీవాణి కంఠం వినిపించింది శ్రీనివాసులికి పార్కులో ఇటుకలు మోస్తుంటే.

"రారా మా యింటిదాకా! రఘువీర సుకుమార మ్రొక్కెద!" అంటూనే ఒక మాటు ప్రేమగా, ఒక మాటు లాలనగా, జాలిగా సంగతులేస్తూ నిజంగా ఆ రఘురాముడ్ని పిలుస్తున్నట్లనిపించినా, శ్రీనివాసులుకి తన్ను పిలుస్తోందా! అనిపించింది. శ్రీనివాసులు అటూ ఇటూ తల తిప్పి ఆమె కోసం చూశాడు. అది రేడియో లోంచి వినిపిస్తోంది. పరిగెట్టుకుని వెళ్ళి ఆమె సాన్నిధ్యంలో ఆమె పాట వింటూ కూచోవాలనిపించింది. దీర్ఘంగా నిట్టూర్చాడు. తన ఆలోచనలకు కళ్ళాలు వేశాడు.

కాని శ్రీవాణి మాత్రం శ్రీనివాసులు ఏదో ఒకరోజు తనకోసం వస్తాడనీ, వాయిస్తాడనీ ఎదురుతెన్నులు చూస్తోంది. ప్రతి ప్రోగ్రాంలోనూ ఆర్ద్రత నిండిన గొంతుకతో ఎలుగెత్తి పిలిచినట్లు పిలుస్తోంది. పాడుతోంది. శ్రీనివాసులు మనసు ఆమెను చూడాలనిపిస్తోంది. కాని విద్యాప్రేమికులైన వారు ఉత్తి డొల్లలాంటి తనని ఏమని ప్రేమిస్తారు? గౌరవిస్తారు? ఒకవేళ గౌరవించినా, నేను పాడుతా నువు మృదంగం వాయించమని అర్థిస్తే తను ఏమని చెప్పగలడు. అప్పుడు ఏం చేయగలడు? అక్కడి నుంచి పారిపోవాలా? నిజం చెప్పగలడా? అలాంటి స్థితిలో ఉన్న తను నలుగురిలోకీ తగుదునమ్మా అని వెళ్ళకుండా ఉండటమే మేలు. పాండవులంతటి మహారాజులు, మేధావులు, విద్యావంతులే అజ్ఞాతంగా తమ గొప్పతనాన్ని మప్పిపెట్టి సామాన్యులుగా పనులు చేసుకుని బ్రతికారుట. ఇక నేనెంత! నా బ్రతుకెంత? అని దూరాలోచన చేసి చినబాబుగారి ఇంటి కెళ్ళే కోరిక చంపుకున్నాడు శ్రీనివాసులు.

మనిషి విధి చేతిలో కీలుబొమ్మ. ఆ విధి ఆడించినట్లు ఆడాలి. పాడాలి. ఏడవాలి. నవ్వాలి. అంతకు మించి ఆ బొమ్మకు స్వతంత్రం లేదు. తాను ఎంతో ఘనుడనుకుని విర్రవీగినా తనకు తాను ఏమీ చేయలేడు దైవ ప్రేరితం లేకుండా. వైరాగ్యం కూడా అబ్బింది శ్రీనివాసులికి.

ఆ రోజు ఎంత తిరిగినా కూలీపని దొరకలేదు శ్రీనివాసులికి మధ్యాహ్నం దాకా. విచారంగా తిరిగి ఇంటికొస్తుంటే "ఏ అబ్బాయ్! ఇక్కడెవరన్నా కూలి వాళ్ళు దొరుకుతారా?" అని అడిగా డొకాయన. శ్రీనివాసులు తలెత్తి చూశాడు. రామకోటిగారు. కాని ఆయన శ్రీనివాసుల్ని గుర్తుపట్టలేదు. కారణం మాసి పోయిన చొక్కా, పైజమాకి బదులు ఎగ్గట్టిన పంచ, మాసిన గడ్డం, తలపైన తలపాగా ఉండటం మూలంగా ముఖ కవళికలు తెలియటంలేదు.

"ఏం పని చెయ్యాలి బాబూ!" అన్నాడు తలొంచుకుని.

"పెద్ద పనేం లేదురా! ఎరువు ఎర్రమన్ను తీసుకెళ్ళి చెట్లలో గొప్పులుతీసి కుదుళ్ళుతీసి పొయ్యాలి" అన్నారు రామకోటిగారు, అది చాలా తేలికపనైనట్లుగా.

"పదండి" అన్నాడు శ్రీనివాసులు.

రామకోటిగారు ఆశ్చర్యపోతూ అనుకున్నారు. 'కలికాలంలో చలికాలం శివరాత్రిలో సంకురాత్రి అన్నట్లు ఈ పాలివాడు జీతమెంత ఇస్తారని అడక్కుండానే వస్తున్నాడు. వీడికి జీతం ఎంతో తెలుసుకునే అవసరం లేదా? లేక నేను న్యాయంగా ఇస్తానని నా ముఖంచూసి అనుకున్నాడా! అనుకున్నా అనుకోవచ్చు. నేనింతవరకు ఎవరికీ అన్యాయం చేయలేదు నా పేరుకు తప్ప. నాకా తీరికలేదు రామకోటి రాయటానికి. దానికి నే నేంచెయ్యను. కాని నాకే అన్యాయంచేశారు చాలామంది. నేను బ్రాహ్మణ్ణని తెలుసుకుని చదువుకోటానికి సీటియ్యలేదు. ఉద్యోగానికి సరే సరి అనుకున్నారు.

"ఇదే ఇల్లు. ఆ చెట్లన్నిటికీ గొప్పులు తవ్వు" అంటూ లోపలికివెళ్ళారు. ఆ యిల్లు, ఆ పరిసరాలు, ఆ చెట్లు, ఆ పూలు అన్నీ శ్రీనివాసులికి సుపరిచితాలే. అవి శ్రీవాణి ప్రేమతో పెంచుతున్న చెట్లు. వాటిని తనివితీరా తాకి తృప్తిపడి తలవంచుకుని పనిచేస్తున్నాడు. ఎండ నడినెత్తిన చుర్రుమంటోంది. కారుతున్న చెమటలు తుడుచుకుంటూ తవ్వుతున్నాడు శ్రీనివాసులు. అంతలో మలయ మారుతంలా రాగాలాపన వినిపించింది. శ్రీవాణి గొంతెత్తి రాగం ఆలాపిస్తుంటే శ్రీనివాసులు ఒళ్ళు పులకరించింది. తన ఒళ్ళు తనే మరిచి, పని విడిచి తన్మయత్వంతో వింటూ పరవసించిపోతున్నాడు. పరిసరాలను మరిచిపోతున్నాడు. ఒక్కమాటుగా, "నిను వినా నా మదెందు నిలువదే శ్రీరామచంద్ర" అంటూ శ్రీవాణి పల్లవి ప్రారంభించింది. శ్రీనివాసులు నోటితోనే మృదంగంలాగా వాయించటం ప్రారంభించాడు. పల్లవి కాగానే ముగింపు. అనుపల్లవికాగానే ముక్తాయింపు మోహర ముక్తాయి అన్నీ నోటితోనే పరవసించి వాయిస్తున్నాడు. మళ్ళీ పల్లవి ఎత్తుగడలో ఒక మాత్రకాలం తాళం తప్పింది ఆమె కెందుకో! శ్రీనివాసులు కోపంతో, "ఆపండి. లయజ్ఞానం లేనివారు సంగీతం పాట్టానికి పనికిరారు." అంటూ గట్టిగా తన ఉనికినికూడా మరచి ఉద్వేగంతో అరుస్తూ కళ్ళు తెరిచాడు. చినబాబుగారు, రామకోటిగారు, శ్రీవాణి శ్రీనివాసులు ముందు నుంచున్నారు. శ్రీవాణి కళ్ళనుంచి ధారాపాతంగా కన్నీరు కారిపోతోంది. ఆమె ముఖంలో సంతోషరేఖలు తొంగిచూస్తున్నాయి. ఆమె పెదిమలు కదిలిపోతున్నాయి.

"నను పాలింప నడచి వచ్చితివో నా ప్రాణనాథా" అని మోహనరాగం పలుకుతోంది ఆమె మానసవీణ. శ్రీనివాసులు చైతన్యరహితుడైనాడు.

శ్రీనివాసులు లేచి నుంచుని సిగ్గుతో తలదించుకుని వెళ్ళబోయాడు.

"శ్రీనివాసా! ఎక్కడికయ్యా నీ ప్రయాణం? నువు మమ్మల్ని మరచినా మేము నిన్ను మరువలేదయ్యా!" అన్నారు చిట్టిబాబుగారు శ్రీనివాసులు భుజం మీద చెయ్యివేస్తూ.

"నువు దాక్కున్నా నీ లయ దాక్కోలేదయ్యా" అన్నారు చిరునవ్వు నవ్వుతూ.

"బాబుగారూ! క్షమించండి. ఏదో ఒళ్ళుతెలియని స్థితిలో...."

"ఏనాడా లయతప్పితే క్షమించలేని మహామనీషివయ్యా నువ్వు. నిన్ను గురించి నీకు తెలియదు. తెలిసినా తెలియనట్లుండే నిగర్విివి. అది నీ సంస్కారం కాని నీకీ అజ్ఞాతవాసం ఏమిటయ్యా? ఏ దుర్విధి నీకు ఇచ్చిన శిక్ష ఇది? నిన్ను శిక్షించిన ఫలం ఆ పరమేశ్వరుడినైనాసరే ప్రతిఫలంగా బాధించి తీరుతుందయ్యా! రా నాయనా" అంటూ చిట్టిబాబుగారు శ్రీనివాసుల్ని పొదివిపట్టుకుని ఆప్యాయతగా లోపలికి తీసుకెళ్ళారు. ఇంట్లోకి అడుగుపెడుతుంటే,

"శ్రీనివాసా! చిద్విలాసా! నన్నేలుకోరా! రా రా!" అంటూ మృదుమధురమైన కంఠం వినిపించింది. అందరూ ఆ పలుకులు వచ్చినవేపు చూశారు. మళ్ళీ అవే పలుకులు.

"చూశావుటయ్యా! మా మైనాకూడా నీ నామస్మరణ చేస్తోంది!" అన్నారు రామకోటిగారు నవ్వుతూ. రామకోటిగారికి తెలుసు అవి ఎవరు నేర్పినవో!

"నీ పాదముఉంచ నేను శిలనైనా కాలేదే!" అంది మైనా మళ్ళీ.

"మన మైనా రాణీకి నీ మనసైనవన్నీ నేర్పించేస్తున్నావేంటమ్మా? అది మాటలేకాదు నీలా పాటలూ పాడేస్తోంది కొన్నాళ్ళుపోతే .. " అని,

"నీలా ఆ శ్రీనివాసుడ్నే ప్రేమించేస్తుంది" మనసులో అనుకున్నారు పైకి అనలేక. ధైర్యంలేక. కాని శ్రీవాణి చిన్నప్పటించీ రామకోటిగారికి ఆ కుటుంబంతో పరిచయం, చనువు ఉన్నాయి. శ్రీవాణి ఉత్తమ గుణాలు కలిగిన యువతి. ఆమె శ్రీనివాసుల్లోని సుగుణాలని ఆరాధిస్తోందని చిట్టిబాబుగారికంటే ముందే గ్రహించారు రామకోటిగారు. శ్రీనివాసులు వద్దంటున్నా స్నానంచేయించి కొత్త బట్టలు కట్టబెట్టి భోజనంపెట్టి మొహమాటపెట్టేశారు చినబాబుగారు. కాని శ్రీనివాసులు పన్నెత్తి ఏమీ మాట్లాడలేదు. ఏ ప్రశ్నకీ సమాధానం చెప్పలేదు.

"నేను వెళ్ళొస్తా!" అంటూ లేచాడు ఎక్కువసేపు అక్కడ ఉండలేక.

"మరి నీ కూలీ తీసుకెళ్ళవా?" కొంటెగా అడిగారు రామకోటిగారు. శ్రీవాణి ఆ మాటకు చురుగ్గా ఆయనవంక చూసింది. శ్రీనివాసులు బాధపడతాడని ఆమె భయపడింది. కాని,

"పని చెయ్యకుండా కూలితీసుకోను." అన్నాడు శ్రీనివాసులు.

"మరి చేసినదానికి?"

"ఇస్తే తీసుకువెడతాను!" అన్నాడు శ్రీనివాసులు తలవంచుకుని.

"అయితే కడంపని రేపువచ్చిచేసి తీసుకెళ్ళండి శ్రీనివాసుగారూ!" అంటూ రామకోటిగారు కంట తడిపెట్టుకుంటూ, శ్రీనివాసులు రెండుచేతులు పట్టుకుని కళ్ళ కద్దుకున్నారు. ఆ చర్యకు శ్రీనివాసులు, చినబాబుగారు, శ్రీవాణి అందరూ చలించిపోయారు.

"శ్రీనివాసులుగారూ! కొనగోలు శబ్దంతో అద్భుతంగా మృదంగనాదాన్ని సృష్టించిన ఘనులు మీరు. మృదంగం వాయిస్తే మృత్యువు కౌగిలిస్తుందని అన్నాడేగానీ డాక్టరు, కొనగోలు శబ్దం వాయించరాదని అనలేదనుకుంటాను. మీరు రేపట్నుంచీ మృదంగానికి బదులు కొనగోలు పాటనే కచేరీల్లో వాయించండి. మా కందరికీ ఆనందాన్ని చేకూర్చండి. మా మాట కాదనకండి." అంటూ ప్రార్థించారు రామకోటిగారు. కన్నీళ్ళతో అతని కాళ్ళకుబదులు చేతులు కడిగారు. "అవున్నాయనా! లయ అజ్ఞాతమైంది కాదు. ప్రపంచంలో అణువణువులోను లయ మిళితమైంది. వీచే గాలిలో, ప్రవహించే నదిలో, పశుపక్షి కీటకాదులలో, మనిషి మాటలో, నడకలో, చివరికి ఊపిరి పీల్చడంలో, గుండెకూడా లయబద్ధంగానే కొట్టుకోవాలి. కొట్టుకుంటుంది. ఏ మాత్రం లయతప్పినా మనం సహించలేము. అలాగే జీవితం లయబద్ధంగా నడవకపోతే పట్టాలు తప్పిన బండిలా పడిపోతుంది. సర్వనాశనమై పోతుంది.

"నీది లయతప్పిన జీవితంకాదు నాయనా! లయబద్ధమైన జీవితం. నీలో కళని నువ్వెంత అజ్ఞాతంగా అణచిపెట్టానికి ప్రయత్నించినా, ఆ ఉప్పొంగే తరంగ లయ నిన్ను ఆగనివ్వదు. ఆగకూడదుకూడా. మా అందరి కోరిక రామకోటిగారు చెప్పిందే. కాదనవు కదూ!" అంటూ చిట్టిబాబుగారుకూడా ప్రాధేయపడుతుంటే, అవునని అనమంటున్నట్లుగా జాలిగా చూసింది శ్రీవాణి. ఆమె మాట కాదనేశక్తి శ్రీనివాసులికి లేదు. సరే అన్నట్లుగా తలూపాడు.

"ఇదండి పళ్ళు. మీ తాతగారికి నే నిచ్చానని చెప్పండి" అంటూ ఒక బుట్టలో పళ్ళు తెచ్చి కారులో పెట్టింది శ్రీవాణి.

"డ్రైవర్! అయ్యగారిని ఇంటిదగ్గిర దింపిరా." అన్నారు చిట్టిబాబుగారు.

"శ్రీనివాసా! చిద్విలాసా! నన్నేలుకోరా! రారా!" మైనా మాటిమాటికీ అదేమాట అంటోంది. అందరికీ నవ్వొచ్చింది.

"చూడవయ్యా మా పలుకుల మొలక మైనావతి కూడా నిన్నెలా ఆహ్వానిస్తోందో!" అన్నారు నవ్వుతూ చినబాబుగారు.

శ్రీనివాసులు చిరునవ్వు చిందిస్తూ తల దించుకున్నాడు.

## 10

పక్షుల కిలకిలా రావంతోటే ఆ రోజు కళకళలాడిపోతోంది వేణుగోపాలుడి గుడి. ఆ రోజు కృష్ణాష్టమి. శ్రీవేణుగోపాలస్వామివారి గుడి శోభాయమానంగా అలంకరించారు. ప్రతి కృష్ణాష్టమికీ ఆ గుళ్ళో శ్రీకృష్ణ ఆరాధ్య ఉత్సవాలు అద్భుతంగా చేస్తారు. పూజలు పునస్కారాలేకాక, స్త్రీల కొరకు రంగోలీ, పిల్లల కొరకు ఉట్లు కడతారు. పెద్దలకు అందరికీ ఆనందం కోసం నాటకాలు, నృత్యాలు, గానకచేరీలు జరుగుతాయి.

మాధవయ్యగారు ప్రతి సంవత్సరం ఒక ప్రోగ్రాం వేణుగోపాలుడి కోసం ఉచితంగా వాయిస్తారు. కారణాలు రెండు, ఒకటి ఆరోజు ఆయన పుట్టినరోజు. రెండు ఊరివారి ఆనందంకోసం. సుప్రభాతం ముగియకుండానే పొద్దుటే లేచి స్నానం సంధ్యా ముగించుకుని గుడికి వచ్చారు శిష్యుడితోకలసి మాధవయ్యగారు. ఆరోజు శ్రీకృష్ణుడికి పాలాభిషేకం చేయించడం అలవాటు. నాదబ్రహ్మం పాల బిందె నెత్తిన పెట్టుకుని నడుస్తుంటే పూలబుట్ట స్వయంగా పట్టుకుని మాధవయ్య గారు గుడికొచ్చారు. రంగురంగుల ఆవులు తువ్వాయిలూ అప్పటికే గుడిముందు చేరి "రారా గోపాలకృష్ణా" అని పిలిచినట్లుగా, ఆ గోపాలుడు మోహనమురళి ఊత్తూ ఎటునుంచి వస్తున్నాడో అని మోరలెత్తుకుని చెవులు నిక్కించి తలలు అటూ ఇటూ తిప్పి చూస్తున్నాయి. ఆ దృశ్యం ఎంతో ముచ్చటగా ఉంది చూచేవారికి.

ప్రతిరోజూ ఆలస్యంగా లేచినా ఆరోజు పిల్లలు పొద్దుటే స్నానం ముగించుకుని గుడి కొచ్చారు, అలనాడు గోపబాలురు కృష్ణమూర్తి కోసం వచ్చినట్లు. వారివెంట తల్లులు యశోదలై తమ బిడ్డలు కృష్ణులైనట్లు ఊహించుకుంటూ మమతలు కురిపిస్తూ వస్తున్నారు.

కన్నెపిల్లలు గోపికలై ఏ పొన్నచెట్టుమీద, పొదల మాటున ఆ కృష్ణుడు తమకోసం దాగున్నాడేమోనని ఓరచూపులు చూసుకుంటూ, కళ్ళతోనే వెదుకుతూ ఒయ్యారాలు వొలకపోస్తూ వస్తుంటే, ప్రతి పురుషుడూ తాను నందుడైనట్లు, నందగోపకిషోరుడ్ని చూడాలని వస్తున్నారు. ఆ గుడిలో దివ్యమోహనరూపంతో రాతి గుడిలో బంధింపబడిన ఆ కృష్ణుడు పారిపోలేక, వచ్చినవారందరికీ దర్శనమిస్తున్నాడు.

శ్రీవాణి కూడా రాధలాగా అలంకరించుకుని పూజాద్రవ్యాలతో ఆ మురళీ కృష్ణుని పూజించుకుని తరింపాలని అందరిలాగే తనూ వచ్చింది.

మాధవయ్యగారు ప్రదక్షిణం చేస్తున్నారు. నాదబ్రహ్మం చకచకా ప్రదక్షిణం ముగించుకుని మాధవయ్యగారికోసం ఎదురుచూస్తూ మండపంలో కూర్చున్నాడు వచ్చేపోయేవారిని చూస్తూ.

"నాదబ్రహ్మంగారా! నమస్కారం. కులాసానా?" అంటూ ఎవరో పలకరించారు.

"ఆహా! కులాసా కనకే కనిపించాం. అన్నట్లు మీరు క్షేమమేనా?" ఆ పలకరించిన మనిషి ఎవరో తెలియకపోయినా అడిగి నవ్వేశాడు నాదబ్రహ్మం.

"ఆహా! క్షేమమే. అన్నట్లు మాధవయ్యగారు నిరుడు రాలేదేం?"

"ఊఁ ఏడు వచ్చారుగా! అరుగో ప్రదక్షిణ చేస్తున్నారు," అంటూ చూపించాడు. మాధవయ్యగారు మెల్లగా ఏదో చదువుకుంటూ ప్రదక్షిణ చేస్తున్నారు.

"అన్నట్లు ఇవాళ పాలు, పూలు తెచ్చారు అభిషేకం చేయిస్తున్నారా? ఏమిటీ విశేషం?" నాదబ్రహ్మం పక్కనున్న వెండిబిందెలో పాలు పక్కనేఉన్న పూలబుట్టా చూస్తూ అడిగాడాయన.

"అదా! మాధవయ్యగారు అందర్లా ఒకసారి పుట్టరు. ఒకసారి...." త్రేణుపు వచ్చి మాట మింగుడుపడింది.

"మాటిమాటికీ పుడుతూంటారు. మొన్నీ మధ్యే పుట్టారు. అప్పుడు పాలాభిషేకం చేయిస్తానని మొక్కుకున్నారు. అదుగో ప్రదక్షిణ ముగిసినట్లుంది." అంటూ బుట్ట, బిందె పుచ్చుకుని పరిగెత్తాడు నాదబ్రహ్మం.

అందరి కళ్ళూ ఆ వేణుగోపాలుడి మీద ఉంటే మాధవయ్యగారి కళ్ళు మాత్రం ఎదురుగా నుంచున్న శ్రీవాణీమీదే నిలిచాయి.

శ్రీవాణిని ఇదివరలో చూసినా ఇవాళ మాధవయ్యగారి మనసు, దృష్టి వేరుతీరులో పయనిస్తోంది. పాత జ్ఞాపకాలని వెలికితీస్తోంది. అదే రంగు చీర,

అదే వయసు, పాతిక సంవత్సరాల క్రింద భార్యతో కలసి మొట్టమొదటిసారిగా ఈ గుడికి వచ్చారు. అప్పుడు శ్రీరంజని అమ్మ శ్రీవాణిలాగే ఉండేది. రూపం, రంగు, ఎత్తు, మాట, పాట, అన్నీ శ్రీరంజిని ప్రతిరూపం లాగా కనిపిస్తోంది శ్రీవాణి. తన హృదయరాణి. శ్రీరంజని కన్నబిడ్డ బ్రతికుంటే ఇలాగే ఉండే దనిపించింది ఓమాటు. కాని మరుక్షణంలో శ్రీరంజనే శ్రీవాణి అనిపించింది. వయసుడిగినా వయసొచ్చినట్లు అయింది. శ్రీవాణి తన భార్యలా తన పక్కన ఉంటే బాగుండునన్న కోరిక పుట్టింది. కోరికలు తీరక మళ్ళీ జన్మ ఎత్తిందేమో శ్రీరంజని" అనిపించి పిచ్చెక్కించేస్తోంది. ఆయన వెర్రితలల ఆలోచనలు ఆయన మతిపోగొట్టి పరిసరాల్ని గుర్తుపట్టనియ్యటం లేదు.

జనం అంతా వెళ్ళిపోతున్నా మాధవయ్యగారు ఆలోచనలతోనే సతమతమౌతూ ఎదురుగా ఉన్న దీపసుందరి శిల్పాన్ని "శ్రీవాణి శ్రీరంజని" అంటూ కౌగలించు కున్నారు.

మాధవయ్యగారికి పైత్యం ప్రకోపించిందనుకుని నాదబ్రహ్మం మెల్లగా ఇల్లు చేర్చాడు. కాని ఆయన ఆలోచనలన్నీ శ్రీవాణి చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి. ఆరోజు మొదలు పని ఉన్నా లేకున్నా కల్పించుకుని చిట్టిబాబుగారి ఇంటికి వెళ్ళడం ప్రారంభించారు. కాని శ్రీవాణి ఆయనకు ఒక్కసారీ కనిపించలేదు.

"అబ్బాయి ! ఇవాళ పెళ్ళికొడుకులా ముస్తాబౌతున్నాడు ఏమిటమ్మా ఇసేసం?" అన్నాడు తాత నోట్లో జావపోస్తున్న సీతమ్మతో. రెండు మూడు నెలలుగా శ్రీనివాసుల్లో ఉత్సాహంగానీ, నవ్వుగానీ ఎవరూ చూడలేదు. రెండురోజుల్నించీ ఇంట్లో మళ్ళీ కొనగోలు శబ్దాలు వినిపిస్తున్నాయి. నవ్వు అతని ముఖానికి అందం తెచ్చింది. గడ్డం గీసుకుని తలదువ్వుకుని నవయువకుడిలాగా వచ్చాడు శ్రీనివాసులు. 'నిజంగా పెళ్ళి కళ వచ్చింది' అనుకుంది. మళ్ళీ నిట్టూర్చి 'మద్దెల వాయిస్తేనే ప్రాణం పోద్దని డాక్టరు చెప్పినాడు. మరి పెళ్ళిచేస్తే ఏమై పోతాడో ! పెళ్ళి చేసుకోకపోతే పీడబాయిరి. వాడు సల్లగుంటే నాకదే పదివేలు. ఇనాల్లకి ఆడికి మళ్ళీ పెపంచంలోకి ఎల్లాలనిపించింది అదే చాలు' అనుకుంది సీతమ్మ. "తాతా ఇవాళ శ్రీ వాణిగారి పాట, మా గురువుగారి మృదంగం. ఇవాళ నా కొనుగోలు పాట మొట్టమొదటిసారిగా గురువుగారి సరసన కచేరీలో వాయిస్తున్నా. నన్ను దీవించు" అంటూ తాత కాళ్ళకి దణ్ణంపెట్టాడు. తాత లేవలేకపోయినా కళ్ళతోనే దీవించాడు. కాని శ్రీనివాసులు అవతలకి వెళ్ళగానే తాతకి పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది.

"పిచ్చోడు నన్ను దీవించమంటే ఎర్రాడిలా ఎర్రి సంతోసంతో దీవించానే గానీ అడ్ని మొట్టమొదట దీవించినోడ్ని నేనే. నా దీవన ఫలితం ఏఁవైందంట? అడు మద్దెల వాయిస్తేనే పానంపోద్దని చెప్పారు. మరి ఇప్పుడు మళ్ళీ దీవించా దీని ఫలితం ఏమోతుందో! బగవంతుడా! నా సీనివాసుల్ని సల్లగా కాపాడు తండ్రీ! నా ఆయువు పోసి అడ్ని బతికించు సామీ! అడు ఎర్రోడు. ఉత్త పిచ్చోడు. మాయా మరమం తెలీనోడు సామి అడు! అడు ఓర్నీ సెయిసాసి యాసించడు, నోరు తెరిచి బిచ్చమడగడు. ఆడికి తెలిసింది పిచ్చిపేమ ఒకటే. ఆ పేమే వాడ్ని నా దగ్గరకు చేర్చింది. నేను ఆడికి దూరంగా ఎల్లిపోవాలగానీ, నాకు అడ్ని దూరం సెయ్యకు సామీ! ఆడి సేతులో నా పానాలు నిలిసిపోవాల. అదొక్కటే సామీ నేను నిన్ను కోరేది." అనుకున్నాడు తాత.

రాత్రి పదిగంటల వేళ శ్రీనివాసులు వచ్చాడు. రాగానే తాత పక్కనే కూర్చున్నాడు.

"కచేరీ బాగా జరిగిందా?" అని అడిగాడు తాత, మనవడిని కళ్ళనిండా చూసుకుంటూ.

"బాగానే జరిగిందా తాతా!" అన్నాడు. కాని ఉత్సాంగాలేదు ఆ మాట.

"నిన్నంతా మెచ్చుకున్నారా?" తన మనవడ్ని అందరూ మెచ్చుకోవాలనీ, ఆ మాట తను వినాలనీ ఆ ముసలి ప్రాణం ఆరాటపడిపోయింది.

"ఆ! నన్ను మెచ్చుకుంటే ఏం ప్రయోజనం! ఏం సంతోషం! గురువు గార్ని తిట్టారు." అన్నాడు బాధగా.

"ఎందుకు తిట్టార్రా? ఈ పాలు తాత నోట్లో పొయ్యి" అంటూ పాలగ్లాసు చేతికిస్తూ అడిగింది సీతమ్మ.

"ఆయన లయ తప్పింది" అన్నాడు బాధగా, తాత నోట్లో పాలుపోస్తూ.

"అలాగా! లయ తప్పినోడి చెయి నరికిపారేయాలని ఆయనే చెప్పారని చెప్పావు కదంట్రా. ఆయనే తప్పాడు. తల తీసినంత పనిచేశారు. ఊరుకుంటా రేంటి?" అంది సీతమ్మ. ఆమె యాథాలాపంగా అన్నా శ్రీనివాసులు సహించ లేకపోయాడు. "అమ్మా!" అంటూ పెద్దగా అరిచాడు. ముక్కు శోణలు ఎగరేస్తూన్న శ్రీనివాసుల్ని చూడగానే తన తప్పు గ్రహించుకుంది సీతమ్మ. వెంటనే—

"తప్పైందిలేరా శీనూ! ఏదో అనబోయి ఏదో అన్నాగానీ, ఆయనంటే నాకు కోపమా కసా...." అంది ప్రాధేయపడుతున్నట్లుగా. తల్లి అలా అనగానే శ్రీనివాసులు కాస్త శాంతించి, తల్లిని తను అపార్థం చేసుకున్నానని బాధపడ్డాడు.

"తాత తరువాత దేముడు గురువుగారే నమ్మా. వాళ్ళని ఎవరేమన్నా సహించ లేను." అన్నాడు క్షమార్పణ కోరుకున్నట్లుగా. ఆ మాట విని తాత పొంగి పోయాడు. ఆ ఆనందంలో శ్రీనివాసుల్ని తనివితీరా చూసుకున్నాడు. అంతలో దగ్గుతెర వచ్చింది. కొరపోయింది. అంతే తాత మరి బాధపడలేదు. సీతమ్మ ఒక చేతిలోను శ్రీనివాసుల్ని ఒక చేత్తోనూ గట్టిగా పట్టుకుని జీవితరంగంనుంచి ఆనందంగా, సంతృప్తిగా నిష్క్రమించాడు.

## 11

తాత లేకపోవడం శ్రీనివాసులుకు గొడ్డలిపెట్టుగా అయింది. ఎటుచూసినా తాత రూపమే కనిపిస్తోంది. ఎవరు పిలిచినా తాత పిలిచినట్లే వినిపిస్తోంది. తాత డుకునే చోటు చూస్తుంటే దుఃఖం పెల్లుబికి వస్తోంది. ఆ కారణంగా ఎక్కువ సమయం ఇంట్లో ఉండలేకపోతున్నాడు శ్రీనివాసులు. తాత జ్ఞాపకాల నుంచి దూరంగా పారిపోవాలని ప్రయత్నిస్తున్నాడు.

శ్రీనివాసులు బాధ చినబాబుగారు, శ్రీవాణి అర్థంచేసుకున్నారు. ఇప్పుడతనికి కావలసింది సానుభూతి కాదు. తాతని మరిపించే పరిస్థితులు. పరిసరాలు. అందుకే ఎక్కువ కాలం శ్రీవాణి తను పాట పాడుతూ శ్రీనివాసుల్ని వాయించమని ప్రాధేయపడుతోంది. అలా శ్రీనివాసులు కొంతసేపైనా తాత విషయం మరిచిపో గలుగుతున్నాడు. శ్రీవాణి సాన్నిధ్యంలో తన బాధని మరిచిపోతున్నాడు.

సీతమ్మకూడా శ్రీనివాసులు బాధ అర్థంచేసుకుంది. ఏ వేళకు ఇంటికొచ్చినా, ఎప్పుడెళ్ళినా ఎక్కడికి, ఎందుకు అని ప్రశ్నించటంలేదు.

శ్రీవాణి తన్మయత్వంతో పాడుతోంది. శ్రీనివాసులు కొనుగోలు శబ్దంచేస్తూ తాళం వేస్తున్నాడు. చినబాబుగారు ఆమె పాట శ్రీనివాసులు లయ ఆలకిస్తూ సోఫాలో పడుకున్నారు. వారిద్దరూ తన్మయత్వంలో ఒకటైపోయినా ఇంతవరకూ ఎవరూ మనసులు విప్పి చెప్పుకోలేదు. మాటల్లోగాని చేతల్లోగాని హద్దులు మీరలేదు. వారి ఆరాధన సమయంకోసం వేచి ఉంది.

తన్మయత్వంలో మునిగి ఆ యింట్లో వారెవ్వరూ మాధవయ్యగారి రాక గమ నించలేదు. ఒకరి ఎదుట ఒకరు కూర్చుని తన్మయులై ఉన్న శ్రీవాణి శ్రీనివాసుల్ని చూడగానే మాధవయ్యగారి కళ్ళు భగ్గుమన్నాయి.

శ్రీనివాసుల్ని వికలాంగుడ్ని చేసినట్లు చేసినా తన కొనుగోలు శబ్దంతో మళ్ళీ పుంజుకుని విహంగంలా సంగీత జగత్తుతో ఎగురుతున్నాడు. మాధవయ్యగారికి మళ్ళీ రెక్కలు తెగిపోతున్నాయి. అది ఒక కసి. వానపాములాగా ముక్కలు

సుకక్షాలు చేసినా శ్రీనివాసుడి ప్రతిభ ప్రాణం పోసుకుంటోంది. ఇప్పుడు శ్రీవాణి స్నేహం, ప్రేమతో మళ్ళీ మృదంగం తాకినా తాకవచ్చు. అప్పుడు మృదంగం మాధవయ్య, మచ్చుకైనా మిగలడని మాధవయ్యగారి భయం. ఈ అపాయం నుంచి బయటపడాలంటే ఏదో మాయోపాయం పన్నాలి.

"శ్రీనివాసులూ!" అని గట్టిగా అరిచారు. శ్రీవాణి, శ్రీనివాసులూ, చినబాబు గారూ ఒక్కమాటు ఉలికిపడి గుమ్మం వంక చూశారు. మాధవయ్యగారి కళ్ళు నిప్పులు చెరుగుతున్నాయి. అంతలో ఆవేశం కాస్త తగ్గించుకుని, శాంతస్వరంతో బాధ నటిస్తూ "శ్రీనివాసులూ! నా ప్రాణం విలవిలలాడి పోతోంది పట్టుకో నాయనా" అంటూ నుంచున్నచోటే కూలబడిపోయారు. శ్రీనివాసులు పరి గెత్తుకెళ్ళి ఆయన్ని పట్టుకున్నాడు.

"గురువుగారూ! ఏమైంది?" అంటూ గాభరాగా అడిగాడు.

"ఏం లేదు నాయనా! చేతిలో కురుపు బాధ భరించలేక డాక్టరు దగ్గరకొచ్చాను. కళ్ళు తిరుగుతుంటే కాస్సేపు చినబాబుగారింట్లో విశ్రాంతి తీసుకొందామని వచ్చాను. ఒక్క మాటుగా చెయ్యి కలుక్కుమని పోటు పుట్టింది. అందుకే అంత గట్టిగా అరిచాను" అంటూ సమర్ధించుకున్నారు. తనది కాని ఇంట్లో పరాయివారి ఎదురుగుండా శ్రీనివాసుల్ని ఏమన్నా బాగుండదని అలా సమర్ధించు కున్నారు. శ్రీనివాసులు ఆయన చేతికట్టు చూసి విలవిలలాడిపోయాడు.

"నాయనా! నన్ను ఇంటికి చేర్చగలవా! అసలే ఇవాళ కారు చెడిపోయి రిక్షాలో వచ్చాను. సాయంలేందే ఇంటికి వెళ్ళలేననిపిస్తోంది" అన్నారు కుటిలత్వ మంతా మనసులో మదుపుకుంటూ. కాని ఆ కుటిలత్వం శ్రీనివాసులుకు కని పించలేదు. శ్రీనివాసులు ఊహించలేదు. ఆయన బాధ చూస్తుంటే తల్లి, తాత ఎప్పుడూ అనే మాట జ్ఞాపకమొచ్చింది.

"సుకాల్లో అందరూ మూగుతారు. కట్టాలొచ్చినప్పుడు కనుమరుగై పోతారంతా. కట్టాల్లో ఆదుకునోవాడే దేముడ్రా! అడ్ని ఏ దేముడో ఎప్పుడో సల్లగా సూత్తా డంట" అంటుంది సీతమ్మ.

తల్లి ఋణం, సాకల్దాని ఋణం, మంతరసాని ఋణం, గురువు ఋణం ఎంత చేసినా తీరవంటరా అబ్బీ!" అనేవాడు తాత ఎప్పుడూ.

'గురువుగారి సేవచేసి కొంతైనా ఋణవిముక్తి పొందే అవకాశం ఇప్పుడు నాకు దొరికింది. ఆయన సేవచేసి గురు ఋణం తీర్చుకోవాలి' అని అనుకున్నాడు శ్రీనివాసులు. ఆయన్ని పొదివి పట్టుకుని అతి జాగ్రత్తగా ఇల్లు చేర్చాడు. ఇల్లు

చేరేవరకూ మన్నుతిన్న పాములా ఉన్నా, ఇల్లు చేరగానే స్థానబలిమి వచ్చింది. కూసం విడిచిన పాములా బుసలు కొట్టింది మాధవయ్యగారి మనసు. శ్రీనివాసులు విసురుతుంటే చలికాలంలో కూడా మంటలు రేగింది మాధవయ్యగారికి.

"గురుద్రోహి. విశ్వాసఘాతకుడు" అనుకున్నారు మనసులో. పైకి మాత్రం "నాదం! చూశావా! నా ప్రియశిష్యుడు శ్రీనివాసులుకు నేనంటే భక్తి, గౌరవం ఎంత ఉన్నాయో! అతను సేవ చేస్తుంటే చనిపోయేవాడు కూడా తిరిగి బ్రతకా లనుకుంటాడు. బ్రతుకుతాడు. శ్రీనివాసులు ప్రేమ అటువంటిది" అన్నారు. ఆయన మనసులో మర్మం నాదబ్రహ్మానికి కూడా తెలీదు.

ఆ మాట వినగానే శివరాత్రినాడు నాదం చెప్పిన మాటకు మాధవయ్యగారు అదిరినట్లు, నాదబ్రహ్మం అదిరిపోయాడు ఈ రోజు.

"ఓరి విశ్వాస ఘాతకుడా! ముందొచ్చిన కొమ్ములకంటే వెనకొచ్చిన కొమ్ములు వాడిట. ఇరవై సంవత్సరాలబట్టీ అడ్డచాకిరీ చేస్తుంటే నేను పనికిరాని వాడినా! వాడి సేవలతో బతికిపోతావా! హూ! నీ కంటిలో పాప వాడా! ముల్లునేనా!" మనసులో తిట్టుకున్నాడు నాదబ్రహం. పైకి మాత్రం, "ఎంతైనా మీరు ద్రోణాచార్యులు. అతను ఏకలవ్యుణాయె." అంటూ రుసరుసా లోపలికి వెళ్ళిపోయాడు నాదబ్రహ్మం. ఆ మాట వలుగు కొల్చి వాతపెట్టినట్లైంది ఒక క్షణం. మరుక్షణంలో దాన్ని పక్కకునెట్టి కర్తవ్యాలోచన సాగించారు మాధవయ్యగారు. ప్రారంభ వాక్యం దేనితో ఎలా మొదలుచేస్తే బాగా నప్పుతుందా అని.

"గురువుగారూ! చాలా బాధగా ఉందా? చెయ్యి రాయనా?" అని ఆప్యాయతగా శ్రీనివాసులు అడుగుతుంటే, మాధవయ్యగారి మనసు మరో దారిన మళ్ళింది.

'శ్రీనివాసులు మనిషా దేముడా? తన విద్యని హరించినా నాపై ఇసుమంత కోపం కానీ, కక్షగానీ లేదా ఇతనికి? పైగా నన్నింత వినయ విధేయతలతో సేవిస్తున్నాడే!' ఒక క్షణం శ్రీనివాసులు మీద జాలి కలిగింది. మాధవయ్యగారి మనసు అద్దంలాంటిది. ఒక పక్క ప్రతిబింబాన్ని చూపిస్తే మరొక పక్క మసిపూసి మనిషినే కనపడనీయదు.

మాధవయ్యగారి మనసు జాలిమీద నుంచి కసివైపుకు మళ్ళింది మరుక్షణంలో.

'ఇతనికి కావలసినంత మూఢభక్తి ఉంది. నేనేది చెప్పినా నమ్ముతాడని నా విశ్వాసం. ఓ పాచికవేసి చూడాలి" కుత్సిత మనస్కుడై కులిలమైన ఆలోచన

లతో సతమతమౌతూ, తను ఒక గురువునన్న ఉన్నత స్థితిని సైతం మరచి అతి అల్పుడిలాగా ఆలోచించారు మాధవయ్యగారు.

ఇతని లోకజ్ఞానం ఎంతమటుకో ! పరీక్షించాలనిపించింది.

"కాస్త తగ్గినట్లే ఉంది. కానీ లోపల్నించి పోట్లు మంటలు మాత్రం తగ్గలేదు నాయనా ! ముందు అవి తగ్గే మార్గం చూడాలి." ఎలా ప్రారంభించాలో, ఎలా ప్రారంభిస్తే బాగుంటుందా అని ఆలోచిస్తుంటే.

"ఆ ! అయినా అస్తమానం బాధను గురించే ఆలోచిస్తుంటే, తగ్గే బాధ ఎక్కువౌతుందంటారు. ఏదైనా కథలో, కబుర్లో చెప్పుకుంటూ కాలక్షేపంచేస్తే మంచిది." అని సలహా ఇచ్చాడు శ్రీనివాసులు.

"అదీ నిజమే శ్రీనివాసులూ ! అన్నట్లు కిందటి జన్మలో నువ్వెవరో చెప్ప గలవా ?" అని అడిగాడు.

తెలీదన్నట్లు అమాయకంగా తల ఆడించాడు శ్రీనివాసులు.

"దానికి పూర్వజన్మ సంస్కారం కావాలి అంటారు పెద్దలు. పూర్వజన్మలో అకృత్యాలు చేస్తే, అంటే.... శిష్యులకు విద్య చెప్పకపోవటం, పరస్త్రీలను మోహించటం, తల్లిని నిందించటం, ఇలాంటి వన్నమాట. అటువంటి దుష్కృత్యాలు చేసిన వారికి పూర్వజన్మ విషయాలు జ్ఞాపకాలుండవంటారు పెద్దలు. కాని కిందటి జన్మలో విషయాలు కొందరికి జ్ఞాపకముంటాయి. నువ్వెవరో నిన్ను చూడగానే గుర్తుపట్టా తెలుసా ?" శ్రీనివాసుల్నే నిశితంగా చూస్తు అన్నారాయన. శ్రీనివాసులు శ్రద్ధగా వింటున్నాడు. ఇలాంటి విషయాలు తనెప్పుడూ ఇదివరకు వినలేదు. ఏమిటో వింతగా ఉంది.

"లేదు. నేనెవరు ?" అని అడిగాడు.

"నువ్వా ! నా గురువివి. అంటే కిందటి జన్మలో నేను నీ శిష్యుడ్ని. మీరు నా భార్యను ప్రేమించారు. ఆమె ఆత్మహత్య చేసుకుంది. అప్పుడు మీకు పశ్చాత్తాపం కలిగి మరో జన్మలో ఆమెను తల్లిలా చూసుకుంటాను. నీకు శిష్యుడనై తండ్రిలా సేవించి తరిస్తాను అంటూ ఏడ్చారు. నా భార్యపోయిన దుఃఖంతో నేనూ ఆత్మహత్య చేసుకున్నాను. ఇదుగో ఈ జన్మలో ఇలా నేను నువ్వూ ఇద్దరం పుట్టాం. దుర్మార్గపు మనసుతో చచ్చిపోయిన మీకు పూర్వ జ్ఞానం ఎలా ఉంటుంది. అమాయకంగా ప్రేమకోసం బలైపోయాను కనుక నాకు పూర్వజ్ఞానముంది. అన్నీ తెలుస్తున్నాయి." అతి సుందరంగా కట్టుకథ అల్లగలిగారు మాధవయ్యగారు. శ్రీనివాసులికి నిజమే కాబోలు అనిపించింది.

"మరి తమ రెప్పుడూ...."

"చెప్పలేదేం ? అని అడుగుతావు. చెపితే కట్టుకథనీ, నేను పిచ్చివాణ్ణనీ హేళన చేస్తారు పునర్జన్మని నమ్మనివాళ్ళు. అందుకె ఎవరికీ చెప్పలేదు. నువ్వు నా ప్రియ శిష్యుడవు కనక చెప్పా!" అన్నారు శ్రీనివాసులు ముఖకవళికలు గమనిస్తూ.

'నేను అజ్ఞానిని కనకే మట్టికుండలు చేసుకునే జాతిలో పుట్టాను. గురువుగారు మహాజ్ఞాని కనకే గొప్పకులంలో పుట్టారు.' అనుకున్నాడు అమాయకంగా. శ్రీని వాసులు అమాయకత్వాన్ని ఆధారంగా చేసుకుని కొద్దికొద్దిగా పైకి పాకుతున్నారు మాధవయ్యగారు.

"నా భార్యకూడా పుట్టింది నాకోసం! ఎవరో తెలుసా ?"

'తెలీదు. ఎవరు ?' అన్నట్లు చూశాడు శ్రీనివాసులు.

"ఆమె నా భార్య కిందటి జన్మలో. కాని మళ్ళీ ఈ జన్మలోకూడా నాకే భార్య అయింది. అదుగో చూడు" అంటూ ఫోటో చూపించారు మాధవయ్యగారు. ముమ్మూర్తులా ఆ ఫోటో శ్రీవాణిదిలాగా ఉంది. అదిరిపడ్డాడు కాని మాధవయ్య ఆ అనుమానానికి తావివ్వకుండా,

"కాని ఏంలాభం ఆమె కోరికలు తీరకుండానే, నా సేవలు సపర్యలు చేయకుం డానే చనిపోయింది. వెంటనే మళ్ళీ పుట్టింది. ఎలా! ముమ్మూర్తులా గతజన్మ పోలికలతో, గతజన్మ గొంతుతో. నా భార్య పోయి ఇరవై ఐదు సంవత్సరాలైంది. శ్రీవాణి వయసు సుమారు ఇరవై నాలుగు, ఇరవై ఐదు. ఇప్పుడు నమ్ముతావా పునర్జన్మ ?" అంటూ శ్రీనివాసుల్ని నిశితంగా పరీక్షించారు. శ్రీనివాసులికి ఆయన మాటల్లో కుటిలత్వంగానీ, మోసంగానీ, నాటకంగానీ గోచరించలేదు. అయోమయంగా అయిపోతోంది శ్రీనివాసులికి. నమ్ముతా అన్నట్లు తలూపాడు.

"అందుకే ఆమెకు నేనంటే భయం, భక్తి, గౌరవం. నాకు ఆమంటే అమిత మైన ప్రేమ. శ్రీవాణికికూడా పూర్వజ్ఞానం ఉంది. కాని తండ్రికి చెపితే నమ్ము తాడో నమ్మడో అని భయపడుతోందిట. నేనే ఆయనకు నచ్చచెప్పి శ్రీరంజని కాదు కాదు శ్రీవాణిని నా యింటికి తెచ్చుకుంటాను. జీవితాంతం ఆమె పాడుతూనే ఉంటుంది. నేను వాయిస్తూనే ఉంటా. అలాగే తనువులు చాలిస్తాం" అన్నారు మాధవయ్యగారు తన్మయత్వం నటిస్తూ. శ్రీనివాసులికి దుఃఖం వచ్చింది. తనపై తనకే అసహ్యంవేసింది.

'ఛీ! ఛీ! ఇంతకాలం నేను ప్రేమిస్తున్నది గురుపత్నినా? గురుపత్ని తల్లితో

సమానమంటారు. ఆమె నన్ను బిడ్డను చూసినట్లు చూస్తుంటే, నేను కాముకుడిలాగా ఊహించానా? నా కళ్ళు కాలిపోనూ! ఆమె మాట్లాడే ప్రతిమాటకీ తప్పు అర్థాన్ని కల్పించుకున్న నా మెదడు చెడిపోయింది. నన్ను నేను నిలువునా దహించుకున్నా పాపంలేదు.

ఛీ ఇంతకాలం నన్ను గురించి ఆమె ఏమనుకుందో! ఆమె పూర్వజ్ఞాని. అందుకే నన్ను క్షమించి ఆదరిస్తోంది. మరొకళ్ళైతే నా కళ్ళు పీకి, నన్ను ముక్కలు ముక్కలు చేసేవారు. నా ముఖం ఆమెకు చూపకూడదు. చూపలేను. ఇదే నేను చేసిన తప్పుకు శిక్ష. అసలు అంతం కావడమే శిక్ష. కాని ముసలిది నా తల్లి. ఆమెని బ్రతికుండగా ఏకాకిని చేసి చంపితే ఆ పాపానికి మరుజన్మలో మరే జన్మ వస్తుందో!" అనుకుని దుఃఖించాడు. శ్రీనివాసులు గురువుగారి కాళ్ళ మీద పడి ఏడ్చాడు.

"నేను చేసిన ఘోరమైన తప్పుకు ఏ శిక్షవేసినా అనుభవిస్తాను. నాకు పూర్వజ్ఞానం లేకపోవడంవల్ల గురుపత్నిని పోల్చుకోలేక....ప్రే....మిం....చా....ను" అంటూ గురువుగారి కాళ్ళు గట్టిగా పట్టుకుని ఏడ్చేశాడు శ్రీనివాసులు.

తన పాచిక చక్కగా ఏ ఒడిదుడుకులు లేకుండా పారినందుకు మాధవయ్యగారు చాలా సంతోషించారు. శ్రీనివాసుల్ని లేవనెత్తుతూ "పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తం. లే నాయనా. నువు చేసింది చాలా ఘోరమైన తప్పు. మరొకరైతే నాలిక కోసి కళ్ళు పీకించేసెయ్యగలరు. కాని నాకు నీపైగల పుత్రవాత్సల్యంతో నేనాపని చెయ్యలేను. కాని నువు ఏ నాలుక పెదవులు ఆడించి కొనగోలు శబ్దంచేస్తూ ఆమెని ఆకర్షించావో ఆ శబ్దం మరి నీ నోటివెంట రాకూడదు. నువు ఏ కళ్ళతో శ్రీవాణిని చూశావో మరి ఎప్పటికీ నువ్వామెను చూడకూడదు. మాట్లాడకూడదు. ఏ హృదయంతో ప్రేమించావో దాన్ని శిలగా మార్చుకుని జీవించు. అంతకుమించి కఠినమైన శిక్షలు నేను వెయ్యలేను నాయనా!" అన్నారు మాధవయ్యగారు బాధ నటిస్తూ.

'అమ్మముండాకొడకా! ఎంత ఎత్తువేశావురా! మొత్తానికి వాడి బ్రతుకు బంధించేశావు కదరా! ఛీ! నువు గురువ్వా! నీలో గురులక్షణం ఏముంది? విద్య నార్జించావు డబ్బులాగా. కాని పిల్లికి బిచ్చమెయ్యడం తెలియనివాడిలాగా విద్యాదానం చెయ్యలేని పిసినారివి. ఒకళ్ళు పైకివస్తే ఓర్చలేని అప్రాచ్యుడివి. నీ సహవాస దోషం కాబోలు నాకు ఎక్కడలేని దుర్బుద్ధులూ పుట్టుకొచ్చాయి. శ్రీనివాసులికి ద్రోహంచేసిన పాపిని నేనే! కాని నేను ఆ మాట చెప్పినా ఆ అమాయకుడు

నమ్మడు. సమయంకోసం వేచి ఉండాలి. ఇంక నీ దగ్గిర ఒక్క క్షణ మున్నా పుచ్చి పురుగులపడిపోతాను. అమ్మో అమ్మో ఎంత ప్లాన్ వేశావురా" చాటునించి అంతా వింటున్న నాదబ్రహ్మం గుండెలు బాదుకున్నాడు. మరి అక్కడ ఉండ కూడదని నిశ్చయించుకున్నాడు. రాత్రికి రాత్రే ప్రయాణం కట్టాడు.

'వాడిని దూరం చేసినా శ్రీవాణి నిన్ను దరిదాపులకు రానియ్యదురా పాపీ! ప్రేమతో దాన్ని విడతీసిన మహాపాపం కాలనాగై నిన్ను వెంటాడుతుందిరా. అక్కరకు రాని గురువును గ్రక్కున విడువంగవలయు అన్నారు పెద్దలు' అనుకున్నాడు వెళ్ళిపోతూ.

## 13

ఈసారి బెంగతో కుమిలి కృశించిపోలేదు శ్రీనివాసులు. ఇంట్లో ముడుచుకుని అంతకంటే కూచోలేదు. కాని పొరపాటున కూడా శ్రీవాణి ఇంటి ఛాయల కెళ్ళకూడదని నిర్ణయించుకున్నాడు. బ్రతికి నన్నాళ్లూ చావకుండా మెతుకు తినాలి కనుక చచ్చి బ్రతుకుదామనుకున్నాడు. గత జన్మ, అంటే తన వైభవోపేతమైన బ్రతుకు గుర్తుచేసుకోకుండా, అలవాటైన కూలిపని చేసుకుంటూ అజ్ఞాతంగా బ్రతుకు వెళ్ళమార్చాలనుకున్నాడు. చచ్చిపోయిన తన పేరుని సమాధి చేశాడు. మాధవయ్యగారి ఇంటికేసి కూడా వెళ్ళడం మానుకున్నాడు శ్రీనివాసులు.

తల్లిచేత ఒట్టు వేయించుకున్నాడు.

ఎవరైనా వస్తే శ్రీనివాసులు ఎక్కడుందీ ఏం చేస్తోందీ చెప్పనని.

కాని బిడ్డ అకారణంగా ఏదీ అనడని ఆమె నమ్మకం. అందుకే సరే అంది. శ్రీవాణి ఒకటి రెండుమాట్లు వచ్చి వెళ్ళింది. కాని సీతమ్మ ఏమీ చెప్పలేదు శ్రీనివాసుల్ని గురించి. తలవంచుకుంది. ఆమె అడిగిన ప్రశ్నలకు ముక్తసరిగా అంటీముట్టకుండా చెప్పి పంపించింది. శ్రీవాణి ఎన్నోమాట్లు శ్రీనివాసులు కోసం ఇంటికెళ్ళింది. కాని ఎంత ప్రయత్నించినా శ్రీనివాసుల్ని కలుసుకోలేక పోయింది శ్రీవాణి. ఈ మారు గురువుగారి దగ్గర కెడతాను కదా! మాధవయ్య గారికి శ్రీనివాసుల ఉనికి తెలుస్తుందనుకుంది. కాని అదీ వృధా ప్రయాసగానే మారింది.

"అతను తనదగ్గిరకొచ్చి నెలరోజులైంది. ఎక్కడికి వెళ్ళాడో! తనకు తెలియదని చెప్పారాయన ఆరాకోసం వెళ్ళిన రామకోటిగారితో. శ్రీవాణికి ఏదో అనుమానంగా అనిపించింది. శ్రీనివాసులు తనకెందుకు దూరంగా ఉంటున్నాడు? తనేమైనా అసభ్యంగా ప్రవర్తించిందా? లేక అతను తనను కాక మరెవరినైనా

ప్రేమిస్తున్నాడా? డాక్టరు నిజంగానే మృదంగం వాయించద్దన్నాడా? మరి అతనిలో ఏ అనారోగ్య సూచనలు లేవే? తల్లిని ఎంత అడిగినా అతని గురించి చెప్ప దెందుకని? నేనంటే అతనికి ఇష్టం లేదా?" ఇలాంటి ప్రశ్నలు ఉదయించి ఆమెని బాధిస్తున్నాయి. కాని ఏమీ చెయ్యలేకపోతోంది. తన మీద ఏమాత్రం ప్రేమ, అభిమానమున్నా తనగొంతు వినిపిస్తే తప్పక పరిగెత్తుకొస్తా డనుకుంది. ఇదివరకటి కంటే ఎక్కువ ప్రోగ్రాములు ఒప్పుకుని ఊరూరా తిరుగుతోంది. ఆరోగ్యం చెడిపోతుందని తండ్రి ఎంత బ్రతిమాలినా వినటంలేదు. కాని చినబాబుగారికి తెలుసు శ్రీవాణి శ్రీనివాసులు కోసమే బ్రతుకుతోందని. రేడియోలో ఆమె గొంతు వినిపిస్తే అలవాటు చొప్పున పరవసించిపోతాడు. కాని టి. వి. లో ఆమె బొమ్మ కనిపిస్తే తట్టుకోలేక పారిపోతున్నాడు శ్రీనివాసులు. ఒంటరిగా ఉంటే ఆమె గురించే ఆలోచించి గుండె బరువు చెరువు చేసుకుంటాడు.

ఒకరోజు రిక్షా స్టాండ్‌లో ఒంటరిగా కూర్చున్నాడు శ్రీనివాసులు. ఆ రోజు రిక్షా తీసుకుని రెండు గంటలైనా గిరాకీ దొరకలేదు. తోటివాళ్ళంతా రిక్షాలు తీసుకుని గిరాకీలవెంట వెళ్ళిపోయారు.

"ఏయ రిక్షా!" అని పిలిచా రెవరో।

శ్రీనివాసులు రిక్షా తీసుకుని పరిగెత్తుకుని వారిదగ్గర కెళ్ళాడు. ఆ ముగ్గుర్నీ గుర్తుపట్టాడు. కాని అందులో ఒకాయన శ్రీనివాసుల్ని గుర్తుపట్టలేదు.

"రిక్షా కడతావేమిటోయ్!" అన్నారాయన శ్రీనివాసుల్ని గుర్తుపట్టలేక రిక్షావాడనుకుని.

"కడతానండీ!" అన్నాడు శ్రీనివాసులు వినయంగా ముగ్గురికీ నమస్కరిస్తూ.

"మరి ముగ్గురం ఎక్కాలి. ఏం తీసుకుంటావ్" అన్నారు రామకోటిగారు.

"ఎక్కడికి వెళ్లాలండీ?" వేషంతోపాటు కొత్త భాషకూడా మార్చుకున్నాడు శ్రీనివాసులు.

"మృదంగం మాధవయ్యగారి అద్దాలమేడకి, ఏం కావాలి?" అన్నాడాయన.

"మీరు నా రిక్షా ఎక్కడమే మహాభాగ్యం. ఎంతుచ్చుకున్నా ఎక్కువేనండి" అన్నాడు.

"అంటే వీరెవరో నీకు తెలుసా ఏమిట్రా?" అన్నారు ఇబ్బిముబ్బిడి బొతున్న సంతోషంతో.

"తెలీదండి. పెద్దోరులా కనిపిస్తున్నారు కదండీ!" అన్నాడు, తనకు తెలుసంటే తన బండారం బయటపడుతుందేమోనని శ్రీనివాసులు.

"కనిపించడమేమిట్రా, పెద్దవారే! వీరు పాలఘాటు మణిఅయ్యర్ గారు. మృదంగ విద్వాంసులు. మద్రాసు నించి వచ్చారు. వీరు సెమ్మంగుడి శ్రీనివాస అయ్యంగారు. సంగీత విద్వాంసులు," అంటూ, వారివంక తిరిగి ఎక్కండి అంటుండగానే శ్రీనివాసులికి సంతోషం, దుఃఖం పొర్లుకొచ్చాయి. అంతటి మహాత్ములు తన రిక్షా ఎక్కడం తన భాగ్యమైనా తానెవరో చెప్పుకోలేని దౌర్భాగ్యానికి దుఃఖం వచ్చింది.

"అలాగా!" అంటూ మనస్ఫూర్తిగా నమస్కరించాడు. చెమ్మగిల్లిన కళ్ళు చూచి.

"మా ఊళ్ళో రిక్షావాడి దగ్గిర నుంచీ, పెద్దవారిదాకా తమ పేరు ప్రఖ్యాతులు తెలుసు. మా ఆంధ్రులకు మీ సంగీతం అంటే ప్రాణం" అన్నాడు తమ ఆంధ్రుల్ని అందరూ అంధులనీ అసమర్థులనీ సంగీత మంటే తెలియనివారని తమిళుల అభిప్రాయమని రామకోటిగారి అభిప్రాయం. మాకూ సంగీతం పిచ్చి ఉందని చెప్పబోయి మీరే గొప్పవారని అన్నారు కాని అంతలో తప్పు గ్రహించారు. వాళ్లు కాస్త గర్వంగా తలెత్తగానే సద్దుకుంటూ, వారి తలలు కాస్త దించాలని,

"మావాళ్ళు కర్నాటక సంగీతాన్నే కాదు హిందుస్తానీ పాశ్చాత్య సంగీతాలని కూడా ఎంతో గౌరవిస్తారు." అన్నారు. తమిళులకి కర్నాటక సంగీతమే సంగీతమనే దురభిప్రాయం. ఇతర సంగీతం తక్కువదని వారి అభిప్రాయం. దాంతో వారు కాస్త తగ్గి, అక్కడితో ఆ విషయం ఆపడం మంచిదని,

"రండి పోదాం" అంటూ రిక్షా ఎక్కారు. ముగ్గురూ ఇరుక్కుని కూర్చున్నారు. అతికష్టంగా రిక్షా లాగుతున్నాడు శ్రీనివాసులు.

"మాధవయ్యగా రిల్లు తెలుసా?" అన్నారు రామకోటిగారు.

"తెలుసండి" అన్నాడు శ్రీనివాసులు తలవంచుకునే.

"మాధవయ్యగారు మా ఆంధ్ర దేశానికే పేరు తెచ్చిన విద్వాంసులు. అటువంటి వారికి అనారోగ్యం రావడం మా దురదృష్టం మణిగారూ! ఆయన లేని రోజున మా సంగీత సరస్వతి తండ్రిలేనిదై పోతుంది" అన్నారు రామకోటి గారు విచారంగా.

"అవును మరి. శృతిః మాతాలయః పితా అన్నారు పెద్దలు. అయినా కీర్తి బ్రతికిన్నాళ్ళు కాయం నిలువదు కదా! జాతస్య మరణం ధృవం అన్నారు. అయినా మాధవయ్యగారి శిష్యుడు, ఏకలవ్య బిరుదాంకితుడు శ్రీనివాసులు

అనే యువకుడు గురువును మించిన శిష్యుడని మా ప్రాంతంలో కూడా గొప్పగా చెప్పుకుంటున్నారు. మీరు, అంతగా విచారించే పనిలేదు," అన్నారు శ్రీనివాస అయ్యంగారు స్వచ్ఛమైన తెలుగులో. రామకోటిగారికి ఆశ్చర్యమేసింది. తమిళులు పరరాష్ట్ర భాషను ఏవగించుకుంటారని విని ఉన్నారు.

"మీకు తెలుగు బాగా...."

"వచ్చు. తరచు మేము ఆంధ్ర రాష్ట్రానికి రావటమూ, ఇక్కడి పెద్దలు ద్వారంవారు, బాలమురళి, పారుపల్లి లాంటి విద్వాంసుల సాంగత్యంతో మాకు తెలుగుభాషాభిమానం కలిగి నేర్చుకున్నాం" అన్నారు మణిఅయ్యరు నవ్వుతూ.

"చాలా సంతోషం. తెలుగు, తియ్యనైన తేట తేనె బాస అంటారు" అన్నారు తమ తెలుగుమీద వారికంత అభిమానం ఉన్నందుకు సంతోషిస్తూ.

"అన్నట్లు ఆ ఏకలవ్యుడి పేరు వినటం తప్ప అతడిని చూసే అదృష్టం మాకు కలగలేదు. మీరే పరిచయం చేయాలి మాకు" అన్నారు శ్రీనివాస అయ్యంగారు. ఆ మాట వినగానే శ్రీనివాసుకు పరమానందం కలిగింది. ఇంత గొప్ప విద్వాంసులు కోరి నన్ను చూడాలనుకోటం నా అదృష్టం అనుకున్నాడు. కాని అంతలో దుఃఖం పొర్లుకొచ్చింది. "నా అదృష్టమే నా దురదృష్టం. నేను నేను కాదు. వారి పాదాలు తాకి ఆశీర్వచనం పొందవలసిన సమయంలో వారిని మోస్తున్నాను. భగవంతుడా! ఇదేం దౌర్భాగ్యం స్వామీ" అనుకుంటూ ఏడుస్తూనే రిక్షా తొక్కుతున్నాడు శ్రీనివాసులు. కాని రిక్షాలో వారికి అతని కన్నీరు కనిపించలేదు.

"ఆ యువకుడితో పోటీపడి ఓడిపోవాలని కోరిక పుడుతోంది రామకోటిగారూ ఈ ముసలి మణికి" అన్నాడు మణిఅయ్యర్‌గారు నవ్వుతూ.

"అది మీ సంస్కారానికి మచ్చుతునక. కాని.... ఆ యువకుడు ఇక్కడ లేడు. రెండు నెలల క్రితమే విదేశ పర్యటనకై వెళ్ళినట్లు మాధవయ్యగారు చెప్పారు. అదే కదండీ మా బాధ. సమయానికి అతనూ లేడు. వీరికేమో చేతిలో వ్రణం. బోలెడంత డబ్బు వ్యయంచేస్తున్నారు. కానీ లాభం లేదంటున్నారుట. బహుశః చెయ్యి కొట్టేస్తారేమో ననుకుంటున్నారు" రామకోటిగారు బాధపడ్డారు. శ్రీనివాసులుకి చెప్పలేనంత దుఃఖం వచ్చింది.

"ఏం చేస్తాం. ఎంతటి వారికైనా కర్మను అనుభవించి తీరక తప్పుతుందా? కిందటి జన్మలో ఒకరికి పెడితే ఈ జన్మలో మనం తింటాంట. ఒకరిని నిందిస్తే ఒకరిని చూసి ఓర్వలేకపోతే, భగవంతుడు ఈ జన్మలో దాని ఫలితాన్ని మంచైనా చెడైనా దాచి ఇస్తాట్ట!" శ్రీనివాస అయ్యంగారు అన్నారు.

"ఏమో! కిందటి జన్మలో సంగతి మాట ఏమోగానీ ఈ జన్మది ఈ జన్మలోనే అనుభవిస్తారంటారు కొందరు." మణిగారు నిక్కచ్చిగా అన్నాడు.

"అదీ నిజమే అయివుండొచ్చు." అన్నారు రామకోటిగారు ఏదీ ఇదమిత్థమని తేల్చలేక. మాటల సందట్లో మాధవయ్యగారి ఇంటిదగ్గరకొచ్చినట్లే గమనించలేదు వారు. రిక్షా ఆగడంతో వారికి తెలివి వచ్చింది.

ముగ్గురూ దిగి కండువాలు సద్దుకుని డబ్బులు ఇవ్వబోయేసరికే శ్రీనివాసులు వెళ్ళిపోయాడు.

"అరే! డబ్బులు తీసుకోకుండానే పోయాడే!" అన్నారు మణిఅయ్యర్.

"పిలవండి రామకోటిగారూ! లేకుంటే మనం ముగ్గురం ఋణపడిపోతాం వాడికి. చచ్చి వాడి కడుపున పుట్టితేగానీ ఈ ఋణం తీరదు" అన్నాడు శ్రీనివాస అయ్యంగారు, నవ్వుతూ.

"మీరు అలా ఎందుకనుకోవాలి! కిందటి జన్మలో మనకే వాడు ఋణపడి ఈ జన్మలో ముగ్గుర్కీ ఒకే సారి ఋణం తీర్చుకున్నాడని ఎందుకనుకోకూడదు?" అన్నారు రామకోటిగారు. ముగ్గురూ నవ్వుకుని లోపలికి వెళ్ళారు.

శ్రీనివాసులికి కూడా వారితోపాటు లోపలికి వెళ్ళాలనిపించింది. కాని ఎవరైనా గుర్తుపడితే గురువుగారి పరువుపోతుంది. అబద్ధమాడిన నింద నెత్తిన పడుతుంది. నిజంగా గురువుగారి చేతులో ప్రణమా! అయ్యో! ఇదెక్కడి పాపం? గురువుగారు దేవుడంటివారే! ఆ కురుపు నాకు వచ్చి ఆయన్ని సుఖంగా ఉంచకూడదా? ఎందరికో సహృదయంతో ఉచితంగా విద్యాదానం చేసిన దాతకా ఇలాంటి శాపం. అదే ఆయన చేసిన తప్పా? మరి పూర్వజన్మలో నాకు శిష్యుడైనా భగవంతుడు మెచ్చుకుని ఈ జన్మలో గురువుగా పుట్టించాడే! భగవంతుడు మెచ్చుకునే కదా నాకు లేని పూర్వజన్మ జ్ఞానాన్ని ఆయనకు ఇచ్చాడు. ఇటువంటి ఆయనకు నిర్దాక్షిణ్యంగా ఇంత శిక్షవేసి చెయ్యి కూడా సరిగ్గా పనిచేయటానికి ఆయన చేసిన నేరం ఏమిటి?

నా గురువు. నా దైవం నా ప్రాణం. సర్వస్వం ఆయనే. ఆపదలో అలమటిస్తున్న నా గురువుని ఆదరించకుండా ఉండటం మహా పాపం. ఆయన సేవలు చేస్తే నా పాపాలు పోతాయి. నా జన్మ తరిస్తుంది. మరుజన్మలోనైనా మంచి జన్మ వస్తుంది." అనుకున్నాడు.

## 14

"అమ్మా శ్రీవాణీ! నీ నిరీక్షణ ఫలించిందమ్మా" అంటూ పరమానందంతో పరుగు పరుగున వచ్చారు రామకోటిగారు. చినబాబుగారు ఇంట్లో లేరు. శ్రీవాణి

దిగులుగా మైనా పంజరం పక్కనే విచారంగా కూచుంది ఏదో ఆలోచిస్తూ. రామకోటిగారి మాట వినగానే, తలెత్తి,

"ఏమిటి రామకోటిగారూ మీరంటున్నది" అంది. తను శ్రీనివాసులు కోసం అలమటిస్తున్నా ఒక ఆడపిల్ల పురుషుడికోసం బయటపడిందన్న అపవాదు తను భరించలేదు. అందుకే అలా అడిగింది. ఆ ప్రశ్నలో ఆత్రం, కోరిక దాగి ఉన్నాయి. కాని రామకోటిగారికి తెలుసు శ్రీవాణి మనసు.

"అదేనమ్మా! మన శ్రీనివాసులు విషయం. పుయ్యూరు నుండి వెడితే నాదబ్రహ్మం కనిపించాడక్కడ. పాపం పక్షవాతం వచ్చి చెయ్యీ కాలూ నోరూ పడిపోయినాయిట. కానీ శ్రీనివాసులుకు ఘోర అన్యాయమే జరిగిందమ్మా!" అన్నారు బాధగా. శ్రీ వాణికి ఆత్రం ఎక్కువైంది. శ్రీనివాసులుకు ఏమైనా అయిందేమోనని భయం కలిగింది.

"నా శ్రీనివాసులుకు ఏమైంది రామకోటిగారూ!" ఆందోళనలో బయటపడింది శ్రీవాణి. శ్రీవాణిని ఊరడిస్తూ "శ్రీనివాసులు పైకొస్తున్నాడన్న ఈర్ష్యతో అతని విద్యని గురుదక్షిణగా స్వీకరించారుటమ్మా మా....ధ....వ....య్యగారు." ఆ మాట అంటుంటే ఆయన కళ్ళలో మంటలు రేగాయి.

"అందుకే అతను మృదంగం ముట్టనిది. ముడితే మరణం సంభవిస్తుందని వంకచెప్పి తననెవరూ ఏ ప్రశ్నా అడక్కుండా తనని తాను, తనమాటనీ కాపాడుకున్నాడమ్మా. మళ్ళీ కొనుగోలు శబ్దంతో పేరుగడిస్తున్నాడనీ అతన్ని అధఃపాతాళానికి తొక్కి సర్వనాశనం చేశాడమ్మా ఆ మాధవయ్య. పునర్జన్మ పేరుతో తను పూర్వజన్మ జ్ఞానం కలవాడినని, పూర్వజన్మలో నువు ఆయన భార్యవని, గురుపత్నిని ప్రేమిస్తే నాశనమౌతావని భయపెట్టి, నీ ముఖం చూడకుండా, నోటితో కూడా వాయించకుండా కట్టుదిట్టం చేశాడుటమ్మా ఆ పాపి. అందుకే శ్రీనివాసులు అజ్ఞాతంగా జీవిస్తున్నాడు. అతనెక్కడుందీ మృదగం మాధవయ్యకు తప్పక తెలిసే ఉంటుంది. కారణం మాధవయ్య ఎంత నెత్తి అడచినా అతనిలో గురుభావం, భక్తి, వినయం చావవు. చంపడు. అతను మహ మనీషి తల్లీ!

"పాపం ఆ నాదబ్రహ్మం ఇదంతా తనవల్లే జరిగిందని పశ్చాత్తాపపడి ఏడ్చాడు. ఆ పాపమే తనకు పక్షవాతంగా వచ్చిందని వాపోయాడు. తనకు తెలిసిన నిజం నాకు చెప్పి, మనకో దారి చూపాడమ్మా. ఇప్పుడు మనం శ్రీనివాసులు ఉనికి తెలుసుకుని విషయమంతా విప్పి చెప్పి, అతని అజ్ఞాత జీవితాన్ని వెలుగులోకి

తేవాలమ్మా" అన్నారు. శ్రీ వాణి ఆ కథంతా విని లేతచిగురుటాకులా విలవిల లాడింది.

## 15

శ్రీనివాసులికి గురువుగారి మొండిచెయ్యి చూస్తుంటే దుఃఖం పొల్లుకొస్తోంది. ఇంక ఆ చెయ్యి మృదంగం మ్రోగించలేదు కదా! "గురువుగారూ! మీరు ఏ జన్మలో ఏ పాపం చేశారని ఈ శిక్ష" అంటూ ఆ చేతికి కట్టుకడుతూ ఏడుస్తాడు శ్రీనివాసులు ప్రతిరోజూ.

"ఏడు జన్మల పున్నెం పాపం వెంటపడుద్దంట. ఏ జలమలో శాపమో ఇది. మీరేం బాధపడకండి బాబుగారూ! నేను శీనివాసులూ ఉండగా మీకే లోటూ రానీయం. శీనివాసులు మీ కొడుకు కాకపోయినా కొడుకులాంటోడు" అంటూ ఓదారుస్తూ మాధవయ్యగారి చేతికి బాపటంపెడుతుంది సీతమ్మ.

"హు! నాకే లోటూ లేదు. చెయ్యిపోతే శ్రీనివాసులు చెయ్యి అందిచ్చాడు. ఇల్లు వాకిలీ అన్నిపోతే నీ ఇంట్లో తెచ్చి పెట్టుకుని కంటికి రెప్పలా కాపాడు తున్నారు. మీరిద్దరూ తిన్నా తినకపోయినా నాకు మందులూ మాకులూ తెచ్చి తిని పిస్తున్నారు. ఇంకా ఈ అవిటివాడికి లోటేమిటమ్మా! నెల రోజులుగా నిద్రా హారాలు మాని సేవలు చేస్తున్నారు" అంటారు మాధవయ్యగారు. ఇది రోజూ జరిగే మాటలే. కాని కొద్ది రోజులుగా మాధవయ్యగారు మానసికంగా కుమిలి పోతున్నారు. ఏ మందులూ వంటపట్టనట్లు అనిపిస్తున్నది. తిండి తిన్నా అంతే.

"శీతమ్మకి శ్రీనివాసులుకి తను చేసిన పాపం చెప్పెయ్యాలనిపిస్తోంది. అప్పుడు సీతమ్మ తిట్టాలి. కొట్టాలి. శ్రీనివాసులు అసహించుకోవాలి, మాడ్చి చంపాలి అప్పుడుగాని తను చేసిన పాపానికి నిష్కృతి లేదు.

కాని శ్రీనివాసులు అలా చెయ్యడు. అతనికి గురువంటే అమితమైన గురి. భక్తి; దాన్ని ఆధారంగా చేసుకునే కదా తనింత ద్రోహం చేసింది. చెయ్యి గలిగింది ప్రపంచంలో శ్రీనివాసుల్లాంటి శిష్యులు, విద్యార్థులు ఉండాలి. కాని నాలాంటి. గురువులు ఉండరాదు. ఉన్నా బ్రతకనియ్యరాదు. కూకటివేళ్ళతో పీకెయ్యాలి. విద్యార్థులని ప్రేమించలేని గురువు విషంపెట్టే తల్లితో సమానం.

విద్య మర్మం విడిచి చెప్పలేనివాడు మాయామర్మాలు తెలియని పసిపాపని చంపిన పాపితో సమానం.

గురువు చెప్పే విద్యపైన, తల్లి నేర్పే సద్బుద్ధివలే ఉత్తములు ఉద్భవిస్తారు. కంటే చేసుమేస్తే? గొప్పా బీదా తారతమ్యాలు చూపి నేను చేసిందేమిటి? విద్య

నేర్పించలేకపోయినా, వినికిడితో నేర్చుకుని పైకొచ్చిన శ్రీనివాసుల్ని అణగ తొక్కెయ్యాలనుకున్నా. నా స్వార్థంకోసం ఇద్దరు ప్రేమికుల్ని విడతీయా లనుకున్నా. నేను చేసిన ఏ మహాపాపానికి నిష్కృతి లేదు. పాపానికి ఫలితం భగవంతుడు తులతూచి ఇచ్చాడు. ఇది చాలు' మొండిచెయ్యి చూసుకుని సంతృప్తిపడి విచారంగా నవ్వుకున్నాడు మాధవయ్యగారు.

"చేసింది తప్పని తెలిసినప్పుడు దిద్దుకోవాలిట. లేకపోతే మరి చెయ్యరాదుట. కానీ మరి చెయ్యకుండా ఉండే అవకాశంలేదు. మరుజన్మ ఉంటే నాకు పూర్వ జన్మ జ్ఞానం ఉండే అవకాశం ఉంటుంది. ఎంతటివారికో ఆ జ్ఞానం. నాలాంటి పాపికి కాదు.

'దిద్దుకునే అవకాశం కొద్దిగా ఉంది. అలా దిద్దుకోగలిగితే నా శేష జీవితం సంతృప్తితో గడుస్తుంది. లేకపోతే........ నేను నిర్మించుకున్న నరకంలో, నా పాపాల యమభటులు నన్ను చిత్రవధ చేస్తారు.

శ్రీనివాసులు సాయంత్రం రాగానే నేను చేసిన తప్పులన్నీ చెప్పి క్షమించ మని అడుగుతా. మళ్ళీ ప్రపంచ రంగస్థలంపై వీరవిహారం చెయ్యమంటా' అనుకున్నారొకరోజు. కాని శ్రీనివాసులుకు వాయించే అవకాశం రావాలి. వచ్చి నప్పుడే నేను ప్రార్థించాలి. అప్పుడు నన్ను నొప్పించలేక నా మాట కాదనలేక నన్ను సంతోషపెట్టడం కోసం నేను చెప్పినట్లు చేస్తాడు. సమయం కోసం వేచి ఉండాలనుకుని ఊరుకున్నాడు. కాలం బరువుగా నడుస్తోంది.

## 16

ఒక రోజు శ్రీనివాసులు కూలిపనికి వెళ్ళాడు. సీతమ్మ బీడీల ఆకుల కోసం వెళ్ళింది పొద్దున్నే వెడితే త్వరగా రావచ్చుని. మాధవయ్యగారు ఒక్కరే ఒంటరిగా పడుకున్నాడు గుడిసెలో.

"ఎవరమ్మా లోపల?" ఎవరో పిలిచారు. మాధవయ్యగారు లేచి ఇవతలకు వచ్చే స్థితిలో లేరు. అందుకని పడుకునే, "ఎవరో! ఇలా లోపలికి రండి!" అన్నారు. ఆ వచ్చిన వ్యక్తి మెల్లగా లోపలికి వచ్చాడు.

"నమస్కారం మాధవయ్యగారూ. మిమ్మల్ని చూడాలని మీ యింటికెళ్లాను. మీరు ఇక్కడుంటున్నారని చెప్పారు ఆ ఇల్లు కొనుక్కున్నవాళ్ళు. అందుకని ....." తను వచ్చిన పని చెప్పాడాయన ఒక్క గుక్కలో.

మాధవయ్యగారు తలఎత్తి ప్రతినమస్కారం చేశారు.

"రండి రామకోటిగారూ! విధి వైపరిత్యానికి ఎదురీదలేక వైభవాలు కొట్టుకు

పోయాయి. వాటితోపాటు కొట్టుకుపోలేక ఇంకా ఈ కట్టెలో కొంతభాగం మిగిలి పోయింది. మీరు మరోలా భావించక ఆ ఈతాటాకుల చాపమీద కూర్చోండి" అన్నాడు తలదించుకుంటూ.

రామకోటిగారు కూర్చుంటూ, "పాపం మీకు భగవంతుడు తీరని అన్యాయం చేశాడు. మీ చెయ్యి......."

"ఇంకా బోలెడు శరీరం మిగిలిపోయింది." అన్నాడు విషాదంగా నవ్వుతూ.

"మీ వంటి ఉత్తములకు రావలసినది కాదు" పైకి అలా అనాలని, అనకపోతే బాగుండదని అన్నాడు రామకోటిగారు. మాధవయ్యగారు దానికి సంతోషించలేదు.

"అవును. శివుని మెడలో ఉందని, విష్ణువు శయనించాడని పాముని దేముడని పూజిస్తారు. కాని అది విషపు పురుగని మరుస్తారు ఆ సమయంలో. కాని పాము మరవలేదు. సమయం దొరికినప్పుడు కాటేస్తుంది. తనని పూజించారు కదా అని ఒదలదు. నేనూ అంతే. నాకూ దానికీ తేడాలేదు. కాటేస్తే కర్రతో కొట్టాలి. ఒకొక్కప్పుడు చావడం, లేకపోతే ఎక్కడో ఒక చోట తగిలి పాకలేక పోవడం జరుగుతుంది" అనుకున్నాడు మాధవయ్యగారు అలా అనగానే.

"మాధవయ్యగారూ! మీ వల్ల మాకో సాయం కావాలి. మీరు కాదనరన్న నమ్మకంతో ఇంత దూరం వచ్చాను.' చల్లకొచ్చి ముంత దాచటం ఇష్టంలేక అడిగేశాడు.

'లేకుంటే నన్ను చూడటానికి వచ్చేంత గొప్పతనం నాకేముంది?' అనుకుని "రామకోటిగారూ! నాతో పరాచికమా! నేను మీకు సాయం చెయ్యాలా? ఎటువంటి సాయం? ధన సహాయమా? నాకున్న సంపదంతా ఊడ్చిపెట్టుకు పోయింది. అది ఇవ్వలేను. విద్య? అదీ లేదు. సరస్వతి బ్రహ్మ దగ్గరకు పరుగెత్తుకెళ్ళింది నా దగ్గర ఉండలేక. ఇప్పుడీ మాధవయ్య ఉత్త డొల్ల. పుచ్చిపోయిన డొల్ల రామకోటిగారూ. మిగిలింది ప్రాణం. అది మీకెందుకూ పనికిరాదు.

'ఒకానొకప్పుడు ఈ డొల్ల గట్టిది. కుడి ఎడమ మూతలు, కరిణి, శృతి చెయ్యడానికి పిపిరాయి, వారు అన్ని హంగులుండేవి. ఏ శృతి కావాలంటే ఆ శృతి, ఏ ..... కావాలంటే అది పలికేది.

"ఇప్పుడో దబ్బాకే కుడి ఎడమలులేవు. హోదా అనే వారు లేరు. అది ఉంటే ఎలా బిగిస్తే ఆ శృతి పలికేది.

'కాని ఇప్పుడూ అప్పుడూ ఉన్నది డొల్ల మాత్రమే' విషాదంగా నవ్వుతుంటే ఆయన కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"అవేమీ కావు. మీరు ఇవ్వగలిగిందే. మాట సాయం. అది చెయ్యండి చాలు" అన్నాడు రామకోటిగారు. మాధవయ్యగారి మనసు కాస్త తేలికై మళ్ళీ ముడుచుకుపోయింది.

"మాట సాయమా! విలువలేని మనిషి మాటకు కూడా విలువుండదు రామకోటిగారూ! అయినా మీరు అడుగుతున్నారు కనక చెప్పండి. చెయ్యగలిగితే తప్పక సాయం చేస్తాను," అన్నాడు మాధవయ్యగారు.

"ఏంలేదు. త్యాగరాజ ఉత్సవాలు ప్రతి సంవత్సరం మన ఊళ్లో చేస్తాం తమకు తెలిసిందే కదా! ఆంధ్రదేశం, ఆంధ్రులం ఆ ఉత్సవాలు జరుపుకుంటున్నాం కదా! అందుకని ప్రప్రథమంగా అఖిలాంధ్ర విద్వాంసులతో ఉత్సవాలు ప్రారంభించాలనుకున్నాం."

"సంతోషం రామకోటిగారూ. అలాగే చెయ్యండి. త్యాగరాజు ఎవరివాడన్న మీమాంస లేదు. కర్నాటక సంగీత త్రిమూర్తులలో వారొకరు. సర్వ సంగీత ప్రియులకూ పూజ్యనీయుడు శ్రీ త్యాగయ్య." అన్నాడు మాధవయ్యగారు తన సంతోషాన్ని ప్రకటిస్తూ.

"దానికి అనంతరావుగారు, చిట్టిబాబుగారు, శంకరశాస్త్రిగార్ల వీణాత్రయం, మారెళ్ళవారు బాలమురళీగార్ల వాయులీనద్వయం, శ్రీనివాసన్, రమణిగార్ల ఫ్లూటు, ఎల్లావారు ఘటం, వారి శిష్యులు ఇతర చర్మ, తాళ వాద్యములు వాయిస్తున్నారు. కాని మృదంగ వాద్య సహకారులెవరూ పెద్దవారు లేకపోవడం మా దురదృష్టం," అని కొంతసేపు ఆగి మాధవయ్యగారి వంక చూశారు. ఆయనేదో అనబోయి ఆగిపోయారు. "శ్రీ వాణి ఎం.ఎస్. గార్ల గాత్ర సంగీతం. మరి........"

"మన ఏకలవ్యుడి ఉనికి చెప్పి పుణ్యం కట్టుకోండి." అంటూ మాధవయ్యగారి కాళ్ళమీద పడ్డాడు రామకోటిగారు. ఈ అకస్మాత్ సంఘటన మాధవయ్యగారు ఊహించలేదు. సంతోషం కలిగింది.

ఇలాంటి అవకాశం రావాలని ఆశించాడు. కానీ ఇంత త్వరలో వస్తుందనుకోలేదు మాధవయ్యగారు. శ్రీనివాసుల అభిమతం తెలుసుకోకుండా మాట ఇవ్వడం మంచిది కాదనిపించింది.

"ఇప్పుడేం చెప్పలేను. మళ్ళీ రండి" అని మాత్రం అన్నారు. మాధవయ్యగారి మాట ప్రకారం రామకోటిగారు వెళ్ళిపోయారు.






ఆ క్షణం నుంచీ మాధవయ్యగారి మనసులో సంకోచ సంతోషాలు పడుగు పేకగా తిరుగుతున్నాయి. సాయింత్రం త్వరగా అయితే బాగుండు అనిపిస్తోంది మనసుకు. మాటిమాటికీ ఎండ నీడ చూసుకుని కాలం కొలుచుకుంటున్నాడు మాధవయ్యగారు.

సీతమ్మ రాగానే "అమ్మా సీతమ్మా! ఇంకా పొద్దు దిగలేదా?" అని అడిగారు ఎన్నో మాట్లు,

శ్రీనివాసులు కోసం మాధవయ్యగారు ఎదురుచూస్తున్నారని తెలుసు సీతమ్మకు. ఎందుకంటే మాధవయ్యగారు రోజూ రాత్రులు వేసుకునే మందు అయిపోయింది. ఆ మందు లేకపోతే ఆయన రాత్రి నిద్రపోలేడు. నిద్ర పోకపోతే పోట్లు భరించలేడు.

"దిగలేదు. శ్రీనివాసులు మందు తెస్తాడు బాబుగారూ! మరిచిపోడు" ధైర్యం చెప్పింది. కానీ అడగటం మానలేదు.

"సీతమ్మా ఇలారామ్మా!" అని పిలిచి "నా పెట్టె తెరిచి నా పట్టుబట్ట ఎర్ర శాలువా ఇలా ఇయ్యమ్మా" అన్నారు. సీతమ్మ తీసి ఇచ్చింది. అవి అప్పుడు ఆయన కెందుకో అర్థంకాలేదు.

"సీతమ్మా! ఇదేనమ్మా నాకు మిగిలిన ఆస్తి. ఈ పాత పట్టుబట్ట. చిల్లులుపడ్డ ఎర్రశాలువా ఎవరికీ అమ్మలేదు. ఎందుకో తెలుసా? ఇవి ఎన్నో ఎన్నెన్నో సన్మానాలు చేయించుకున్నాయి. దీనికి వారసులు లేరు. అందుకని చివరికి నాపైన కప్పటానికి ఉంటుందని.... కాని...." ఏదో చెప్పాలనుకుంటుంటే గొంతుకేదో అడ్డుపడినట్లు పూడుకుపోయింది. ఈలోగా శ్రీనివాసులు వస్తున్నట్లు గమనించి సీతమ్మ ఎదురెళ్ళింది.

"ఏరా! గురువుగారికి మందు తెచ్చావా? పాపం బాధగా ఉన్నట్లుంది పదిమాట్లు అడిగారు." అంది, రోజూ కంటే ముందే వచ్చిన శ్రీనివాసులు ఇంట్లోకి రాకముందే.

శ్రీనివాసులు బాధతో తల దించుకున్నాడు.

"లేదమ్మా! మందు కొందామని డబ్బులు లెక్కపెడుతుంటే ఎవరో వెనక నించి వచ్చి ఎగరేసుకు పోయారమ్మా" అన్నాడు.

"ఇప్పుడెలారా! ఇంట్లో చిల్లిగవ్వ లేదు. ఇంట్లో నూకలు కూడా నిండు కున్నాయి. మనమైతే మంచినీళ్ళు తాగి పడుకుంటాం. అది మన కలవాటే, కాని ఆయన్నెలా పడుకోపెడతాం. ఎలాగోలా మందు తేవాలి. పాలు పండ్లూ తేవాలి," అంది.

కొద్దిసేపు ఆలోచించాడు శ్రీనివాసులు.

"అమ్మా! నా జీవితంలో ఎందుకూ పనికిరాని మృదంగాలు తొమ్మిదున్నాయి. ఇంతకాలం తాత జ్ఞాపకాలు అందులో దాచుకుని చూసుకుంటున్నానమ్మా. కాని తాత నన్ను అపార్థం చేసుకోడమ్మా! ఎవరికన్నా మేలు చెయ్యటమే ఆయనకి తెలుసు. అపకారికి కూడా ఉపకారం చెయ్యాలని చెప్పేవాడు. ఆ మృదంగాలమ్మేస్తే గురువుగారికి ఉపయోగిస్తే తాత సంతోషిస్తాడు పైనుంచే" అంటూ లోపలకు వచ్చాడు శ్రీనివాసులు. తల్లీ కొడుకుల సంభాషణ అంతా విన్నారు మాధవయ్య గారు. వారిద్దరి కున్నంత సంస్కారం, త్యాగం ఇసుమంత కూడా తనలో లేదనిపించింది. తన కిక మందు అనవసరమనిపించింది.

"నాయనా శ్రీనివాసులూ! ఇలా దగ్గరకురా నాయనా!" అని పిలిచారు. శ్రీనివాసులు దగ్గర కెళ్ళాడు.

"నాయనా! నామాట కేనాడూ ఎదురుచెప్పని వాడివి. ఈ రోజూ ఎదురు చెప్పవని నాకు నమ్మకముంది. నాదొక కోరిక. అదే నా చివరి కోరిక. కాదనవు కదూ?" అర్థించారు మాధవయ్యగారు. శ్రీనివాసులు కరిగిపోయాడు.

"చెప్పండి గురువుగారూ! మీకు సంతోషాన్నిచ్చేది ఏదైనా చేస్తా. చెప్పండి" అంటూ తొందర చేశాడు.

"నాయనా! ఇంతవరకూ అన్నీ నీ దగ్గిర తీసుకున్నానే కానీ నీకేమీ ఇవ్వలేక పోయాన్నాయనా! నువ్వు నీ మృదంగాలు అమ్మొద్దు. ఈ పాపిని ఇంకా పాపాత్ముడ్ని చెయ్యొద్దు. నేను నీకు గురువునని చెప్పుకునే అర్హత నాకు లేదు. కాని నిన్ను చూసి గర్వపడే అవకాశాన్ని కల్పించమని అర్థిస్తున్నానయ్యా! రేపు త్యాగరాయస్వామివారి ఆరాధనోత్సవాల్లో మృదంగం వాయించాలి. అదే నా చివరి కోరిక. తీరుస్తావా శ్రీనివాసులూ!" కన్నీళ్ళతో ప్రాధేయపడ్డారు మాధవయ్యగారు.

సీతమ్మ వారి అన్ని మాటలూ వినలేదు, కాని చివరి వాక్యం విని ఉలిక్కి పడింది. ఆమెకు మాధవయ్యగారి మీద చెప్పలేనంత ద్వేషం పుట్టుకొచ్చింది.

"ఛీ! దరిద్రుడా! మృదంగం వాయిస్తే వాడు చచ్చిపోతాడని తెలిసి వాడి సావు కళ్ళారా చూడాలనేదా నీ పాడుకోరిక. వాడు చిరకాలం బతకాలని తన ఆయుషు కూడా వాడికే ఇయ్యమని దేవుణ్ని ప్రార్థించి అర్ధంతరంగ కన్ను మూశాడు, మాకేమీకాని మా నాయన, వాడి తాత. కాని నువ్వో! వాడి పాలిట శనివి. యమధర్మరాజువి. ఎన్ని కష్టాలొచ్చినా నీ కోసం ఏదైనా చెయ్యటానికి ఎనకాడడు, నా బిడ్డ. గొడ్డుమోతోడా! బిడ్డలమీద ప్రేమ నీ కెక్కడిదిరా! వాడు వాయించడు." సీతమ్మ పిచ్చిదానిలా తిట్టేసింది. ఆయనంటే గౌరవం పోయింది ఆమెకు. శ్రీనివాసులు ఎంత వారించినా సీతమ్మ వినలేదు. మాధవయ్య గారు నోరెత్తలేదు. సిగ్గుతో తల దించుకున్నారు. ఇంకా తిట్టాలనుకున్నారు.

"అవును సీతమ్మా! నేను శ్రీనివాసుల పాలిట శనినే. కాని ఒక్కొక్కసారి శని కూడా మంచి చేస్తాదమ్మా! ఈ ఒక్క అవకాశం నాకు ఇన్నాళ్ళకు దొరికింది. శ్రీనివాసులు మృదంగం వాయిస్తే చనిపోడమ్మా! అతను ఆర్జించుకున్న విద్యని నాకు గురుదక్షిణగా దానంచేసి మీతో అలా చెప్పాడు. దానం తీసుకున్నవారికి తిరిగి ఇచ్చే అర్హత, హక్కూ ఉన్నాయి. అందుకే శ్రీనివాసులు నా కిచ్చిన మృదంగ వాద్యం, తిరిగి వాయించమంటున్నానమ్మా.

"కానుగోలు శబ్దంతో శ్రీవాణిని ఆకట్టుకుని పేరు తెచ్చుకుంటున్నాడన్న కుళ్ళుతో వారిద్దరినీ విడతియ్యాలని కట్టుకథ అల్లాను.

"ఇంతచేసినా నామీద గౌరవం, భక్తి ఇసుమంత కూడా తగ్గలేదు. అదే నాలో పరివర్తన తెచ్చిందమ్మా. శ్రీనివాసులు నిస్వార్థపరుడు. త్యాగశీలి. వినయ విధేయతలు కలవాడు. భక్తి, శ్రద్ధ, కార్యదీక్ష. పెద్దల ఎడ గౌరవం ప్రేమ కలవాడు. కళాకారుడికి కావలసిన లక్షణాలన్నీ ఇతనిలో ఉన్నాయి. ఈ నిస్వార్థ కళాకారుడి నుంచి వేలాది కళాకారులు ఉద్భవిస్తారు. ఆ నమ్మకం నాకుంది.

"శృతిలయలు విడదీయాలని విశ్వప్రయత్నం చేశాను.

"నాయనా శ్రీనివాసులూ! ఒక్కసారి కరువుతీరా మృదంగం వాయిస్తావా నాయనా! ఈ పాపి చివరి కోరిక అదే! తీరుస్తావా శ్రీనివాసులూ!" జాలిగా అర్థిస్తున్న మాధవయ్యగారి కోరిక తీర్చననే మూర్ఖత్వం, ధైర్యం శ్రీనివాసులుకు లేవు. కాని శ్రీనివాసులు మనసులో బాధ పైకి చెప్పలేనిది. ఆరోజు.

'రాళ్ళుకొట్టి బొబ్బలెక్కిన చేతుల్తో వాయించలేనని చెప్పి మీ మనసు నొప్పించలేను గురువుగారూ! మీ కోసం వాయిస్తా. మీ సంతోషం కోసం నేనేమైపోయినా వాయిస్తా. మీరు వొద్దన్నదాకా వాయిస్తూనే ఉంటా. అదే మీకు సంతృప్తినిస్తే అదే నా జన్మకు చాలు' అనుకున్నాడు మనసులో. మృదంగ తెచ్చి గురువుగారి ముందు కూర్చుని, మాధవయ్యగారికి నమస్కరిస్తూ

"గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుః" అంటూ శ్లోకం చదివాడు. ఆ శ్లోకం వింటుంటే మాధవయ్యగారి హృదయం కుంగిపోయింది. తను ఆ నమస్కారానికీ గురుపదానికీ అనర్హుడనని దుఃఖం ముంచుకొచ్చింది.

తదనంతరం శ్రీనివాసులు మృదంగం మీద శివతాండవ శబ్దాలు పరవశించి వాయిస్తుంటే మాధవయ్యగారు ఆనందంతో ఎక్కి ఎక్కి ఏడ్చేశారు. కాని అంతలో తుప్ తుప్ మన్న శబ్దం వచ్చి మృదంగం వంక పరిశీలనగా చూశారు. శ్రీనివాసులు చేతుల నుంచి రక్తం కారి కుడిఎడమలు రక్తంతో తడిసిపోయాయి. కాని శ్రీనివాసులు బాధతో కళ్ళు మూసుకుని వాయిస్తూనే ఉన్నాడు. మాధవయ్య గారు అదిరిపోయారు.

'నా చివరి కోరిక కూడా క్రూరమైనదేనా భగవంతుడా! నన్నెందు కిట్లా శపించావు స్వామీ!' అని బాధపడుతూ—

"శ్రీనివాసా! ఆపు నాయనా! ఆపు" అంటూ అరిచారు. శ్రీనివాసులు ఉలికిపడి వాయిద్యం ఆపేశాడు.



"నాయనా! నేను అభినవ ద్రోణుడ్ని. ద్రోహిని. పాపిని. నువు నిజంగా ఏకలవ్యుడవే నాయనా! నీ గురుభక్తి అమోఘం. నీకేం కావాలో కోరుకో నాయనా." అన్నారు.మాధవయ్యగారు తనేమీ ఇవ్వలేని స్థితిలో ఉన్నా శ్రీనివాసుడు

మళ్ళీ మృదంగం వాయించే వరమిమ్మని అడుగుతాడనీ, అప్పుడు తను శ్రీనివాసుల్ని బంధవిముక్తి చేసి పాపపరిహారం చేసుకోవచ్చనీ అలా అడిగాడు. కానీ శ్రీనివాసులు అంత తేలిక మనసు కలవాడు కాదు. మృదంగం పక్కనే పెట్టి, "మీ ఆశీర్వచనం ఒక్కటే నాకు రక్ష. ఆశీర్వదించండి" అంటూ వొంగి కాళ్ళు పట్టుకున్నాడు తన చేతుల్తో. ఆయన పాదాలు రక్తసిక్తమైనాయి. మాధవయ్యగారు శ్రీనివాసుల భక్తికి తట్టుకోలేకపోతున్నారు.

"శ్రీనివాసులూ! నా పాపానికి పరిహారం రక్తతర్పణమా నాయనా! నిన్ను దీవించవలసిన రోజుల్లో చేతులున్నా మనసు రాలేదు. ఇప్పుడు మనసున్నా నిండుగా దీవించవలసిన నా చేతికి అర్హత లేదని భగవంతుడు దాన్ని తుంచేశాడు.

"ఆనాడు ఏకలవ్యుడి వేలు కోసి ఇమ్మని అడిగిన ద్రోహి ద్రోణుడికి భగవంతుడు ఏ శిక్ష వేశాడో వ్రాయలేదు వ్యాసుడు. కాని నీకు నేను చేసిన అన్యాయానికి ఇప్పటికిప్పుడే తులతూచి నాకు ఇచ్చేశాడు భగవంతుడు. ఒకరికి అన్యాయం చేస్తే అనుభవం తప్పదు నాయనా! నా మనసు, నీ ప్రేమ, భక్తి, ఆరాధనలతో పునీతమైంది. దీవిస్తా స్వీకరిస్తావా నాయనా! మళ్ళీ నువ్వు మామూలుగా ప్రపంచం లోతుల్లోకి వెళ్ళి సంగీత సాగరాన్ని మథించు నాయనా" అన్నారు మనస్ఫూర్తిగా. అప్పుడే అక్కడికి వచ్చిన విశాలాక్షిగారు, రామకోటి గారు ఆనంద బాష్పాలు రాల్చారు. శ్రీవాణి శ్రీనివాసులు రెండు చేతులూ తన రెండు చేతుల్లోనే తీసుకుని కళ్ళకద్దుకుంది.

సీతమ్మ దీపం ఒత్తి పెకెత్తింది. ఆ గుడిశంతా వెలుగుతో నిండిపోయింది.



# ఒక రైలు కథ



## టి. రామమోహన్

రేపు పదకొండు గంటలకు ఇంటర్వ్యూ. ఈరోజే ఎమ్.ఎ. పరీక్షలు ముగిసాయి. రేపటికల్లా హైదరాబాదు చేరుకోవాలి.

ఇంటికి రాగానే గబగబా బట్టలు సర్దుకున్నాను. మూడు గంటలకు హైదరాబాదు వెళ్లే వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్ అందుకోవాలి. భోజనం చేయాలనిపించలేదు. టిక్కెట్టు రిజర్వు చేయలేదు. వెంటనే స్టేషను చేరుకున్నాను....పరీక్షల ధ్యాసలోపడి రిజర్వేషన్ చేయించాలన్న విషయాన్ని గూడా మర్చిపోయాను.

కౌంటరు దగ్గరికెళ్లి బెర్తు దొరుకుతుందో, సీటు దొరుకుతుందో ననుకుంటూ క్యూలో నిల్చున్నాను. ఊహూ....! బెర్తూ లేదు, సీటూ లేదు! సరే జనరల్ కంపార్టుమెంటులో వెళ్లాలి. అందులో కనీసం నిలుచోడానికైనా స్థలం దొరికితే సంతోషం! అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ లాంటిదేదైనా వుండి ఏఏ దేశం గత సంవత్సరాల్లో అభివృద్ధి సాధించిందని విచారిస్తే భారతదేశం ఒక్క విషయంలో మటుకు ప్రపంచంలోనే

ప్రథమ స్థానాన్ని అలంకరిస్తుంది।। ఎందులో?.... జనాభివృద్ధిలో।।

ప్లాట్‌ఫారంపై అటూ ఇటూ తిరుగుతున్నాను. ఇంతలో ట్రైను వచ్చి ఆగింది. జనాలు తోసుకుంటూ ఎక్కడం ప్రారంభించారు. జనరల్ కంపార్టుమెంటు వెదుక్కుంటూ వెళ్తున్నాను. ఇంతలో "ఒరేయ్, సుధాకర్....ఆగరా .... ఆగు" అంటూ ఎవరో వెనకనించి పిలవడం విన్పించింది.

ఆగాలనిపించలేదు. ఆలస్యం చేస్తే అక్కడ దొరికే సీటైనా దొరకదు. ఎవడో తెలిసిన పనిలేని ప్లాట్‌ఫారం పక్షి పిలుస్తూంటాడు. ఏముంది। చదువైన తర్వాత ఉద్యోగం ఎలాగూ రాదు. ఇంట్లో కూర్చుని ఈగలు తోలుకోలేరు. అదైనా ఎంత సేపని చేయగలరు. మధ్యాహ్నానికి రోడ్ల సర్వే పూర్తవుతుంది. సాయంత్రం పూట పొద్దు పోపడానికి అలా ప్లాట్‌ఫారంపైన పచార్లు, ఇక్కడ మామూలే. నేను మరింత వేగంగా ముందుకు వెళ్ళాను.

వెనక పిల్చినవాడు భుజంపట్టి మరీ ఆపాడు.తప్పదనుకొని వెనక్కి తిరిగాను.

రమేష్....! ఎగాదిగా చూశాను. చూడగానే తెలుస్తోంది.... వీడు టికెట్ కలెక్టర్‌ని.... ఒకసారి కలిసినప్పుడు చెప్పినట్టు గుర్తు. గ్రాడ్యుయేషన్ అయిన తర్వాత రైల్వే సర్వీస్ కమీషన్ ప్యాసు అయ్యాననీ, ఇంటర్వ్యూ పాస్ చేయించడానికి మంచి రికమెండేషన్ కూడా వుందనీ.... మరి ఇన్ని అర్హతలున్న వీడికి కాక మరెవరికి వస్తుంది ఉద్యోగం। మనిషి బాగా దర్జాగా వున్నాడు. ఎవరో అన్నట్టు గుర్తు.... రైల్వే ఉద్యోగి, రాజుగారి బొమ్మర్ది.... ఇద్దరూ ఒకే కోవకు చెందుతారట.

"ఏరా పిలుస్తూంటే అలానే వచ్చేశావు। వినబడలేదా ఏం?" అన్నాడు కొంచం కోపంగా.

"లేదురా. అర్జంటుగా హైదరాబాదు వెళ్తున్నాను. రిజర్వేషనులేదు. అందుకని జనరల్ కంపార్టుమెంటు వెదుక్కుంటున్నాను" అన్నాను.

"రిజర్వేషను లేదా? అబ్బ మరీ రష్‌గా వుందే! సరే బెర్తు కావాలా?" అన్నాడు.

ఏప్పినట్లుంది వీడి ప్రశ్న. నాలుగు రోజుల్నుండి అన్నంలేనివాడి దగ్గరికెళ్ళి నీకు భోజనం కావాలా?.... అని అడిగినట్లుంది. అయినా వీడు తప్పకుండా నాకో బెర్తు ఇప్పించగలడనే నమ్మకం కలిగింది.

"సరే,రా." అంటూ తీసుకుపోయాడు. పైపు చేసిన పేపర్లు అటూ, ఇటూ తిప్పి "పాకాలవరకూ ఏ కంపార్టుమెంటులో రా. అక్కడ నీకో బెర్తు ఇప్పిస్తా," అన్నాడు.

సరే. తప్పదు. నీటముంచినా పాల ముంచినా నీదే భారం అనుకొని సూటు

కేసు ఒక మూల వుంచి కంపార్టుమెంటు తలుపు దగ్గర నిల్చున్నాను.

ట్రైను బయలుదేరింది. అందరూ వాళ్ళ వాళ్ళ సీట్లలో సెటిల్ అయిపోతున్నారు. నేను మహా గిల్టీగా ఫీలవుతున్నాను. ఏదో టికెట్టు దొంగగా ప్రయాణం చేస్తున్నానేమో అన్నట్లు అక్కడున్నవాళ్ళు చూస్తున్నట్టు అనిపించింది. మన ప్రజల్లో కొన్ని ప్రత్యేకతలున్నాయి. దొంగైనా సరే కాలు మీద కాలేసుకొని ఠీవిగా కూర్చుని రాజకీయాలో, సినిమాలనో గురించి అనర్గళంగా ఉపన్యాసం ఇస్తూంటే నోళ్లు వెళ్ళబెట్టుకొని మరీ వింటారు. మధ్య మధ్యలో దొంగలను గురించి, వాడు చూసిన వింత దొంగతనాల్ని గురించీ వివరిస్తాడు. అందరి సం దే హా ల్నీ తీరుస్తాడు.... వీలుదొరికితే రెండు సూటు కేసుల్ని పట్టుకొని చక్కాపోతాడు.... అందరూ కూర్చుని ఒకడు నిలబడితే వింతగా చూస్తారు, అందరూ నిలబడి ఒకడు కూర్చుని వుంటే మరింత వింతగా చూస్తారు. ఇది మనుషుల్లో వుండే ఒక రకమైన బలహీనత.

పాకాల ఎప్పుడొస్తుందా అని ప్రార్థిస్తూ నిల్చున్నాను. రైలు పాకాల జంక్షన్‌లో ఆగింది. గబగబా సూటు కేసుతో సహా దిగి కంపార్టుమెంటు ముందర నిల్చున్నాను రమేష్ కోసం వెయిట్ చేస్తూ.

రమేష్ వచ్చాడు. రాగానే "వెళ్లి నలభై రెండవ సీట్లో కూర్చో" అన్నాడు.

"వెళ్ళి కాఫీతాగి వద్దాం రా" అన్నాను.

బయల్దేరాం. రమేష్ వెంట ఒక అమ్మాయి కూడా రావటం అప్పుడే గమనించాను. చేతిలో సూట్‌కేసు వుంది. ఈమె కూడా సీటుకోసం వచ్చుంటుందని అనుకున్నాను.

"ఏరా, ఇంత అర్జంటుగా హైద్రాబాదు వెళుతున్నావు?" అన్నాడు రమేష్.

వాడితో అబద్ధం చెప్పాలనిపించలేదు. "ఇంటర్వ్యూ ఉందిరా. ఈరోజే పరీక్షలు ముగిసాయి. అందుకనే ఈ హడావుడి" అన్నాను.

"బై దిబై చెప్పడం మర్చాను. ఈమె గీత, మా కజిన్ సిస్టరు. హైదరాబాదు దాకా వస్తుంది." అన్నాడు రమేష్.

"గ్లాడ్ టు మీట్ యూ" అన్నాను.

ఆమె సమాధానంగా ఏదో అంది. కాని వినబడలేదు.

కాఫీ ముగించి నలభై రెండవ సీటు దగ్గర చేరుకున్నాను. వెనకనే ఆ అమ్మాయి, రమేష్ వచ్చారు. ఆమె నలభై అయిదవ సీటులో కూర్చుంది.

రైలు కదిలింది.... నేను అప్పుడే కొన్న మాగజైను తిప్పుతూ కూర్చున్నాను. చదవాలనిపించలేదు.

"ఏమండీ. ఆ మాగజైను కొంచెం ఇస్తారా?" అంది.

"కొంచెం అంటే సగం ఇవ్వ మన్నారా?" అన్నాను నవ్వుతూ.

"జోకులు కూడా బాగావేస్తారే!" అంది నవ్వుతూ.

"ఇందాక ఏదైనా బాగా 'వేయడం' చూశారా? జోకులు కూడా అంటున్నారు" అన్నాను కొంచెం వ్యంగంగా.

"చూశాగా ఇందాకా!" అంది.

ఆశ్చర్యమేసింది. ఏం చూసిందబ్బా అనుకుంటూ "చెప్పండి నాకేమీ తోచడం లేదు" అన్నాను.

"ట్రైను ఎక్కగానే మీ సూటుకేసును విసురుగా క్రింద 'వేయడం' చూశాగా" అంది.

గడుసు అమ్మాయే. 'గీత' పేరు బాగుంది. పేరేకాదు మనిషీ అందంగా వుంది. ఈమెను పెళ్ళాడాలని ఎవడి నుదుటి 'గీత'లో రాసుందో.

"మీరు ఇంటర్వ్యూకి వెళ్లుతున్నారా?" అంది మళ్ళీ మాట మారుస్తూ.

"అవునండీ." అన్నాను.

"ఎక్కడ" అంది.

"ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా."

"ఓహో అలాగా. మీరు గ్రాడ్యు యేటా?" అని ప్రశ్నించింది.

ఈ అమ్మాయి నన్ను ఇక్కడే ఇంటర్వ్యూ చేసేటట్టుంది. మళ్లీ మళ్లీ ప్రశ్నలు ఈమెకు మిగల్చకూడదను కొని—

"పోస్టు గ్రాడ్యుయేషన్‌ను ఈ సంవ త్సరమే ముగిస్తున్నాను. ఇంటర్‌లో ఫస్ట్‌క్లాస్, బి. ఏ. లో ఫస్ట్‌క్లాస్, ఆపైన ఎమ్. ఏ. ఎకనామిక్స్ ప్రీవియస్ ఫస్ట్ క్లాస్. ఫైనల్‌లో ఫస్టుక్లాసు తప్పకుండా వస్తుంది. ఇవికాక పైపు హయ్యర్, షార్టుహాండు లోయర్ పాసయ్యాను," అన్నాను గబగబా ఆపకుండా.

"అలాగా!" అంది కళ్లు ఇంత పెద్దవి చేస్తూ.

కళ్లు చాలా అందంగా వున్నాయి. ఇలాంటి కళ్ళలోకి కళ్లుపెట్టి చూడాలని పిస్తుంది. అలా చూసినవారే కాబోలు కడకు కాంతాదాసులైపోయారు. మంచి కంపెనీ ఇప్పించినందుకు మనసులోనే రమేష్‌కు ధన్యవాదా లర్పించుకున్నాను.

ట్రైను ధర్మవరంలో ఆగింది.

"ఏమైనా తింటారా?" అన్నాను—

"గడ్డితప్ప మిగతా అన్నీ తింటా నండీ. కానీ ఈ రైల్వే రెస్టారెంట్స్‌లో గడ్డి తప్ప మరేదీ దొరకదు. మీకంత శ్రమెందుకులెండి. నా దగ్గర పళ్ళు, బిస్కట్లు వున్నాయి. చాలు" అంది నవ్వుతూనే.

నేను బయటకు వెళ్లాను. రైలు బయలుదేరుతుందనగా వచ్చి కూర్చు న్నాను. ప్రక్క సీట్లవాళ్లు వాళ్ళ బెర్తుల్ని దించుకోవాలని ముందు స్టేషన్లో నుంచీ ఒకే విసుక్కుంటున్నారు. ఇహతప్పదు. త్రీటయర్ కంపార్టుమెంటు నల్లభై

రెండు, నలభై ఐదు క్రింద వరుస బెర్తులే. అందుకని పడుకొని మాట్లాడు కున్నా ఇబ్బందిలేదు.

కుడివైపుకు తిరిగి పడుకున్నాను; గీతతో అలాగే రాత్రంతా మాట్లాడాలని పించింది.

"మీకు ఏదంటే ఇష్టమండి, ఐ మీన్ రాజకీయాలా ? సినిమాలా ? ఆర్టా ? సంగీతమా?" అన్నాను, నాకేదో మహా ఇష్టమున్నట్లు.

"నాకు ఆర్టులో మోడరన్ ఆర్టు అంటే భలే ఇష్టం. ఎందుకో తెలుసా? మనం వేసిన బొమ్మ ఎవరికీ అందంగా కనిపించకపోయినా, అందులో తలాతోకా లేకపోయినా, నో ప్రాబ్లం. కళ్ళు మూసుకొని బాగుందంటారు. బాగాలేదని చెప్పే దమ్ములు ఎవరి కుంటాయ్? అలా చెప్పా రంటే వాళ్లే ఫూల్స్ అయిపోతారు." అంది గలగలా నవ్వుతూ.

"మరి మీకు?" అంది.

"నాకు.... నాకు.... ఇంటర్నేషనల్ పోలిటిక్స్ అంటే ఇష్టం" అన్నాను. కొంపదీసి ఏదైనా డౌట్ అగడుగదు గదా అనుకొని....

అలా మాట్లాడుతూనే నిద్రపట్టేసింది. తెల్లవారి లేచి చూస్తే సికింద్రాబాదులో వుంది ట్రైను. అప్పటికే ఆమె తన సామాన్లు సర్దుకొని కూర్చొనుంది.

"చాలా థ్యాంక్సండీ!" అంది. ఎందుకో మరి. బహుశా మంచి కంపెనీ ఇచ్చాననుకుంది కాబోలు.

అదేమాట అంది. "మీరుచాలా మంచి వారండీ. ఈ కాలంలో అబ్బాయిలు అమ్మాయిని ఒక ఫర్లాంగు దూరంలో చూడగానే వంకర్లు తిరిగిపోతారు. మీరు ఇసుమంత అసభ్యంగా ప్రవర్తించ కుండా మంచి సంస్కారవంతులనిపించు కున్నారు. ఐ లైక్ యు వెరీమచ్...." అంది.

గాలి కొట్టిన్న బెలూన్‌లా అయిపో యాను. సరే ఆ అమ్మాయి ఇన్ని మాటలు చెప్తే నేనూ ఒక్కమాటన్నా చెప్పకుండా పోతే బాగుండదని "నే నిలా సభ్యతగా, సంస్కారంగా ప్రవర్తించడానికి కారణం మీలో నాకంటే ఎక్కువ సభ్యత, సంస్కారం వుండటమే" అన్నాను.

"మాశారా! ఆడది తన హద్దులు దాటనంతవరకు మగవాడికి పైన కనీసం చెయ్యివేసే ధైర్యం వుండదండి. కనీసం ఒక వేలు తగిలే అవకాశం ఇచ్చినా ధైర్యంగా కాలుకూడా వేయగలడు" అంది పురుషులపైన రీసెర్చి చేసినట్లు.

"మీరు చాలా ఫ్రీగా మాట్లాడుతా రండి." అన్నాను ఏదో మెచ్చుకుంటు న్నట్లుగా.

"ఫ్రీగా కాక దానికీ డబ్బిచ్చుకోమం టారా?" మీ మగవాళ్లలో మనీమైండెడ్ నెస్ ఎక్కువయిపోతూందండి. ఇప్పుడు

ఆడది తనకు కావాల్సిన, ఆప్తులైన వారందర్నీ వదులుకొని వస్తున్నా, లక్ష్మీదేవిలాంటి స్నేహితురాల్ని మాత్రం తనతో నే తీసుకురమ్మంటున్నారు కాబోయే భర్తలు. ఇంకొన్ని రోజులకు ఫ్రీగా మాట్లాడటం పోయి మాటకింత అని వసూలుచేసినా చేస్తారు," అంది ఆవేశంగా.

అమ్మ బాబోయ్.... ఈ అమ్మాయి ఏ స్త్రీ అభ్యుదయ సంఘ సభ్యురాలో అయ్యుంటుంది! అయినా పాపం ఈ రోజుల్లో కట్నాలు అమ్మాయిల పాలిట ఒక శాపం మాదిరి తయారయ్యాయి. అందుకని తను కట్నం తీసుకోకుండా పెళ్లిచేసుకోవా లనుకుంటున్నాడు. ఈ అమ్మాయి ఇంత ఘాటుగా మాట్లాడ టంలో ఒక అందం వుంది.

ఫ్రాంక్‌గా మాట్లాడేవాళ్ళు అంటే నాకు మొదట్నుంచీ అభిమానం....

హైదరాబాదు వచ్చేసింది.

"వెళ్ళొస్తానండి. అనుకోకుండా కల్సు కొన్నాము. కలుసుకోక ముందు మీకు నేను, నాకు మీరు తెలియదు. తెలుసు కున్న తర్వాత అనుకోకుండా కలుసు కుంటే మన అదృష్టం. ఉంటాను మరి, బై .... సీయూ...." అంటూ గబగబా వెళ్ళిపోయింది.

గీత నిజంగా గలగలా పారే సెల యేరు లాంటిది. తీగ మీటితే కమ్మని రాగం. గీతాగానం చేసుకుంటూ స్టేషన్ బయటకు వచ్చాను.

* * *

హైద్రాబాదులో మిత్రుని రూము వెదుక్కుంటూ బయలుదేరాను. వస్తానని ముందుగా ఉత్తరమన్నా వ్రాయలేదు. నేను రూముకు వెళ్ళేసరికి సరిగ్గా బయల్దేర బోతూ వున్నాడు. అదృష్టం బాగుంది. వాడు వెళ్ళిపోయి వుంటే వాణ్ణి వెదు క్కుంటూ మళ్ళ.... ఉన్న టైము తక్కువే,మూడు ముక్కల్లో విషయాన్ని చెప్పేసి, నేను వెంటనే తయారై వస్తానని గబగబా బాత్‌రూమ్ వైపు వెళ్ళాను.... ఐదు నిమిషాల్లో తయారై బట్టలు వేసుకొని ఫైలుకోసం బ్యాగులో చెయ్యిపెట్టాను.... అంతే.... షాక్ తిన్నాను.... ఫైలు కనపడలేదు. గబగబా బట్టలు బయటికి లాగి సూటుకేసును త్రిప్పించి, మర్లించి, బోర్లించి వెదికాను.

ఫైలు కనబడలేదు. అందులోనే ఇంటర్వ్యూకి కావాల్సిన కాగితాలన్నీ వున్నాయి. పిచ్చివాడ్నయిపోయాను. అందులోనే డబ్బు వుంది.

నా వాలకం చూసిన మిత్రుడు శాస్త్రికి అర్థంకాక "ఏమయ్యిందిరా? అలా అయి పోయావు!" అన్నాడు.

"అంతా అయిపోయిందిరా.ఇంటర్వ్యూ కెళ్లాలి గదా? అందుకు సంబంధించిన పేపర్స్ అన్నీ ఒక ఫైలులోపుంచి తీసు



కొచ్చాను. అది కనబడ్డంలేదే?!" అన్నాను దిగులుగా.

"ఇంట్లో మర్చిపోయావేమో?" అన్నాడు వాడు సందేహంగా.

"నోనో! నా ప్రాణాలన్నీ అందులోనే వుంచి తీసుకువచ్చాను."

వాడు నన్ను సమాధానపరిచాడు. పోతే పోయింది ఇంకో ఇంటర్వ్యూకు అటెండు కావచ్చు లెమ్మన్నాడు. అసలు జరిగిందేమో చెప్పమన్నాడు.

నేను మొదటి నుంచీ చివరిదాకా జరిగిందంతా చెప్పాను.

"అయితే ఆ అమ్మాయికి తప్ప ఎవరికీ అవకాశం లేదు. అందులోనూ దొంగలైతే మొత్తం సూట్‌కేసు తీసుకొనిపోక ఫైలు మాత్రం ఏం చేసుకుంటారు? ఆ అమ్మాయి రమేష్ కజిన్ సిస్టరు కదూ వాడు కనబడినప్పుడు విచారిద్దాంలే" అన్నాడు శాస్త్రి

రమేష్ వాడికీ బాగా తెలిసిన మిత్రుడే.

రెండు రోజులు హైద్రాబాదులోనే గడిపి తిరిగి ఇంటికి వచ్చేశాను కొంత డబ్బు వాడి దగ్గర అప్పుగా తీసుకొని.

* * *

ఆ అమ్మాయి గీత నా ఫైలు కాజేసింది. ఇందులో సందేహం లేదు. ఛీ....! ఛీ....! ఎంత బాగా మాట్లాడింది. పైగా సభ్యత, సంస్కారంపై చర్చలు. బహుశా ఆమెకు నేను ఇంటర్వ్యూకి వెళ్ళడం ఇష్టంలేదు లాగుంది. రమేష్‌ను అడిగి అడ్రసు తీసుకొని వెళ్ళి బాగా దులిపేయాలి అని నిశ్చయించుకున్నాను.

స్టేషను కెళ్ళాను. రమేష్ ఇప్పుడు వేరే రూట్‌లో వెళుతున్నాడట-ఇంకొన్ని రోజుల తర్వాత ఇటువైపు వస్తాడట. కొన్ని రోజులు ఆగుదామని నిర్ణయించుకొన్నాను.

ఒకరోజు రమేష్‌ను కలుసుకోగలిగాను.

"ఒరేయ్! నీవు నాకు ఇంత మోసం చేస్తావనుకోలేదురా?" అన్నాను.

"ఏమిట్రా ఏమయింది! ఎందుకలా వున్నావు?" అన్నాడు రమేష్.

"నాకు అర్జంటుగా ఆ అమ్మాయి అడ్రసు ఇవ్వు" అన్నాను.

"ఏ అమ్మాయి?" అన్నాడు ఏమీ తెలీనట్టు.

"అదే, ఆ రోజు ట్రైనులో నాతో కలిసివచ్చిందే ఆ అమ్మాయి. మీ కజిన్ సిస్టరన్నావుగా!"

"ఇంతకూ ఏమయిందిరా? అడ్రసు ఎందుకు?" అన్నాడు అతిమామూలుగానే.

జరిగిందంతా చెప్పాను. "ఒరేయ్ అందులో ఖర్చులకని తీసుకపోయిన డబ్బు కూడా వుంచాను. మన శాస్త్రిగాడు అక్కడ లేకుంటే హైద్రాబాదులో బిచ్చం ఎత్తుకోవలసి వచ్చేది. ఏ ప్రెస్ ఫోటోగ్రాఫరు కంట్లోనైనా పడివుంటే అందమైన ఫోటో ఒకటి తీసి 'జంట నగరాల్లో బిజారుస' అనే శీర్షిక క్రింద ముద్రించేసి వుండేవాడు." అన్నాను కోపంగా.

"ఒరేయ్, నీకు బుద్ధి తక్కువై పోతోందిరా. గీత అలా చేసుండదు. నీకు అనుమానం ఎందుకు, నేను వెళ్ళినప్పుడు కనుక్కుంటానులే.... అంతగా నీకు అడ్రసే కావాలంటే రాసుకో" అన్నాడు కొంచెం కోపంగా.

అడ్రసు రాసుకొన్నాను.... గీత.... కొంచెం అయ్యుంటేనా 'గీత'నే మార్చేసి వుండేది. ఎంత తియ్యగా మాట్లాడింది. అయినా ఈ రోజుల్లో మోసాలు 'మసాలాల' మాదిరి తయారై పోతున్నాయి. ఇహ బుద్ధుంటే ఎప్పుడూ రైళ్ళలోగాని, బస్సుల్లోగాని ఎవ్వరితోనూ మాట్లాడకూడదని నాపై ఒట్టేసుకున్నాను.

ఆలోచించి.... ఆలోచించి ఒక ఘాటైన ఉత్తరం వ్రాయాలనుకొన్నాను. పది పేజీల ఉత్తరం తయారైంది. ఈ




ఉత్తరం చూసి.... ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకున్నా ఆశ్చర్యపడవలసింది లేదు. ఆశ్చర్యపడవలసిందల్లా ఎప్పుడంటే.... ఆమె ఆత్మహత్య చేసుకోలేదు అన్నప్పుడే. ఉత్తరాన్ని పోస్టులో పడేశాను.

....అదే రోజున నా పేర ఒక పార్శిలు వచ్చింది.... విప్పాను.... ఫైలు....! నా ఫైలు....!! అబ్బ దొరికింది. గబగబా తిప్పాను. చెక్కు చెదరలేదు. పైన ఒక ఎర్రటి కవరు వుంది. ఏముంది! క్షమాపణలు చెబుతూ వుత్తరం రాసుంటుంది. అసలు నా ఫైలుతో తనకేం పని? ఉత్తరం చదవాలనిపించలేదు. చించి పారేయాలనుకొన్నాను.

ఒక్క క్షణం.... ఆలోచించాను. అందులో ఫైలు తీసుకోవాల్సిన అవసరం ఏమిటో రాసుంటుంది. అదైనా తెలుసుకొందామని అనుకుంటూ ఉత్తరం విప్పాను.

"సుధాకర్ గారికి,

క్షమాపణతో.... మీ ఫైలు పంపుతున్నాను. ఆశ్చర్యపోతున్నారు కదూ! మీ ఫైలు దొరుకుతుందన్న ఆశ బహుశా మీరు వదిలేసి ఉండొచ్చు.

'ఆఁ.... పంపకేం చేస్తావ్. రమేష్ వచ్చి నాలుగు తగిలించి వుంటాడు. అయినా ఫైలు పైన ఆశ వదలడం ఏమిటి, ఇచ్చే వరకు చుప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించి వుండేవాణ్ణి.'

"...చిన్నవారైనా నన్ను క్షమించాలి. నా అవసరం కొద్దీ మీ ఫైలు తీసుకోవలసి వచ్చింది."

'ఏమిటి నాకంటె పెద్దదా? అలా కనపడదే! ఏమో ఆడవాళ్ళ అందాన్ని

అంచనా వేసినట్లు వయసును వేయలేం. ఇంతకీ నా ఫైలుతో ఏమి అవసర మొచ్చిందో చూద్దాం !'

"మీరు వెళ్తున్న అదే ఇంటర్వ్యూకు మా అబ్బాయి కూడా హాజరవుతున్నాడు. వాడు అన్ని క్లాసుల్లోను ఫస్ట్ రేంకులో ప్యాసైనా మీ కంటే కొంత తక్కువ చదువుతున్నాడు. ఇప్పటి పరిస్థితులలో వాడికి వుద్యోగం ఎంతో అవసరం. మీరు ఇంటర్వ్యూకు రాకపోతే వాడు తప్పక సెలెక్ట్ అవుతాడని నాకు నమ్మకం కలిగింది."

'ఏమిటీ పెళ్ళి కూడా అయిందా? ఒక అబ్బాయి కూడా వున్నాడా ?!'

"మీతో కలిసి ఆ రైలులో ప్రయాణం చేశాను. మీరు చెబుతున్నదంతా విన్నాను"

'పిచ్చాసుపత్రి నుంచి పారిపోయి రాలేదు కదా !'

"మీ ప్రక్క సీట్లో వున్న నేను మీరు నిద్ర పోయినతర్వాత మీ ఫైలు తీసు కొన్నాను.... కాదు దొంగిలించాను. మీరు ఇంటర్వ్యూకు వెళ్ళలేకపోయి నందుకు చాలా బాధపడివుంటారు. దీనికి పరిహారంగా నేను మీకు ఏం చేసినా తక్కువే. నా స్వార్థంతో మీకు అన్యాయం చేశాను. మీ ఫైలులో మీరు పెట్టిన డబ్బుతో మరికొంత డబ్బు చేర్చి అక్కడే వుంచాను. అవి మీరు హైదర బాదు ఖర్చుల క్రింద ఉంచుకోండి. మా వాడికి ఉద్యోగం వచ్చింది. మరొక్క సారి క్షమించమని అడుగుతూ....

గుణశేఖరరావు."

ఆ(....... ఒక్క క్షణం అలా నిశ్చేష్టుడైపోయాను.... విషయం అర్థ మైంది. మరి గీతకు రాసిన ఉత్తరం.... పరిగెత్తుకుంటూ పోస్టాఫీసుకు వెళ్ళాను.

ఉత్తరం మెయిల్లో వెళ్ళిపోయింది. ఇప్పుడెల్లా !? గీత ఉత్తరం చదువు కుంటే ?.... అమ్మో.... ఇక ఊహించ లేకపోయాను. గీత కళ్ళల్లో మెదిలింది. గబగబా ఇంటకెళ్ళి బ్యాగు సర్దుకొన్నాను.

మూడు గంటల వెంకటాద్రి ఎక్స్ ప్రెస్ అందుకోవాలి. రిజర్వేషన్ లేదు. జనరల్ కంపార్టుమెంటే గతి....

హైదరాబాదు చేరేవరకు నోరెత్తితే ఒట్టు....





# సమిధలు

డి. శిరీష

"మా ఇంటి కెళ్లిపోతానమ్మగారూ."

ఆ అభ్యర్థన వినబడనట్లు నటించాలని కూర గట్టిగా కలియబెట్టింది. పక్కస్టౌమీద కూత పెడుతున్న కుక్కరు దించివేసింది. స్టౌ మంటల్లాగానే టయిమయిపోతుందనే ఆదుర్దాతో మనస్సు ఎగిసిపడుతోంది అయాసంతో. ఒక్కోసారి పిచ్చెక్కుతుందేమో ఆ ఆదుర్దా భరించలేక అనిపిస్తుంది.

"అమ్మగారండీ!"

"ఏవిటే?"

"మా ఇంటి కెళ్తాను" వంటగది ఊడుస్తూ వేడికోలుగా చూసింది. మాణిక్యం. కళ్ళు మంకెనపూలులాగా ఉన్నాయి. ముక్కుపుటాలు అదురుతూ మాణిక్యం బాధని చూపిస్తున్నాయి. మళ్లీ దీనికేం తెగులొచ్చిందో అని మనస్సులో లక్ష తిట్లు తిట్టుకుంది సరళ. వెడతాను అని అందంటే ఇంకా రోజంతా అదే పాట, అదే ధ్యాస. ఈ పిల్ల ఈ పాట మొదలుపెట్టినపుడల్లా తన గుండెలు గుభేలుమంటుంటాయి.

టవలు, బట్టలు తీసుకుని బాత్‌రూంలోకి వెళ్ళబోతూ గట్టిగా అంది. "నీకేం చెప్పాను? ఇంకో ఆర్నెల్లవరకూ నిన్ను పంపొద్దని మీవాళ్ళు ఉత్తరం

---

**1980 చక్రపాణి ద్వితీయ అవార్డు పొందిన కథ**

---

ప్రాణాలే. కావాలంటే చూపిస్తాను. నే నెప్పుడయినా సెలవులు వచ్చినపుడు మా అత్తగారి ఊరుగాని వెడితే నిన్నూ తీసి కెడతాను. ఊరికే వసపెట్టకు" అంటూ ధడాల్న తలుపేసుకుంది.

గబగబా పంటిమీద నీళ్ళు దిమ్మరించుకుంటూ అమ్మయ్య ఇప్పటికెలాగో నోర్మూయించాను అని తేలిగ్గా ఊపిరి వదిలింది.

కడుపుదీరా నిద్రపోవాలని, తనివితీరా స్నానం చేయాలని, కమ్మటి భోజనం తాపీగా, తృప్తిగా తినాలని ఎంతో కోరిక తనకి. ఈ మూడుటిక యాంత్రికమైన బ్రతుకులో మృగ్యమే. తొందర,తొందర. ఎంతో విలువైన, అమూల్యమైన బ్రతుకంతా ఈ తొందరలో హడావుడిలో పడి వికృతమైపోతోంది. మాణిక్యంలాంటి పసిపిల్ల చేతికింద ఉంటూ బాబుని చూడడం వలన ఇంత మాత్రమైనా నిభాయించుకొస్తోంది. పసిపిల్ల దొరకనంత కాలం పొద్దుటి అన్నీ తెముల్చుకోలేక నరకయాతన పడేది. బాబుని కేర్ హోంలో వదిలి మళ్ళీ ఆఫీసు నుండి వచ్చే ముందు తెచ్చుకుని మళ్ళీ ఇంటి పనిలో జొరబడి, అబ్బో ఆ రోజులు గుర్తుకొస్తే ఎలా లాగిందా బండి అని ఆశ్చర్యంగా ఉంటుంది. ఈ పిల్ల ఉండడం వలన తమకి ఆర్థికంగానూ అన్ని రకాలుగా కలిసివస్తోంది. ఇది కాస్తా ఉడాయిస్తే తనకి దుక్కిచావే. ఈ పనికిమాలిన మహాపట్టణంలో పిల్లాడ్ని చూడడానికి ఏ ముండా దొరకదు.

బాత్‌రూం తలుపు తెరుచుకుని వచ్చేసరికి రాజు ప్రశ్నార్థకంగా చూస్తున్న చూపు, తడిసిన మాణిక్యం చెంపలా! ఏదో అడగబోయి భార్యవైపు చూశాడు. సరళ తీవ్రంగా మళ్ళీ చూసేసరికి తల వంచుకుని కంచంముందు కూర్చున్నాడు.

"అదేం అన్నంపూర్తిగా తినెయ్యి."

"వద్దు. టయింలేదు." హీల్స్ తొడుక్కుని మాణిక్యానికి రోజూ పాఠం పల్లించి ఆ పిల్ల అందించిన టిఫిన్‌బాక్స్ తీసుకుని బస్‌స్టాప్‌కి పరిగెత్తింది. అర్థాకలితో లేచిపోయిన భార్యని నిస్సహాయంగా చూడ్డం మామూలై పోయింది. అలా సరళ పొట్ట చేత్తోపట్టుకుని పరిగెట్టడంలో తన అపరాధమేదో చాలా ఉందనిపిస్తుంది. కాని ఆర్థిక బాధ ఇంతకంటె భయంకరమైంది. దరిద్ర దేవత నమిలి మింగి వేయడానికి కోరలు చాస్తూ తాండవం చేయడం తాను చూశాడు. అందుకే కొన్ని బాధ్యతలకోసం తమందరి భవిష్యత్ కోసం సరళ ఉద్యోగంచేయడం చాలా మంచిదనే అభిప్రాయంతో 'కనీసం సెలవుపెట్టి రెస్టుతీసికో సరళా, అనిగూడా అనలేని స్వార్థపరుడయిపోయాడు. రెండో చెల్లి పెళ్ళి తమని అప్పుల్లో ముంచింది. ఎంత అరిచినా, సాధించినా సరళకి స్వార్థం తక్కువకాబట్టి నీ వాళ్ళకెందుకు పెట్టాలి అని చిందులుతొక్కదు.

ఏమీ దాచుకోదు. కాని ఆమె పడే శ్రమ చూస్తుంటే ఇదేం బ్రతుకు అని విరక్తి కలుగుతోంది. కాని ఇంకో రకమైన పరిష్కారం ఎలా?

బాబుకి ముద్దిచ్చి సైకిల్ పెడల్ మీద కాలేశాడు. అమాయకమైన తడికళ్ళు వీపుకి గుచ్చుకుంటున్నట్టుగా ఫీలవుతూ రివ్వుమని వెళ్ళిపోయాడు.

"వెళ్ళిపోయారేవిటి?" సత్యం పళ్ళు విరుచుకుంటూ మాణిక్యం దగ్గర కొచ్చాడు. చేతిలో సెక్సు నవల, బొమ్మల బనియన్.... ఆడవాళ్ళందర్లో దేని కోసమో ఎప్పుడూ వెదుకుతున్న కళ్ళతో సెక్సుపాఠాలు నేర్చుకుంటున్న విద్యార్థిలా అవుపిస్తాడు సత్యం.

"ఎందుకేడుస్తున్నావ్?"

"మా యమ్మమీద బెంగపుడతంది. మా ఇంటి కెల్లాలి." ఆ పిల్ల వాపురు మంది. అయ్యయ్యో అంటూ గట్టిగా హత్తుకుని కళ్ళు తుడిచాడు. అతనొక్కడే తన గోడుని వినిపించుకునేవాడు అనిపించి మాణిక్యం వెక్కి వెక్కి పడింది. మళ్ళీ దగ్గరకు లాక్కున్నాడు. ఏమేమో చేశాడు. ఆ పిల్లని ముద్దుపెట్టుకుంటున్నప్పుడల్లా అతనికళ్ళు ఎర్రబడుతుంటాయి. ఇంకేదో చేయాలనే ఆవేశం, కసీ కలుగుతుంటాయి. పిచ్చి పిచ్చి పనులన్నీ చేసి ఏదో రకంగా తన తృష్ణ చల్లార్చుకుంటూ ఉంటాడు పాతికేళ్ళు నిండినా ఉద్యోగం రాని కారణంగా పెళ్ళికాని సత్యం.

చాలాసార్లు ఈ తంతు జరుగుతూనే ఉంటుంది. పదమూడేళ్ళు నిండబోతున్న మాణిక్యానికి ఏమీ అర్థమయ్యేదికాదు. తన తండ్రిలాగానో తాతలాగానో దగ్గరకు తీసుకుంటున్నాడ్లే అనిపించేది మొదట్లో. ఆ తర్వాత గట్టిగా వాటేసుకోవడం మొదలయ్యాక భయపడి సరళతో చెప్పింది. ఇంచుమించు తన వయస్సుకి దగ్గరగా ఇంతెత్తున భారీగా ఉన్న మనిషితో ఫ్రీగా మాటాడాలంటే బెరుకు, భయం ఆమెకు. ముభావంగా మాట్లాడడం తప్పిస్తే చనువుగా ఏమీ అనలేదు. ఆ పిల్లని ఎంతో అన్వేషించి అత్తగారు పంపారు. ఇప్పుడు చాలా పనికి తనకు నిశ్చింతంగా ఉంది. ఈ ఉతుకులు పరుగులు ఎలాగూ తప్పవ్. బాబుని బాగా చూస్తోంది. ఇల్లంతా పక్కాగా ఉంచుతుంది. ఈయన్ని ప్రేమించి వర్ణాంతర వివాహం చేసుకోవడంవల్ల చాలా బాధ్యతలు నెత్తినేసుకోవాల్సి వచ్చింది. అవసరానికో, నిజంగా అభిమానంతోనో మరి అత్తగారి తరఫున అందరూ తనని చాలా గౌరవిస్తారు. కాబట్టి తను వాళ్ళతో ఏ గొడవ తెచ్చుకున్నా శ్రేయస్కరం కాదు.

"నేనుండనమ్మగారూ మా ఊరెల్లిపోతా."

"ఏం అటువంటిదానివి ఎందుకొచ్చావసలు? వేషాలేస్తున్నావా? మీ ఊరు రెండొందల మైళ్ళ దూరం తెల్సా?"

తనతో వచ్చేటప్పుడు చాలా హుషారుగా బయల్దేరడం అందరితో నేను హైదరాబాద్ వెడుతున్నానని సంబరంగా చెప్పుకోవడం అన్నీ గుర్తున్నాయి సరళకి. అటువంటిదానివి, అసలెందుకు నాతో బయల్దేరావే అని ఉరిమింది.

మాణిక్యం ప్రాణానికిదో జైలు. ఇల్లు దాటితే కార్లు రిక్షాలు. ఈ గందరగోళం చూస్తే భయం వేస్తుంది. పక్క ఇళ్లల్లో అందరూ తలుపులు బిగించుకుంటారు. మాట్లాడరు. పగలంతా చంటి బాబుని పట్టుకోవాలి. మళ్ళీ పనంతా చేయాలి. ఆడుకోవడానికి, ఎవరితోనయినా జతకట్టడానికి వీల్లేదు. రాత్రిపూట వంట గదిలో నిద్ర. రోజూ తల్లి కలలోకివచ్చి ఏడ్చేది. తమ ఊరు, నేస్తాలు, చింతచెట్లు, బోదెలు, తోటలు, స్వేచ్ఛగా తిరగడం ఇవన్నీ జ్ఞాపకం వచ్చి మరింత ఏడ్చేది. సరళ ఉరిమేసరికి కట్టలు తెంచుకున్న వాగులా ఏడుపు ఉధృతమయింది.

"ఎందుకే ఏడుస్తావ్? ఇక్కడేం తక్కువయింది. తినుండ్లేక."

"కాదమ్మగారూ, అయ్యగారి తమ్ముడ్ని సూత్తే బయింగా ఉంటుంది."

"ఏం చేశాడు?" అనుమానంగా చూసింది.

"గట్టిగా వాటేసుకుంటాడు. బుగ్గలు కొరుకుతాడు." సరళకి పూర్తిగా అర్థమయిపోయింది. అయినా తేరుకుని నవ్వేసింది. "అందంగా ఉంటావని ముద్దులే. చిన్న దానివిగా.... అందుకే...."

"కాదమ్మగారూ...." ఎలా చెప్పాలో ఆ పిల్లకి తెలియదు. తెలిసిన సరళకి అదో సమస్యగా అనిపించలేదు. ఈ పిల్లని పంపితే తనకి మళ్ళీ ఎవరూ దొరకరు అనే చేదు నిజం మనస్సుని అంకుశంలా పొడుస్తూ స్వార్థాన్ని ప్రేరేపిస్తుంది.

మధ్య మధ్యలో మానేసినా మాణిక్యం మారాంచేయడం మాన్లేదు. ఈ లోపు ఓ రెండునెలలు గడిచిపోయాయి. నాలుగురోజులకొకసారయినా మా ఇంటికెళ్లిపోతానని ఏడుస్తుంటుంది. సరళ వినిపించుకోవడం మానేసింది.

"పోనీ ఒకసారి తీసికెళ్ళి వాళ్ళని చూపిస్తే...." రాజు అన్నాడు. తనని మాణిక్యం రహస్యంగా రోజూ మధ్యాహ్నం బతిమలాడడంవల్ల.

"ఏం మిమ్మల్ని కాకాపడుతోందా పాకీముండ" సరళలో అసూయ బుసలు కొట్టింది. "అసలు నాకీ ఉద్యోగపు చెఱ లేకపోతే ఈతప్పులన్నీ ఎందుకుంటాయి? ప్రేమించి పెళ్ళిచేసుకున్నందుకు చాలా మంచి పనిష్మెంట్ పొందుతున్నాను."

"నన్నేం చేయమంటావ్ సరళా. నా బాధ్యతల గురించి నీకు ముందే చెప్పాను. కాని నువ్వే నన్ను ప్రోత్స....!"

"అందుకే అందుకే నోర్మూసుకుని బాగా అనుభవిస్తున్నాను. కనీసం ఇంట్లో పనిపిల్లని మెయింటెయిన్ చేయడం గూడా అనవసరమనిపిస్తోందా! వాళ్ల ఊరు

వెళితే ఇది మళ్ళీ వెనక్కి వస్తుందా ? ఆ పర్యాంతి నేనేగా సంగాలి ఇంటా బయిటా బాగా చాకిరీ చేసిపెడుతుంటా వచ్చేవరకూ."

"ఇన్ని మాట లెందుకు పిల్లలు కొత్త పెద్దవాళ్ళయేవరకూ మనకీ బాధలు తప్పవు. నేను మాత్రం కావాలని నిన్ను బాధపెడుతున్నానా సరళా ?"

"అలా అయితే పనివాళ్ళ విషయంలో మీరు కల్పించుకోవద్దు. వీళ్ళని ఎంత వరకు ఉంచాలో నాకు బాగా తెలుసు. బాబుకి సంవత్సరం నిండేవరకూ దీన్ని పంపను."

భార్య ఇచ్చిన కఠినమైన తీర్పుకి బద్ధుడవక తప్పలేదు. అతనికీ చాలా జీవితం చాలా నిస్సారంగా అర్థవిహీనంగా ఉన్నట్టనిపిస్తుంది ఒక్కోసారి. జీవిత సమరంలో తామిద్దరూ నిర్దాక్షిణ్యంగా బలయిపోతున్నారనిపిస్తుంది. ఓ మాటా మంతీ లేదు. ముద్దూముచ్చట లేదు. ఇళ్ళు ఇల్లాలి చిరాకులలో సాధింపుతో ఎప్పుడూ వాతావరణం అనోరకమైన విషాదపు గాలులతో ఉన్నట్టుగావుంటుంది అందుకే బయటకు పారిపోతాడు. సరళకి తాను అనుభవించలేనిదేదో మొగుడు అనుభవించేస్తున్నాడని దుగ్ధ, కసీ. అది ఆమె తప్పుకాదు. పరిస్థితుల బాధ్యతల సంకెళ్లు ఆమెలో కోమలత్వాన్ని పూర్తిగ చంపేసి ఒట్టి గయ్యాళి స్త్రీలా మార్చివేశాయి.

ఈ రకమైన ఉదాసీనపు బ్రతుకులో ఓ చిన్న మార్పు మాణిక్యం పెద్ద మనిషి గావడం. సరళకి చాలా విచారం కలిగింది. పైగా అంత వెనకబడిన జాతిలోనుండి వచ్చినా ఈ పిల్ల ఒంటి రంగు, ఏపుగా పెరుగుతున్న ఒళ్ళు,తీరైన అవయవాలు సరళకి బాధకి కారణాలయ్యాయి. ఇక్కడ తిండి, నీళ్ళు బాగా వంటబట్టాయి ముండకు అనుకునేది. ఆ పిల్ల పట్ల ఇదివరకు ఉన్న జాలి పెద్ద మనిషి అయినాక క్రమేపీ తగ్గడం ప్రారంభించింది. ఏదో భయం తనకే అర్థంగాని సందేహాలు.

"అమ్మా సత్యం బాబుగారు వెయ్యి లాగారు. ముద్దు పెట్టుకున్నారు" ఫిర్యాదులు మామూలుగానే చేస్తుంది. సరళలో అసూయాగ్ని చల్లారుతూ ఎందుకో మనస్సు తృప్తిపడేది.

"సరదాగా లాగి ఉంటార్లే. ఇప్పుడే మయిందో." హఠాత్తుగా సరళకి జ్ఞానోదయం అయినట్టు అనిపించింది. సత్యం ఏంచేష్టలు చేస్తున్నా అభ్యంతరం కాదు గాని తన భర్త గూడా...సత్యం బుద్ధులేనా రాజుకి. మాణిక్యం అంటే చాలా ఇష్టం. లంచవర్లో మధ్యాహ్నం ఇంటికొస్తారు. ఈ ఆలోచనలు ప్రారంభమయి పెరిగి పిశాచల్లా మారి డాన్సు చేయడం ప్రారంభించాయి.

"ఏమే మధ్యాహ్నం పూట అయ్యగారొక్కరే వస్తారా ?"

"అప్పుడప్పుడెవరయినా వస్తారమ్మా అయ్యగారితోపాటు."

"ఆడవాళ్ళా మగాళ్ళా ?"

"ఒకావిడ కూడా వచ్చిందమ్మా. సక్కగా ఉంటుంది."

"నోర్మయ్" సరళ విదిలింపుకి మాణిక్యం నోరు మూతబడింది.... అప్పటినుండి మనశ్శాంతిలేదు. ఓణీలు వేయించకపోయినా పొంగివస్తున్న దీని యవ్వనం ఎవరి కళ్ళూబడకుండా ఎలా ఉంచడం? అల్చిప్పల్లాంటి కళ్ళు, చిన్ని గడ్డం ఇది చాలా అందగత్తయిపోతోంది. సరళ తనని తాను అద్దంలో చూసుకుంటూ బాధపడేది. ఎందుకే కళ్ళనిండా అలా కాటుక పూసుకుంటావ్? మానెయ్యి అంది. అమ్మగారి విసుక్కి, కోపానికి అలవాటుపడిపోయింది. సరళ వెళ్ళిపోయాక తీరిగ్గా అలంకరించుకోవడం కాలక్షేపంగా తయారయ్యింది ఆ పిల్లకి.

ఇదివరలా సత్యం ముట్టుకుంటుంటే కోపం రావడంలేదు. ఏదో అర్థంగాని హాయి. అతను మెత్తగా నవ్వడం ముద్దు చేయడం ఇవన్నీ బెంగతో అలమటిస్తున్న హృదయానికి పన్నీటిజల్లులా ఉంటున్నాయి. ఇదివరకులా చిరాకు కలగడం లేదు.

మధ్యాహ్నం రెండు తరువాత సమయాన్ని సద్వినియోగంచేసుకుంటున్నారు.

ఓ రోజు బాగా ఏడుస్తున్న పిల్లని అడగాడు. మీ అమ్మమీద చాలా బెంగగా ఉందా ?

అవునన్నట్లు తలాడించి ఆశగా అతనివైపు చూసింది. చేతిలో బాబు నిద్రపోతున్నాడు. బుగ్గలమీద కన్నీళ్ళు జారిపోతున్నాయి.

తలుపులేసి వచ్చాడు. "మీ ఊరెళ్ళాలంటే ఇరవై రెండు రూపాయలు ఛార్జీ అవుతుంది."

"నువ్వు అప్పుడప్పుడూ ఇచ్చినియ్యి ఓ పదిదాకా ఉంటయ్యి" వెక్కుతూ అంది.

"వెరీగుడ్ దాచుకుంటున్నావన్నమాట. ఏం చేయను నాకేగాని సంపాదనుంటే ఈ క్షణాన నిన్ను మీ వాళ్ళ దగ్గరికి పంపి తిరిగి వెంటబెట్టుకొచ్చేవాడ్ని. అలా చేయాలంటే కనీసం వంద కావాలి."

"ఒక్కతే ఎల్లాలంటే?"

"కనీసం వెళ్ళడానికి ఓ పాతిక."

"నా దగ్గర ఛారిజీలుంటే ఎల్లిపోతా."

గతుక్కుమన్నాడు. "అంత పని చెయ్యకు. ఒక్కదానివే బయల్దేరితే ఎవరయినా ఎత్తుకుపోతారు. నీ కిక్కడ బాగానే ఉందిగా నేను లేనూ."

అసంతృప్తిగా తల విదిలించింది. తమ ఊరు, ఇల్లు గుర్తుకొచ్చి దుఃఖం పెల్లుబుకింది. పెద్ద చెరువు, చెరువుగట్టు దగ్గర పెద్ద దిబ్బచుట్టూ ఈతపొదల మధ్యలో చుట్టిల్లు. రోజూ గేదెలమీద ఎక్కి ఆడేవాళ్ళు. చెరువులో స్నానం చేసేవారు. కోతలయ్యాక తట్టలు పట్టుకొని పరిగేరడానికి బయల్దేరేవాళ్ళు. సంక్రాంతివస్తే తెల్లారే బుట్టలు పట్టుకుని

సాయంత్రం ఐదున్నర వరకూ ఇల్లు విడిచి వుడడం— అందుగురించి ఆమె పడే మానసికమైన శారీరకమైన శ్రమ ఆమెని పీల్చేస్తున్నాయి. సత్యం బాత్ రూంలోంచి వచ్చి ముడి విప్పుకుంటున్న భార్యవైపు చూశాడు.

చాలా చిక్కిపోయింది. మొహంలో అలసట, చికాకు తప్ప చిరునవ్వు చాలా అరుదు. కనీసం నిద్రపోయే ముందు లాలించుదామన్నా కాస్సేపు అన్ని బాధలను మర్చిపోవడానికి శారీరకంగా దగ్గరవుదామన్నా.... ప్చ్. ఒంటిమీద చెయ్యి వెయ్యనివ్వదు. నాకు నీరసంగా ఉందని పక్కకి తిరుగుతుంది. ప్రతి మాలితే అదో రకంగా తన మొహంలోనికి చూస్తుంది. నువ్వుకదా కారకుడివి. నీ వల్లే నే నెన్నో పోగొట్టుకుని ఇలా ఉన్నాను అన్ని రకాలుగా.... ఇంకెన్నో అర్థాలు చెప్పే చూపది. చటుక్కున లేచి సిగరెట్ అంటించుకుని రోడ్డుమీదికి వెళ్లి పోతాడు. ఎన్నేళ్ల బ్రహ్మచర్యం అని పిస్తుంది. కాని ఆమె కిష్టం లేకుండా ఆమెని ఎలా అనుభవిస్తాడు ?

ఇద్దరికీ చాలా త్వరగా వృద్ధాప్యం వస్తుం దిలాగయితే. నవ్వొచ్చిందతనికి. టీ తాగుతున్న భార్య దగ్గరకెళ్లి కూర్చున్నాడు.

"బాబుగాడు భలే ఆడుతున్నాడు సరళా."

"మీరుగూడా !"

చురుక్కుమంది. ఇంకేం మాట్లాడాలో తోచక సైకిల్ తీశాడు.

"బయటకెడుతున్నారా ! అదృష్ట వంతులు. అంత స్వేచ్ఛ నాకెక్కడిది?" రాజు మారుపలక్కుండా జారుకున్నాడు.

"ఏపే మాణిక్యం! మధ్యాహ్నం పూట అయ్యగారితోపాటు ఎవరైనా అమ్మాయిలు వస్తుంటారా ? అంటే మళ్ళీ ఈ మధ్య వస్తున్నారా ?"

"మొన్న ఒకామె వచ్చిందమ్మా. బాబుకి బిస్కత్తులు తెచ్చారు."

మొన్న కోఠీ సెంటర్లో ఈయన్తో మాటాడుతూ కనిపించింది అదే అయ్యుం టుంది. తను బస్సులో వస్తుంటే రెండు సార్లు తన కంటబడ్డారు. అసలేమయినా ఉందా కథ ! అతన్నడగాలంటే వణుకు. ఇంత అల్పురాలివా అన్నట్టు చూసి మౌన యుద్ధం ప్రారంభిస్తారు. కోపం రాదసలు ఈ మనిషికి. వస్తే మనిషిని అసలు లెఖ్ఖ చెయ్యరు. ఎన్ని రోజులయినా మాటా పలుకూ లేకుండా మౌనంగా సాధిస్తారు. అందుకే భయం.

"ఈ సారెవరయినా వస్తే చెప్పు. ఏం మాట్లాడుతుందో చెప్పు." సరళ లోలోపల సిగ్గుపడుతూ అర్థింపుగా అంది.

స్వామి ఆజ్ఞకు శిరసావహిస్తున్న భక్తుడిలా విధేయతగా తలాడించింది. సరళ కాస్సేపు బాబుతో ఆడి పాపని దగ్గర కూర్చోబెట్టుకుని హోంవర్క్ చేయించడం మొదలుపెట్టింది. ఎందుకు

చెట్టంత మగాళ్ళిద్దరున్నారు ఊరెంబడి బలాదూరుగా తిరగడమే అనుకుంటూ పాపకి పాఠాలు చెప్పడంలో మునిగి పోయింది.

* * *

సత్యానికి బాంక్‌లో ఉద్యోగం రావడం జాయినవడం జరిగిపోయింది. విజయవాడ స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో వచ్చింది. మాట మాత్రమయినా చెప్ప కుండా వెళ్ళిపోయాడని విలవిలలాడింది మాణిక్యం. అసలు ఆ సమయంలో ఆమె ఉనికినే మర్చిపోయి అన్నావదినలతో ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుంటూ అవీ ఇవీ సర్దుకున్నాడు.

"వదినా నా మొదటి జీతం నీకే. నీ చలవ వలనే ఇంత మాత్రమయినా...." గొంతుకేక్కడో అడ్డుపడినట్లయి ఆగి పోయాడు.

సరళకి చాలా సంతోషంగా అనిపిం చింది. కొసరి కొసరి వడ్డించింది. ఎన్నో జాగ్రత్తలు చెప్పి ఆనందంగా బస్సె క్కించారు దంపతులు. ఎలాగైనా సరళ చాలా మంచిది అనుకున్నాడు రాజు తిరిగి వస్తూ. రిక్షాలో తన భుజంచుట్టూ ఉన్న రాజు చేతిస్పర్శకి ఇంకేవో అనుమానాలు వస్తున్నాయి. సత్యం వెళ్ళిపోయాడు. మధ్యాహ్నం మాణిక్యం ఒక్కతే.

అందరూ బస్‌స్టాండుకి వెళ్ళిపోయాక గావురుమని ఏడ్చింది మాణిక్యం. మొన్నటి వరకూ తల్లి బెంగ. సత్యం మాటలతో, చేష్టలతో చాలా మరిపించాడు. అందుకే ఈ మధ్య ఆ దిగులు మర్చిపోయి సరదాగా నవ్వుతూ తుళ్ళుతూ తిరుగు తోంది. ఏమీ మాట్లాడకుండా వెళ్ళొస్తాను మాణిక్యం అని వెళ్ళిపోయాడు. వార్డికి డబ్బాలిస్తాను అన్నాడు. బస్సెక్కిస్తా నన్నాడు.

వాగ్దానాలన్నీ జ్ఞప్తికొచ్చి చాలా ఏడ్చింది. సరళ బస్‌స్టాండునుండి వచ్చాక కారణం గ్రహించగలిగింది. కాని తనలో మొదలయిన బాధ ముందు ఈ పిల్లపడే బాధ చాలా అల్పంగా అనిపించింది.

మధ్యాహ్నం ఎవరూ రావడంలేదని మాణిక్యంతో పదే పదే జవాబు ఇప్పించు కున్నాక కాస్త తేలికపడింది సరళ మనస్సు. రోజూ ఆఫీసుకి వెడుతోంది వస్తోంది. సత్యం లేనిలోటు మినహాయిస్తే ఇంకేమార్పూ లేదు ఇంట్లో. అప్పుడే అతను వెళ్ళి వారం దాటింది.

ఆ రోజు తుఫాను. పేదవాడి కన్నీరులా నెమ్మదిగా కురుస్తూ మధ్య మధ్య పెనుగాలులతో విజృంభిస్తోంది. శెలవుపెట్టబోయి ఆ రోజు ఇన్‌స్పెక్షన్ అని జ్ఞాపకంవచ్చి ఆటోలో ఆఫీసుకి వెళ్ళిపోయింది. మధ్యాహ్నం స్కూలుకి శెలవు ఇవ్వడంతో రాజు తడుస్తూ వచ్చాడు. పక్కనే డ్రిల్లు టీచరు రజని ఉంది. తలుపు తెరిచిన మాణిక్యాన్ని చూసి 'మీ అమ్మమీద బెంగ తగ్గిందా' అని నవ్వింది

బిక్కు బిక్కుమంటూ కూర్చున్న మాణిక్యానికి వీళ్ళిద్దరి రాక సంతోషం కలిగించింది.

"అయ్యగారూ టీతేనా" అంటూ రెండు కప్పుల్లో పోసుకొచ్చింది.

"సమయస్ఫూర్తి ఎక్కువ ఈ పిల్లకి" మెచ్చుకోలుగా చూసింది రజని.

గాలికి టపటపా కొట్టుకుంటున్నాయి తలుపులు, కిటికీలు. అన్నీ బిగించి వచ్చాడు. "మీ ఇంటికి ఇంత వర్షంలో బయల్దేరితే అసలే సన్నగా ఉన్నావు గాలికి కొట్టుకుపోయేదానివి" కొంటెగా నవ్వాడు.

ట్యూబులైటు కాంతిలో తడిసిన కురులు అక్కడక్కడా అంటుకుని కడిగిన ముత్యంలా అతి నిర్మలంగా కనిపిస్తోంది రజని. రజనిని చూస్తున్నప్పుడల్లా మనస్సు వశం తప్పుతూ ఉంటుంది అతనికి. మొదట్లో ఆమె చొరవ చూసి చికాకు కలిగి బింకంగా ఉండాలని ప్రయత్నించాడుగాని సెలఏటి లాంటి ఆమె మాటల ఉరవడిలో అతని గాంభీర్యం పటాపంచలయింది.

"చాలా బావున్నావు" ఇంగ్లీషులో అన్నాడు.

చెంపలు ఎర్రబడ్డాయి. "ఇలా మాట్లాడితే నేను రాను బాబూ."

"ఎవరూ లేర్లే. మా తమ్ముడు విజయవాడ వెళ్ళిపోయాడు."

"అయితే?"

రాజు తలెత్తి చూశాడు. ఎదురుగా గుమ్మానికి చేరగిలబడి వీళ్ళిద్దరి సంభాషణ ఆసక్తిగా వింటోంది మాణిక్యం. ఆ పిల్లకి ఈ సరసోక్తులు పూర్తిగా అర్థం గావుగాని వాళ్ళిద్దరూ ఉంటే చాలా సందడిగా అనిపిస్తుంది. మాణిక్యాన్ని చూస్తూ "వెళ్ళి పడుకోమ్మా. బాబు మంచం పక్కన చాపవేసుకో. నేను లేపుతాలే నాలుగింటికి" అన్నాడు మృదువుగా. అలాగే అంటూ అయిష్టంగానే కదిలింది.

సిగరెట్ అంటించుకుని కుర్చీకి జారగిలబడ్డాడు. అతని కళ్ళు ఆమెని నిలువెల్లా పరిశీలిస్తున్నాయి. చలికి నరాలు జివ్వుమంటున్నాయి. ఆమెని కన్నార్పకుండా చూస్తూ వరసగా సిగరెట్లు కాల్చాడు.

ఏమీ మాట్లాడదు. బోర్ కొడుతోంది.

లేచి దగ్గరగా వచ్చాడు. బలిష్ఠమైన చేతులు ఆమె చుట్టూ బిగుసుకున్నాయి.

"ఏమిటి రాజూ" కోపం నటించబోయింది.

"ప్లీజ్ కాదనకు రజనీ. జీవితంలో కావాల్సినవన్నీ పొందినా అనుభవించలేని నిర్భాగ్యుడ్ని. నీకు దూరంగా ఉండాలని చాలా ప్రయత్నించాగాని పాదరసంలా నన్ను చేరావు. నీకు మాత్రం తెలియదా నేను పెళ్ళయినవాడ్ని ఇద్దరు పిల్లల తండ్రినని. అయినా నేను నీకు కావాలి.

"నీ చుట్టూ ముళ్ళకంపల్లాంటి బాధ్యతలకోసం పెళ్ళి వాయిదావేస్తూ



కోరికల్ని అణచుకోలేక ఈ సంఘర్షణలో నలిగిపోతున్నావ్. కమాన్ ఆ గదిలోకి వెడదాం పద. నీకు ఏమీ అవదు. జాగ్రత్తలు తెల్సు నాకు" కోరికతో ఇది తప్పు అని మనస్సు పెడుతున్న ఘోషతో అతని కంఠం వణికింది.

రజని కాస్సేపు ఆలోచించింది. లోక విరుద్ధం అని తెలిసినా తను పొంద బోయేది చాలా తాత్కాలికమైనదే అని తెలిసినా రాజుమీద అకర్షణ చంపుకోలేక పోయింది. ఏమీ తెలియనట్టు నటిస్తూనే వీలయితే అతని కౌగలిలో నలిగిపోవాలనే ఈ తుఫానులో అతనితోపాటు వచ్చింది.

"ఎందుకాలోచన? నేనంటే ఇష్టం లేదా."

"చాలా ఇష్టం. ఆకాశమంత. కాని ఏ హక్కూలేదు నాకు."

"ప్రస్తుతం నా మీద పూర్తిగా హక్కు ఉంది" అల్లరిగా నవ్వాడు.

ఇంక నిగ్రహించుకోలేక అతని తల వంచి ముద్దు పెట్టుకుంది. ఇంతకాలానికి అతనికి దగ్గరయినందుకు ఉద్వేగంతో కళ్లు చెమ్మగిల్లాయి. రాజుకి పొరపాటు అనే హెచ్చరిక అంతరాంతరాల్లో మారు మ్రోగుతోంది. కాని శరీరం మాటవినదు. అనుభవాన్ని నిజంగా శరీరం కోరుతున్న

ప్పుడు మనస్సు చేసే హెచ్చరికలు ఎగిరి పోతాయి. ఆమెని నడిపించుకుని బెడ్ రూంలోకి తీసుకుపోయాడు.

జరగిందేమిటో తెలుసుకున్నాక విపరీతంగా సిగ్గుపడ్డాడు రాజు.

"నీ భార్యకి అన్యాయం జరగిందని బాధా?" వెటకారంగా అంది.

"ఆమెని ఈ హైద్రాబాద్‌లో ఉద్యోగం చేయించడం ద్వారా ఎలాగూ అన్యాయం చేసుకున్నాను మా దాంపత్యానికి."

"ఎలాగైనా నీ శ్రద్ధ నీ సంసారం గురించే. నేను బలహీనురాల్ని."

రాజుకి చాలా జాలనిపించింది. దగ్గరకు లాక్కున్నాడు. ముంగురులు సవరించాడు. "క్షమించు రజనీ. అందరికంటే త్యాగమూర్తివి నువ్వు. నిన్ను పెళ్ళి చేసుకోబోయేవాడు అదృష్టవంతుడు. ఎంతో చక్కటి అనుభూతి నిస్తావు. మైమరపిస్తావు."

"నాకు పెళ్ళా! ఈ జన్మకి ఆ అదృష్టం లేదులే. ఇదిగో ఇలాగే...." రజని ఏడవబోయి పెదిమలు కొరుక్కుంటూ కంట్రోల్ చేసుకుంది.

"చాలా టయిమయినట్టుంది పద. మీ ఇంటిదాకా తోడు వస్తాను" ఆమెని లేపి గడియ తీశాడు. వేగంగా పారిపోతున్న మాణిక్యాన్ని చూసి అదిరిపోయాడు. రజని చెప్పులు తొడుక్కుని "పద" అంది.

ఎంత పొరపాటు. ఇప్పుడిప్పుడే యవ్వనం వికసిస్తున్న ఈ మొగ్గని పూర్తిగా అలక్ష్యంచేశాడు. తనేంచేశాడో ఈ పిచ్చి పిల్లకి అర్థమయిపోయే ఉంటుంది. సరళతో చెబితే ఆమె కసలే ఆవేశం ఎక్కువ. వెంటనే ఏ అఘాయిత్యమైనా తలపెట్టినా ఆశ్చర్యంలేదు.

అన్యమనస్కంగా రజనితోపాటు బయల్దేరాడు. ఆమెని దిగబెట్టి ఆటోలో వచ్చేశాడు. ఐదుంబావు అవొస్తోంది. సరళ వచ్చినా రావచ్చు. ఇంటికొచ్చాక మాణిక్యం తనని పదేపదే పరిశీలిస్తున్నట్టు ఇబ్బందిగా ఫీలయ్యాడు. ఓ చిన్నపిల్ల ముందు తలదించుకోవాల్సి వచ్చింది. తన నిగ్రహం ఎటుపోయింది? ఇంత అవివేకంగా ఎలా ప్రవర్తించాడు?

మాణిక్యం డబ్బులు లెక్కబెట్టుకుంటోంది. "ఎక్కడివా డబ్బులు మాణిక్యం" అన్నాడు.

ఆ పిల్ల మొహం మతాబులా వెలిగింది. "సత్తెంబాబుగా రిచ్చారు...."

"అహ"

"మా ఊరెల్లటానికి చారిజీ డబ్బులిత్తానన్నారు. ఇంక ఆరు తగ్గాయి."

రాజు గుండెల్లో కలుక్కుమంది. మాణిక్యం వచ్చి ఆర్నెల్లయినా ఇంకా వాళ్ళూరు వెళ్ళాలనే ధ్యాసలోనే ఉంది. ఏమీ మాట్లాడకుండా పేపరు చదవడానికి తెరిచాడు.

"అయ్యగారూ!"

"ఆ."

"మీరిత్తారా?"

"చూద్దాం."

"ఊరికే వద్దు."

"సరి" నవ్వాడు.

"ఇందాక మీరు ఆయమ్మ గారిక్కి డబ్బులిచ్చారా ?" అమాయకంగా చూసింది.

అతనికి సర్వం అర్థమయిపోయింది. ఎంత దారుణం. ఆ వెధవ సెక్స్ పుస్తకాలు చదువుతారని తెల్సు. అయినా ఆ వయస్సు అటువంటిదని మందలించలేదు. కాని వాడి కిరాతక చర్యలకి ఈ పిల్ల.... తను చేసింది మాత్రం ఏమిటి ? వయస్సు తేడా ఒక్కటే.... రాజు కణతలు అదిరిపోతున్నాయి.

"అయ్యగారూ నేను గూడా మీదగ్గర పడుకుంటాను."

"మాణిక్యం నోర్మూయ్." పూనకం వచ్చినవాడిలా అరిచాడు. మాణిక్యం హడలిపోయి ఏడవడం ప్రారంభించింది. తనని తాను అదుపులోకి తెచ్చుకుంటూ మెల్లగా ఆ పిల్లద్వారా అసలు విషయాన్ని రాబట్టాడు. దిమ్మ తిరిగినట్లయింది. తామందరి అవసరాలకి సమిధిలా ఆహుతి అయింది. సరళకి ఏదో వంకబెట్టి నచ్చజెప్పి స్త్రీ పురుష సంబంధం వీటి గురించి ఏమీ తెలియని కేవలం పదమూడు ఏళ్ళు నిన్నగాక మొన్న పూర్తిఅయిన పిల్ల తప్పుడు దారిలో పడింది. కాని ఇంకో పిల్లని వెదికాక ఈ పిల్లని పంపేయాలి.

"మాణిక్యం. నిన్ను మీ ఊరు పంపేస్తాను కాని నువ్వు ఏమీ మాట్లాడకు. ఈరోజు రజని వచ్చిందని అమ్మగారితో చెప్పకు. నిజంగా మీ ఊరు పంపిస్తా నిన్ను."

ధన్ ధన్ మని తలుపు చప్పుడయింది.

రాజు వీధి తలుపు తీశాడు. సరళ అనుమానంగా చూస్తూ లోపలికొచ్చింది.

"మధ్యాహ్నమే ఇంటికొచ్చేశారట. మీ స్కూల్లో ప్యూన్ చెప్పాడు. ఫోన్ చేశాను. మా ఆఫీసు కొస్తారేమో నన్ను తీసుకు రావడానికని."

"సారీ సరళా ! శెలవిచ్చేశారు. వర్షం తగ్గిందేమో కదూ" ఆమె మాటాడే అవకాశం ఇవ్వకుండా గబగబా బయిట కెళ్ళిపోయాడు. ఎందుకో తనని చూడగానే తప్పించుకు పారిపోయాడని పించింది. తలుపులన్నీ వేసి ఉన్నాయి. ఎప్పుడలా కాస్సేపు అనుమానాలతో బాధపడి తనని తాను మందలించుకుని మాణిక్యం ఇచ్చిన టీ అందుకుంది. గుర్రంలా ఎదిగిపోతోంది అనుకుంది ఈర్ష్యగా.

"ఏమే బాబు ఇంకా నిద్రపోతు న్నాడా?"

"అవునమ్మా."

"పనంతా అయిపోయిందిగా!"

"అయిపోయిందమ్మా. అన్నంగూడా వండేశాను."

"అయితే కాస్సేపు పడుకుంటాను. అయ్యగారొస్తే వెళ్ళి పాపని తీసుకు రమ్మనమని చెప్పు. ఆ స్కూలు రిక్షా అబ్బాయి ఈ రోజు రాలేదట. ఈ తుఫానులో అనవసరంగా పంపాను." చీర మార్చుకుని బెడ్ మీద వాలబోయింది. పక్కమీద పగిలిన గాజులు, మంచం అవతల ఎర్ర రిబ్బను. అది దీనిదే. పగిలిన పక్క. గాజులు దీనివే. తల గిర్రుమని తిరిగిపోతూ ఉంటే "ఒసేయ్" అని కేకబెట్టింది.

పరుగు పరుగున వచ్చింది. "ఈ పక్కమీద ఎవరు పడుకున్నారే? ఈ ఎర్ర గాజులు నీవేగా?" సరళ రాక్షసిలా అరిచింది.

మాణిక్యానికి ముచ్చెమటలుపోశాయి. అవీ ఎర్రగాజులే. పొద్దున ఏ పాపో పడేసి ఉంటుంది. రిబ్బను సరళ చేతిలో పాములా కనిపిస్తోంది.

"చెప్పు ముండా ఈ పగిలిన గాజులూ ఈ రిబ్బనూ నీదే కదూ?" ఆమె అరుపు ఇల్లంతా ప్రతిధ్వనించింది.

అయ్యగారొస్తే బాగుండు. ఏం చెప్పాలో తెలియటంలేదు. అక్కడ్నించి వెళ్ళబోయింది.

"ఆగు వెళ్ళకు." పులిలా గర్జించింది. "చెప్పు ఈ పక్కమీద గాజులు నీవే కదూ?"

అవునని ఒప్పుకుంటే ఆమె అప్పటికి వదిలిపెడుతుందా అనిపించింది ఎందుకో ఆ పిల్లకి.

ఇంతలో కరెంటు పోయింది. తలుపులన్నీ వేసి ఉండడంవల్ల చిమ్మచీకటిగా ఉంది.

ఆ చీకటిలో ధైర్యంగా మాణిక్యం గొంతు పెగుల్చుకుంది.

'రజనమ్మగారు వచ్చినట్టు తెల్సిపోయిందా! అనుకుంది కాసేపు. ఉహూ కాదు గాజులు పగలగొట్టుకున్నానని కోపం వచ్చిందేమో ఇల్లంతా గత్తరగా ఉందాయె' అనుకుంటూ అంది.

"నాయేనమ్మా."

ఎదురుగా అలమరాలో మెరుస్తున్న పేపరు వెయిట్ సరళ చేతుల్లోకి వచ్చి విసురుగా మాణిక్యం కణతల్ని తాకింది.

"అమ్మో" కుప్పలా కూలిపోయింది మాణిక్యం.

"కుక్క తిన్నఇంటి వాసాలు లెక్కబెట్టావే. భగవంతుడా నే ననుకున్నంత పనీ జరిగింది. దీనికి అలవాటుపడిపోయారాయన. ఏకులా వచ్చి మేకులా మారిపోయావు గదే." సరళ బిగ్గరగా తిడుతూ ఏడవడం ప్రారంభించింది. ఏడ్చి ఏడ్చి తేరుకుని లేచింది. లైట్లు వెలిగాయి. మాణిక్యం అలాగే వుంది. లేవలేదు. నిర్ఘాంతపోయింది. అమ్మా అంటూ రాజుతో పాటు లోపలికి వచ్చిన పాప తల్లి చీరలో మొహం దాచుకుంది.

ఏమిటీ మాణిక్యం నిద్రపోయిందా! అంది ఆశ్చర్యంగా

రాజు తలతిప్పి చూశాడు. ఈ లోపల మోకాళ్ళ మీద వంగి మాణిక్యాన్ని లేవ దీయబోయిన సరళ ఆర్తనాదం చేసింది.

"ఏమయింది. ఏమయింది సరళా?" రాజు గాభరగా వంగాడు. నిర్జీవంగా తల వేలాడేస్తున్న మాణిక్యం తనలో ప్రాణాలెప్పుడో ఎగిరిపోయాయని వెళ్ళడబడుతోంది

"ఏమయింది? ఏం చేశావు?" కంపించిపోతూ అరిచాడు.

"గాజులు గాజుల పక్క మీద గాజు" సరళ స్పృహతప్పి పోతోంది.

"ఎంత పని చేశావు సరళా?" ఆమెని వళ్ళోకి తీసుకుంటూ మాణిక్యం వైపు చూస్తూ కుమిలి కుమిలి ఏడవడం ప్రారంభించాడు మాణిక్యం ఏ జబ్బుతో చచ్చిపోయిందని చెప్పాలి? అని అతని మస్తిష్కంలో ఎన్నో పరిష్కారాలు ప్రశ్నలు తిరగడం ప్రారంభించాయి.

# అనురాగానికే అవధి...

## సముద్రాల రామానుజాచార్యులు

హాస్పటల్ డ్యూటీ పూర్తయేసరికి పది గంటలు దాటింది.

కుబుసం విడిచిన పాములా వెన్నెల నిండి, మెలికలు తిరిగిన రోడ్డుమీద కారు డ్రైవ్‌చేస్తూ పోతుంటే ఏవేవో ఆలోచనలు మెదడులోనికి వస్తున్నాయి. వృత్తిలో తృప్తి ఉంది. సేవలోనే శాంతి, ఆత్మానందం ఉన్నాయి. కాని ఒక్కొక్కప్పుడు విసుగు కలుగుతుంది. తన సుఖం కన్నా, తన దగ్గరకు వచ్చిన వారి సుఖం ఆరోగ్యం చూడాలి.

తనకు తీరికెక్కడ?

కెరటాలు తగ్గేదెప్పుడు — సముద్ర విహారానికి—

పోర్టికోలో కారాపి, ఇంట్లోకి వెళ్ళి బట్టలు మార్చుకున్నాడు. అతని అవసరాలు తీర్చడంలో మునిగిపోయింది జానకి. మౌనంగా భోజనం ముగించి మేడమీద వరండాలో వాలుకుర్చీలో మేనువాల్చాడు శేఖర్, ఈ దినం తన దగ్గరకు వచ్చిన కేసుగురించి పునరావృత్తి చేసుకుంటూ.

ప్రసవవేదన అనుభవిస్తూ, మెలికలు తిరిగిపోతూ చావుబ్రతుకుల్లో ఊగిసలాడే సమయంలో తీసుకువచ్చారామెను. చూడడంతోనే ప్రమాద పరిస్థితిని గుర్తించి స్పెషల్ వార్డులో జాయిన్ చేసుకొన్నాడు. బలహీనతవల్లా, రక్తం తక్కువవడంవల్లా ప్రసవం కష్టమయింది. చివరిదశలో వచ్చినా ప్రమాదం లేకుండా తప్పింది. తల్లీ బిడ్డ క్షేమంగా ఉన్నారు. అదే తృప్తి తనకి. తన భార్య ప్రసవం నాటి పరిస్థితి అంతే. కానీ, తల్లినో పిల్లనో ఒక్కరినే బ్రతికించుకోవాలి. అందుకే డాక్టరు రాజు సాయంతో జానకిని బ్రతికించుకున్నాడు. బిడ్డ దక్కలేదు. తన అనురాగానికీ, ప్రేమకీ ప్రతిరూపైన జానకి లేందే తను బ్రతకలేడు. కాని, మళ్లీ సంతానవతి అయితే మాత్రం దక్కదామె. డాక్టరుగా తనకి తెలుసు—మూర్ఖంగా భవిష్యత్తుకి ఊహలు విడువలేదు.

పర్యవసానం?

రాజు డాక్టర్ ద్వారా ఆపరేషన్ చేయించుకున్నాడు, తను. ఈ రహస్యం తమ మధ్యనే వుండిపోయింది. పిల్లలు



లేకపోయినా, విచారం బయటకు రానీయడు తాను. జానకికీ విషయం తెలీనివ్వకుండా మెలకువగా కాలాన్ని గడుపుకొస్తున్నాడు. తన విచారాన్ని తెలియనీకుండా తన గుండెల్లో పిల్లలు కలగలేదనే వేదనను కుక్కుకుంటూ, మనసులోనే బాధపడుతుందామె. ఆమెకు ఎంత సహనం! ఆలోచిస్తున్న [illegible]కు జానకి రాక తెలియలేదు. పక్కలు సర్ది, లోపలకి పిలిచిన ఆమెను చూస్తే ఆ ఆదరణకు అనిర్వచనీయమైన అనుభూతి కల్గుతుంది తనకు.

"ఏమిటండీ, వచ్చిన దగ్గర్నుంచీ ఒకటే ఆలోచనలు? కేసేదయినా ప్రమాదస్థితిలో వుందా?" అంది దగ్గరకి వచ్చి.

"లేదు జానకీ."

"మరి ఏమిటీ మౌనం, పరధ్యానం?"

"నువ్వు వచ్చేవరకు ఏంతోచక అలా వున్నానంతే. భోంచేసావా!"

"లేదండీ. వంట్లో కొంచెం నలతగా వుంది. అంతే."

"ఇంజక్షన్ యిచ్చేదా?" అన్నాడు ఠక్కున.

"మీ డాక్టర్లకు రోగి కనిపిస్తే సూది తీస్తారు. నాకేం వద్దు విశ్రాంతి తప్ప" అంది నవ్వుతూ. "అయితే పడుకో. ఉదయం చూస్తాను" అంటూ పక్కపై వాలేడు ఆమె నవ్వులో శ్రుతికలుపుతూ.

## 2

ఉదయాన్నే కాలకృత్యాలు ముగించి, హాస్పటల్‌కు బయలుదేరాడు శేఖర్. జానకి యింకా లేవలేదు. ఆమె ఒంటి మీద చెయ్యివేసి చూసి, పనిమనిషిని పిల్చి

వప్పగించి అవసరమయితే హాస్పటల్‌కు ఫోను చెయ్యమన్నాడు. వెళ్ళడంతోనే రోగులందరినీ పరామర్శించి, రౌండు పూర్తి చేసుకుని, రాత్రి వచ్చిన స్పెషల్ కేసున్న గదిలోకి వెళ్ళాడు. లేవడానికి శక్తి లేకున్నా, గౌరవంగా చేయి కదిపి ఊరుకుంది. తనని చూడడంతో నేకళ్ళలో నీళ్ళు పెట్టుకుంది ఆమె. ఉయ్యాల్లోవున్న బాబును చూశాడు. పుష్టిగా, తెల్లగా వున్న పసివాడు నిబ్బరంగ పడుకున్నాడు. చిరునవ్వుతో ముందుకు వాలి ఆ బాబుని చూచి తృప్తిపడ్డాడు. ఆమె చెయ్యి పట్టుకుని నాడి చూశాడు.

"నన్నెందుకు బ్రతికించారు డాక్టర్?" ఆమె అంటోంది.

"చావటానికి మేమంతా ఎందుకమ్మా-ఏం పరవాలేదు-విశ్రాంతి తీసుకో. మళ్ళీ వస్తాను. నీ పేరేమిటి?"

"నిర్మల."

"బాగుంది" తన రూంలోకి దారి తీశాడు శేఖర్. ఇంతలో తన ఫ్రెండు రాజు వచ్చాడు. కరచాలనం చేసుకుని యిద్దరూ కబుర్లలో పడ్డారు.

"రాత్రి నీ ఫోను వచ్చేసరికి యాక్సిడెంటు కేసు ఒకటి వచ్చింది. దానికి అటెండయి, నీ దగ్గరకు వద్దామనుకున్నా. ఇంతలో తొందర్లేదు ఉదయం రమ్మని ఫోను చేశావు. ఏమయింది" అడిగాడు శేఖర్‌ని.

"ఏం లేదోయ్. డెలివరీ కేసొకటి ప్రమాదస్థితిలో వచ్చింది. అవసరమైతే నీకు ఫోనుచేసి రప్పించి నీ సహాయంతో ఆపరేషను చేద్దామనుకున్నాను. ఈలోగా ప్రమాదం లేకుండా, ఆపరేషన్ అవసరం లేకుండానే ఒడ్డెక్కింది." అన్నాడు శేఖర్. అవునన్నట్లు ఫోను మ్రోగింది.

ఫోన్ అందుకున్నాడు శేఖర్. మాట్లాడేడు.

"ఏవిటోయ్, ఫోన్? మా సిస్టర్ నిన్ను వేగం రమ్మంటోందా"

"అవును రాజూ. జానకికి నిన్నటి నుంచీ జ్వరం...."

"అరె....అయితే వెంటనే వెళ్ళుమరి"

"వీలుచూసుకుని యింటికి రావోయ్ రాజూ."

"అలాగే. మా సిస్టర్‌ని చూడ్డానికి వస్తాగా" అంటూ వెళ్ళిపోయాడు రాజు. రాజుని సాగనంపి వెనుదిరిగిన శేఖర్‌కి "నమస్కారమండీ" అన్న మాటలు వినిపించాయి. రాజారావుగారు. "ఓః మీరా.... మీ అమ్మాయిని బాబూని చూడండి... హాయిగా వున్నారు. మరేం బెంగలేదు. రెండుమూడు రోజుల్లో డిస్చార్జి చేస్తాను. తీసుకెళ్ళవచ్చు" అన్నాడు శేఖర్ తన సీట్లో కూర్చుంటూ.

"అమ్మాయిని యిప్పుడే చూసి వస్తున్నాను డాక్టర్. రాత్రి పరిస్థితి చూస్తే నాకు భయంవేసిందండీ. ఎలాగయినా మీ చేతి చలవవల్ల మా పిల్లకి ప్రమాదం



లేకపోయినా,విచారం బయటకు రానీయడు తాను. జానకికీ విషయం తెలీనివ్వకుండా మెలకువగా కాలాన్ని గడుపుకొస్తున్నాడు. తన విచారాన్ని తెలియనీకుండా తన గుండెల్లో పిల్లలు కలగలేదనే వేదనను కుక్కుకుంటూ, మనసులోనే బాధపడుతుందామె. ఆమెకు ఎంత సహనం! ఆలోచిస్తున్న [illegible]కు జానకి రాక తెలియలేదు. పక్కలు సర్ది, లోపలకి పిలిచిన ఆమెను చూస్తే ఆ ఆదరణకు అనిర్వచనీయమైన అనుభూతి కల్గుతుంది తనకు.

"ఏమిటండీ, వచ్చిన దగ్గర్నుంచీ ఒకటే ఆలోచనలు? కేసేదయినా ప్రమాదస్థితిలో వుందా?" అంది దగ్గరకి వచ్చి.

"లేదు జానకీ."

"మరి ఏమిటీ మౌనం, పరధ్యానం?"

"నువ్వు వచ్చేవరకు ఏంతోచక అలా వున్నానంతే. భోంచేసావా !"

"లేదండీ. వంట్లో కొంచెం నలతగా వుంది. అంతే."

"ఇంజక్షన్ యిచ్చేదా?" అన్నాడు తక్షణ.

"మీ డాక్టర్లకు రోగి కనిపిస్తే సూది తీస్తారు. నాకేం వద్దు విశ్రాంతి తప్ప" అంది నవ్వుతూ. "అయితే పడుకో. ఉదయం చూస్తాను" అంటూ పక్కపై వాలేడు ఆమె నవ్వులో శ్రుతికలుపుతూ.

**2**

ఉదయాన్నే కాలకృత్యాలు ముగించి, హాస్పటల్‌కు బయలుదేరాడు శేఖర్. జానకి యింకా లేవలేదు. ఆమె ఒంటి మీద చెయ్యివేసి చూసి, పనిమనిషిని పిల్చి

వప్పగించి అవసరమయితే హాస్పటల్‌కు ఫోను చెయ్యమన్నాడు. వెళ్లడంతోటే రోగులందరినీ పరామర్శించి, రౌండు పూర్తి చేసుకుని, రాత్రి వచ్చిన స్పెషల్ కేసున్న గదిలోకి వెళ్ళాడు. లేవడానికి శక్తి లేకున్నా, గౌరవంగా చేయి కదిపి ఊరుకుంది. తనని చూడడంతోనే కళ్ళలో నీళ్లు పెట్టుకుంది ఆమె. ఉయ్యాల్లో వున్న బాబును చూశాడు. పుష్టిగా, తెల్లగా వున్న పసివాడు నిబ్బరంగ పడుకున్నాడు. చిరునవ్వుతో ముందుకు ప్రాలి ఆ బాబుని చూచి తృప్తిపడ్డాడు. ఆమె చెయ్యి పట్టుకుని నాడి చూశాడు.

"నన్నెందుకు బ్రతికించారు డాక్టర్?" ఆమె అంటోంది.

"చావటానికి మేమంతా ఎందుకమ్మా–ఏం ఫరవాలేదు–విశ్రాంతి తీసుకో. మళ్ళీ వస్తాను. నీ పేరేమిటి?"

"నిర్మల."

"బాగుంది" తన రూంలోకి దారి తీశాడు శేఖర్. ఇంతలో తన ఫ్రెండు రాజు వచ్చాడు. కరచాలనం చేసుకుని యిద్దరూ కబుర్లలో పడ్డారు.

"రాత్రి నీ ఫోను వచ్చేసరికి యాక్సిడెంటు కేసు ఒకటి వచ్చింది. దానికి అటెండయి, నీ దగ్గరకు వద్దామనుకున్నా. ఇంతలో తొందర్లేదు ఉదయం రమ్మని ఫోను చేశావు. ఏమయింది" అడిగాడు శేఖర్‌ని.

"ఏం లేదోయ్. డెలివరీ కేసొకటి ప్రమాదస్థితిలో వచ్చింది. అవసరమైతే నీకు ఫోనుచేసి రప్పించి నీ సహాయంతో ఆపరేషను చేద్దామనుకున్నాను. ఈలోగా ప్రమాదం లేకుండా, ఆపరేషన్ అవసరం లేకుండానే ఒడ్డెక్కింది." అన్నాడు శేఖర్. అవునన్నట్లు ఫోను మ్రోగింది.

ఫోన్ అందుకున్నాడు శేఖర్. మాట్లాడేడు.

"ఏవిటోయ్, ఫోన్? మా సిస్టర్ నిన్ను వేగం రమ్మంటోందా"

"అవును రాజూ. జానకికి నిన్నటి నుంచీ జ్వరం...."

"అరె.... అయితే వెంటనే వెళ్ళుమరి"

"వీలుచూసుకుని యింటికి రావోయ్ రాజూ."

"అలాగే. మా సిస్టర్‌ని చూడ్డానికి వస్తాగా" అంటూ వెళ్ళిపోయాడు రాజు. రాజుని సాగనంపి వెనుదిరిగిన శేఖర్‌కి "నమస్కారమండీ" అన్న మాటలు వినిపించాయి. రాజారావుగారు. "ఓః మీరా.... మీ అమ్మాయిని బాబుని చూడండి... హాయిగా వున్నారు. మరేం బెంగలేదు. రెండుమూడు రోజుల్లో డిస్చార్జి చేస్తాను. తీసుకెళ్ళవచ్చు" అన్నాడు శేఖర్ తన సీట్లో కూర్చుంటూ.

"అమ్మాయిని యిప్పుడే చూసి వస్తున్నాను డాక్టర్. రాత్రి పరిస్థితి చూస్తే నాకు భయంవేసిందండీ. ఎలాగయినా మీ చేతి చలవవల్ల మా పిల్లకి ప్రమాదం

తప్పింది. చాలా కృతజ్ఞుడ్ని డాక్టర్" అన్నారు రాజారావుగారు చేతులుజోడిస్తూ.

"నాలో ఏముందండీ — అది నా కర్తవ్యం. అంతే."

ఓ క్షణం నిశ్శబ్దం, వారి మధ్య.

"డాక్టర్—మీతో ఓ విషయం మాట్లాడాలి."

"అలాగే మాట్లాడదాం. వుంటారు కదా?" అని పేషెంట్లను చూడ్డానికి ఉపక్రమించాడు శేఖర్. పేరు పేరునా పలకరిస్తూ వారితో మాట్లాడుతూవుంటే అనురాగంతో, కృతజ్ఞతతో వారి మనసు నిండిపోతోంది — రోగులకు అనురాగమే అవధి అన్నట్టు. "పిల్లా పాపల్తో పది కాలాలపాటు సుఖంగా వుండాలి బాబూ మీలాంటి పెద్దోళ్లు" అంటోంది ఒక ముసిలావిడ.

ఆవిడ మాటలు వినిపించి, శేఖర్ భారంగా నిట్టూర్చి అక్కడ నుండి కదిలాడు.

### 3

ఆత్రుతగా యిల్లు చేరిన శేఖర్ జానకికి దగ్గరగా కూర్చొని చేయివేసి చూసాడు. జ్వరం హెచ్చుగా వుంది. అల్మైరాలోంచి మాత్ర తెచ్చి ఆమెను లేపాడు.

"జానకీ!"

బరువుగావున్న కళ్ళను ఎత్తలేక పోతోంది జానకి. 'ఆ(....' అంటూ శేఖర్ చేతి ఊతతో కూర్చుంది. "మాత్ర వేసుకో".

"ఆహారం ఏం తీసుకున్నావు?"

"ఏం లేదండీ.... కాఫీ త్రాగాను. మీరు భోజనం చేయండి."

ఆయా పార్వతమ్మ వడ్డించగా భోజనం ముగించాడు శేఖర్. ఆ యింట్లో వంట మొదలు అన్ని పనులు చేసేది ఆవిడే. ఇద్దరికీ ఆమె మీద బాగా నమ్మకం.

అన్నం తింటూవుంటే పార్వతమ్మ చెప్పింది—జానకి నిన్న సాయంత్రం పేరంటానికి వెళ్ళి వెంటనే వచ్చేసిందిట. అప్పట్నుంచీ ఏడుస్తూ సాయంత్రం అంతా చాలాసేపు గడిపిందట... 'జానకికి మనసుకేం కష్టం కలిగిందో,' అనుకున్నాడు శేఖర్.

భోజనం ముగించి జానకి దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు. అలాగే పడుకుందామె. 'సాయంత్రం అడగొచ్చులే' అనుకున్నాడు.

ఐదు గంటలయినా లేవలేదామె. "హాస్పటల్‌కు ఒకసారి వెళ్లొస్తే చాలు" అనుకుని బయల్దేరుతూ, తానొచ్చేవరకూ వుండమని పార్వతమ్మతో చెప్పి బయలుదేరాడు శేఖర్.

జానకికి జ్వరం తగ్గలేదు. రెండు మూడు రోజులయినా ఆ విషయం అడగలేకపోయాడు.

### 4

ఆరోజు హాస్పటల్‌కి వెళ్ళేసరికి రాజారావుగారు కూర్చున్నారు దిగులుగా.

"ఏమండీ రాజారావుగారూ–రేపు మీ పిల్లను, బాబును తీసుకెళ్లొచ్చు....మరేం బెంగలేదు" అన్నాడు శేఖర్.

రాజారావుగారు దైన్యంతో చూస్తూ అన్నారు: "అక్కడే వుంది డాక్టర్–చిక్కు".

"చిక్కేమిటండీ" ఆశ్చర్యంగా అడిగాడు శేఖర్.

"డాక్టర్–మీరు చెప్పండి–తల్లి లేని నా నిర్మలను ప్రాణానికి ప్రాణంగా కళ్ళల్లో వత్తులు పెట్టుకుని పెంచాను. చదువుకని కాలేజీలో పెడితే ఇలాంటి అప్రతిష్ఠ పని చేసింది. కాలాతీతమయే వరకు నాకేం తెలియలేదు డాక్టర్.... అబార్షన్ చేయిస్తే ప్రాణానికి ముప్పు వస్తుందన్నారు మీ తోటివాళ్ళు. ఇంత వరకు మా పల్లెటూరు వెళ్ళకుండా ఇక్కడే మకాంపెట్టి గడుపుకొచ్చాను. ఇప్పుడు పసిపిల్లడితో మా పల్లెటూరు వెళ్తే....బ్రతకనిస్తారా, చెప్పండి."

"అంటే....మీ ఉద్దేశం...."

"ఏంలేదు డాక్టర్–పిల్లవాడిని ఏ కాన్వెంటులోనో, అనాధ శరణాలయంలోనో పెట్టి పెంచాలనీ, ఆమె పెళ్ళి చేయాలనీ– నాకు డబ్బుకి కొదవలేదు డాక్టర్–కాని నిర్మల ఒప్పడంలేదు–ఆమె పిల్లవాడ్ని విడువలేదుట. అయితే ఇక్కడే ఉండి శాశ్వతంగా...." అతని కంఠం రుద్ధమయింది. మరి చెప్పలేకపోయాడు.

"ఊరుకోండి. నే చెప్తా" అంటూ అతని వెంట నిర్మల దగ్గరకి వచ్చాడు శేఖర్.

శేఖర్‌ని చూస్తూనే నమస్కారం చేసింది నిర్మల.

"ఏమమ్మా–ఏమయింది. నాన్నగారిని కష్టపెడుతున్నావ్" అన్నాడు శేఖర్.

కన్నీళ్ళతో ముఖం ప్రక్కకు తిప్పుకొని మాట్లాడలేదామె.

"నీ పిల్లవాడికేమమ్మా.... ఎవరూ పెంచవద్దు–నేను పెంచుతా – ప్రాణంతో సమానంగా చూస్తా . ఆయన చెప్పినట్లు పెళ్ళిచేసుకొని...."

"ఎవరిని డాక్టర్ ...." ఆమె గొంతు ఉద్విగ్నంగా వణుకుతోంది.

"నువ్వు కోరినవాడిని....నీ శీలాన్ని ప్రతిఫలంగా పుచ్చుకున్నవాడిని ... చెప్పమ్మా వాడెవడో–నీకేం బెంగలేదు... మీ నాన్నగారికి ఆస్థీ అంతస్తూ వున్నాయి. అన్నింటికీ మించిన అధికారం ఉంది. నీ సుఖంకోసం ఏ పనికీ ఆయన వెనుకాడరమ్మా.... నీలాంటి యువతులే న్యాయానికి గీటురాళ్ళలా నిలవాలమ్మా" అన్నాడు ప్రేమగా.

ఆమెలో చలనం, చైతన్యం కలిగాయి.

"ఇదంతా జరిగేదేనా డాక్టరుగారూ..."

"తప్పక–నా శక్తి వంచనలేకుండా సాయంచేస్తా...భయపడకమ్మా" అంటూ ఆమె తలమీద ప్రేమగా నిమురుతూ అన్నాడు.



"చావు ఒక పర్యాయమేనమ్మా జీవికి. పిరికితనం క్షణక్షణానికీ చావు తల్లీ జీవితానికి" అంటూ ఆమె కన్నీళ్ళు తుడిచాడు.

కన్నీటి చారలతో, కరిగిపోయిన గుండెతో, మూర్తీభవించిన శోకదేవతలా ఉందామె.

రాజారావుగారి కేవో పట్టుదల, కార్య దీక్షపై తలంపు కలిగాయి. పిడికిలి మూసి శ్వాస గట్టిగా వదిలారు.

"ఏమంటావు, చెప్పు నిర్మలా?"

చిగురించిన ఆశతో నిర్మల తలూపింది.

తృప్తిగా నిట్టూర్పు విడిచాడు తను.

## 5

జ్వరం తగ్గలేదు జానకికి. మరీ నీరసంగా పాలిపోయింది ముఖం. చెక్కిళ్లు ముందుకు వచ్చాయి. పేలవంగా ఉన్నాయి కళ్ళు. నిరాశ కొట్టొచ్చినట్లుంది ఆమెలో. ఆమె ప్రక్కగావచ్చి కూర్చు న్నాడు. 'రెండు మూడు రోజులకే యిలాగయిందేమిటి' అనుకున్నాడు.

"ఎలాగుంది జానకీ నీ ఒంట్లో?" ఆమెలోవున్న ఆవేదనను తెలుసుకోవా లనే అన్నాడామాట.

"నీరసంగా ఉందండీ- ఫరవాలేదు లెండి, రెండుమూడు రోజులలో అదే సర్దుకుంటుంది" అంది పేలవంగా.

"అలాగనకు జానకీ, ఏదో తెలీని బాధ నీలో నువ్వే దాచుకుంటున్నావు. నాతో చెప్పరాదూ!" అన్నాడు లాలనగా.

"ఏముందండీ, ఎవరితో చెప్పినా ఏమంత తీరేదా, ఎవరయినా తీర్చేదా-" అంది నిస్పృహతో.

"జానకీ! నీ మాట ఎప్పుడయినా

కాదన్నానా_నీ మనస్సుకు కష్టం కలిగించేలా ప్రవర్తించేనా? నువ్వు కష్టపడితే నేను మాత్రం బాధపడనూ। చెప్పు జానకీ_ నువ్వేం చేయమన్నా చేస్తా....ఏం కోరినా తీరుస్తా....నామీద నమ్మకం లేదా?" అన్నాడు- నిబ్బరంతో కూడిన దృఢ స్వరంతో.

"నేను చెప్పినట్లు చేస్తారా" అంది కళ్ల పెద్దవి చేస్తూ.

"నీ మీద వట్టు జానకీ....నీకోసం_ నీ ఆనందం కోసం_ఏమయినా చేస్తాను" అన్నాడు ముందుకు వంగి.

"ఎవరినయినా ఓ అబ్బాయిని పెంచుకుందాం_తేగలరా?"

పిడుగు పడ్డట్టయింది తలమీద శేఖర్కి.

"నువ్వు....ఎలాగనుకుంటే అలాగే చేదాం....ఇంతకీ నీ మనసులోని వ్యధ నాకు చెప్పవూ" అడిగేడు సూటిగా.

అతని అనురాగం, లాలన ఆమెని కదిపివేశాయి.

కన్నీళ్లు ఆగటం లేదు. తను కోరితే ఏమయినా చేయగల తత్వం అతనిది. "ఏం చెప్పాలి...." తటపటాయించింది కొంచెం.

దుఃఖాన్ని దిగమింగుకుంటూ పైట కొంగు అడ్డుపెట్టుకుంది చెప్పలేక_

"చెప్పు జానకీ_నా దగ్గర నీ కెందుకు సందేహం?" అన్నాడు.

"ఏమండీ, నాకు పిల్లల్ని పెంచడం తెలీదండీ? ఎత్తుకోవడం రాదండీ_ చెప్పండీ_నేను పిల్లల్ని ఆడించలేనా। నేను ముట్టుకుంటే పిల్లలు పెరగరండీ। నావి దిష్టి కళ్ళండీ_చెప్పండీ, నిజం చెప్పండీ_చెప్పరూ" అంటూ ఆవేదనతో ఊగిపోతోంది. కన్నీళ్లతో ద్రవించి పోతోంది. మెత్తని హృదయం ముక్కలై పోయిందామెలో. "మాట్లాడండీ_నాకు పిల్లలు లేనంత మాత్రాన నేనెందుకూ పనికిరానా" అంటూ చేతుల్తో ముఖం కప్పుకుని బావురుమంది.

"ఊరుకో జానకీ - ఎవరన్నారీ మాటలు_లేనిపోని ఆలోచనలతో బాధ పడుతున్నావు నువ్వు... ఇంతకీ ఒక పిల్లాడిని తెచ్చి పెంచుకుందాం అంటావు....అంతేనా...."

"అంతేనండీ....అంతే....మీకు సేవ చేస్తూ, మీ అనురాగంతో బ్రతుకుతూ, ఈ యిల్లు కదలకుండా ఆ బిడ్డతో కాలం గడపాలని...అంతే...ఈ చిన్ని కోరిక ...తీర్చలేరూ?"

కదిలిపోయాడతను.

కొండకు గుద్దిన వాగులా రెండు పాయలై కన్నుల నుండి నీరు ప్రవహిస్తోంది ఆమెకు.

బూటు శబ్దంతో 'శేఖర్' అంటూ రాజు వచ్చాడంతలో.

నిశ్శబ్దంగా, దీర్ఘంగా ఆలోచనలో వున్న శేఖర్ని, కన్నీళ్ళతో తడిసి ముద్దయిన జానకిని చూసి ఆశ్చర్య పోయాడు.

"ఏమమ్మా, నీ ఒంట్లో ఎలా ఉంది" అడిగేడు.

"రా తమ్ముడూ, నాకేం ఫరవాలేదు" దుఃఖాన్ని అణచుకునే ప్రయత్నం చేస్తూ అంది జానకి.

"ఏమిటో_మీ దంపతులిద్దరూ దీర్ఘాలోచనలోవున్నట్లు కనబడితే అదోలా వుంది" అన్నాడు రాజు_యిద్దర్నీ పరీక్షగా చూస్తూ.

"ఏం లేదు తమ్ముడూ! అశోక వృక్షాల్లా పెరిగిన మాకు చైతన్యం కలిగించడానికి కాయలే లేవు....పిల్లా పీచూలేని యింటికి ఎవరొస్తారు? ఎవరాదరిస్తారు చెప్పు? ఆ యింటిమీద కాకయినా వాలదు_ మనస్సులో కృంగిపోతూ నలుగురిలో వెర్రిగా బ్రతకాల్సి వస్తోంది."

"ఎవరయినా అన్నారా జానకీ నిన్నీ మాటలు" జానకివైపు తిరిగి అన్నాడు శేఖర్.

"సూటిగా ఎవరంటారండీ యిలాంటి మాటల్ని!" "మరి...."

"మొన్న యీ వీధిలోనే ఒకళ్ళింట్లో పిల్లాడిని ఉయ్యాలలో వేస్తున్నామని పేరంటానికి పిలిస్తే వెళ్ళడం కాస్త ఆలస్యమయింది ... "పిల్లాపీచు లేక పోయినా రావడానికీ ఆలశ్యమేనా!" అని వ్యాఖ్యానించేరండీ.... సర్దుకుని ఊరుకున్నాను....??

"అలాగా!" బాధపడుతూ అన్నాడు శేఖర్.

"నే వట్టుకెళ్ళిన సామాన్లు తినుకుని, ప్రక్కనపెట్టి వాయనమిచ్చారు_ప్రక్క గదిలోనున్న పెద్దావిడను కలుద్దామని లోపలి కెళ్ళాను.... ముత్తయిదువలు కొందరు...నేను...నేను లేననుకొని..." ఆమె మాటలు కంఠంలోనే ఉండి పోయాయి.

అతిప్రయత్నం మీద తనను తాను సంభాళించుకుని అందామె: "నావి దిష్టి కళ్ళని అన్నారండీ.... నాకు పిల్లల్ని ఎత్తుకోడం రాదుట. పలకరించడం రాదుట.... నా చేయి తగిలితే పిల్లలు పెరగరుట_దిష్టి తీసి వాకిట్లో పారేయమన్నారండీ.... ఇంకా ఏవేవో అన్నారండీ....పిల్లలు లేని బ్రతుకు నాకెందు కిచ్చాడో ఆ దేవుడు...." వెక్కి వెక్కి ఏడుస్తోందామె.

"అక్కా....ఊరుకో....ఛ...ఎవరో ఏదో అన్నారని...." రాజు వారించేడు.

శేఖర్ ఆమె దుఃఖం చూసి బాధతో మెలితిరిగిపోయాడు. జరగకూడనిదేదో అదే జరిగిపోయింది....

ఎవరు వేశారీ గాలపురువ్వ, ఆమె హృదయానికి సూటిగా.... ఎందుకిలా జరగాలి...ఆమెను ఓదార్చాలి... ఆమెకు జీవితంపై మళ్ళా ఆశను చిగురింప చేయాలి...ఆమె ఆనందంతో తిరగాలి... అందుకు.... అందుకు తనేం చెయ్యాలి? ఆమెకు నమ్మకం కలిగించాలి.... తప్పదు....

తటాలున ఓ నిర్ణయం తీసుకున్నాడు శేఖర్.

"జానకీ...."

"ఏమండీ?"

"నేనొక తప్పు చేశాను- మన్నించ గలవా చెప్పు?"

ఆమె ఒక క్షణం నిరుత్తర రాలయింది. వెంటనే అంది: "భగవంతుని లాంటి వారు మీరు-మీరు తప్పుచేస్తారా- చెప్పండి" అంది నిర్లిప్తంగా.

"లేదు- నీకు తెలియరాని తప్పు చేశాను జానకీ."

"నాకు మీ రెప్పుడూ ద్రోహం చెయ్య రండీ-నన్ను ఎప్పుడూ యీ విషయంలో నమ్మించలేరండీ మీరు-"

రాజు చప్పున కలుగజేసుకుంటూ అన్నాడు: "శేఖర్- ఇది సమయమేనా ఆ విషయం చెప్పడానికి" ఆపరేషన్ సంగతి చెప్తాడనే భయం కలిగింది రాజుకి.

"ఉండు రాజూ! ఎన్నాళ్ళు దాచినా దాగని సత్యాన్ని మరుగుపర్చడం ఎందుకు?"

అతని గుండె నిబ్బరానికి నిశ్చేష్టు డయ్యాడు రాజు.

జానకి ఆత్రతగా చూడసాగింది.

"నేనొకామెకు ద్రోహం చేశాను జానకీ-ఆవేశంతో నా కళ్ళు మూసుకు పోయాయి....జరగకూడని తప్పు జరిగి పోయింది-ఫలితంగా ఆమెకు కొడుకు పుట్టాడు-

"ఆమెను నీ స్థానంలో ఊహించుకో గలవా జానకీ- చెప్పు- నీ వలన జరిగే పనేనా యిది? చెప్పు జానకీ-"

అంతటి గాంభీర్యం శేఖర్‌లో ఎప్పుడూ చూడలేదామె.

రాజుకి అంతా అయోమయంగావుంది. అచేతనంగా కూర్చొని ఆలోచనల్లో పడ్డాడు. "ఇది.... ఇదెలా సంభవం? ఒకవేళ.... ఆపరేషన్ ఫెయిలయిందా... ఓ మైగాడ్...."

"ఏమండీ మీరు తప్పు చేస్తే నేను భరిస్తానండీ- సహిస్తానండీ- ఏనాడూ మీ సాన్నిధ్యంలో ఏలోటూ ఎరగనండీ నేను....మీరేం చేసినా నేను సహిస్తా నండీ...." అందామె ప్రేమతో, అనురాగంతో.

'అనురాగానికి అవధు లుంటాయా!' అనిపించింది శేఖర్‌కి ఆ క్షణంలో.

"ఆమె ఎక్కడుందండీ- నే వెళ్ళి తీసుకొస్తాను, చెప్పండీ- ఆమెకు అన్యాయం జరగకూడదండీ-" ఆమె హృదయ వైశాల్యానికి వెన్నలా కరిగి పోయాడతను.

"ఇంతకీ మీ కేంలోటు కనుక-ఆమెను తీసుకురండీ...."

"క్షమించు జానకీ! ఆమె .."

"ఆమె....ఏమయిందండీ.... ఆత్మ హత్య చేసుకుందా! చెప్పరూ !"

"లేదు జానకీ- పురిట్లోనే పిల్లాడిని కని చనిపోయింది" అంటూ రుమాలుతో

కన్నీళ్ళు ఒత్తుకుని దూరంగా నిలబడ్డాడు వెనుదిరిగి.

"ఎంత పని జరిగిందండీ.... ఇంతకీ బాబు.... మీ ప్రతిరూపం.... బాబు ఎక్కడున్నాడండీ.... వాడ్ని సంతానంగా భావిస్తానండీ–నా కోరిక తీరా పెంచుతా" అంటూ లేవబోయింది.

"జానకీ!" అంటూ ఆమెను చేతులు పట్టుకుని పడుకోబెట్టాడు శేఖర్.

"ఏమండీ .. బాబును...."

"రేపు ఉదయం తెస్తాను. విశ్రాంతి తీసుకో".

*  *  *

జరుగుతున్నదంతా కలో, నిజమో తెలియడంలేదు రాజుకి. శరీరం వశంలో లేదు. 'ఇలారా' అంటూ శేఖర్‌ను వాకిటి ద్వారం దగ్గరకు తీసుకెళ్ళాడు.

ఇంత కాలానికి యింట్లోకి నవ్వుల పువ్వులు వెదజల్లే బాబు వస్తున్నాడనే ఆనందంతో జానకి తృప్తిగా గదిలోవున్న వెంకటేశ్వరస్వామికి నమస్కరించాలని వెళ్ళింది.

ఆమెకు వారి మాటలు చెవిని పడుతున్నాయి.

"శేఖర్–నువ్వు డాక్టరువే అనుకున్నాను యింతవరకూ–నువ్వు సరైన నటుడివిరా–నీకు ఆపరేషన్ చేసిన నన్ను కూడా నమ్మించావు– అనాథ బిడ్డకు తండ్రివి కావడానికి సిద్ధపడ్డావు–పిల్లలు కలగని నీ భార్యకి మాతృత్వం కలిగించావు– చెయ్యని తప్పుని తలమీద వేసుకుని అందర్నీ నమ్మించావు. నన్ను మెప్పించావు... సరే... ఇంతకీ పిల్లవాడిని ఎక్కడ నుండి తెస్తావు" అన్నాడు రాజు సందేహంగా.

"హాస్పటల్లో ఉన్నాడు–నిర్మలవద్ద."

"నిర్మలా! ఆమె.... ఆమె ఎవరు?" కళ్ళు విప్పారాయి రాజుకి.

"ఏమో– ఆమె నా పేషెంట్‌గా చేరింది. బిడ్డని కని, రేపే డిస్చార్జి కాబోతోంది.... అంతే.... అంతే తెలుసు నాకామె గురించి."

ఇంకా ఏదో అడగబోతున్న రాజుకి 'ఉష్.... మీ అక్క...' అంటూ మంచం వేపు చూపిస్తూ మౌనంగా వారించాడు శేఖర్.

"నీ విశాల హృదయానికి నా అభినందనలు శేఖర్" అంటూ రెండు చేతుల్తో గట్టిగా పెనవేసుకుని హత్తుకున్నాడు రాజు.

ఆ దృశ్యం కిటికీలో నుంచి ఆమె కళ్ళపడింది.

*  *  *

మర్నాడు–

బాబుని ప్రక్కలో వేసుకుని, మురిసిపోతున్న జానకి కళ్లలో వేయి దీపాల వెలుగుచూసి పొంగిపోయాడు శేఖర్.

———



# నాకు నచ్చిన నా కథ

నేను దాదాపు నుమారు మూడు సంవత్స రాల నుంచీ కథలు వ్రాస్తున్నాను. ఇప్పటికి 600లకు పైగా కథలు వ్రాశాను. వీటిల్లో నాకు నచ్చిన కథలు ఎన్నో వున్నాయి. అన్నింటికంటె ఈ కథ బాగా నచ్చకపోయినా, అందుబాటులోవున్న నచ్చిన కథల్లో ఈ కథ నాకు బాగా నచ్చింది. ఈ కథ వ్రాసి దాదాపు 15 సంవత్సరాలై వుంటుంది. ఈ కథను ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికకు పంపినప్పుడు మిత్రుడు శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు మరీ మరీ మెచ్చు కుంటూ ప్రత్యేకంగా ఉత్తరం రాశారు. అప్పుడనిపించింది- ఇది మంచి కథని. తర్వాత చాలమంది పాఠకులు, రచయితలు ఈ కథపై సదభిప్రాయాన్ని వెలి బుచ్చారు. ఈ కథ నాకూ, మరి చాలమందికీ ఎందుకు నచ్చిందో – మీరూ చదివితే మీకూ బోధపడగలదు.

రమారమి మూడున్నర దశాబ్దాల నుంచీ ఇటు తెలుగులోనూ, అటు ఇంగ్లీషు లోనూ దేశ దేశాల కథలు చదువుతున్నాను. గురజాడ అప్పారావుగారి 'దిద్దుబాటు' కథ నుంచీ 1980 చక్రపాణి అవార్డు పొందిన 'సబ్బు' కథ దాకా; మపాసా కథల నుంచి 1980లో 'టైమ్' మ్యాగజీన్ ఉత్తమంగా ఎంపికచేసిన యుడోరా వెల్టీ కథల వరకూ కొన్ని వేల కథలు చదివాను. ప్రపంచ కథాసాహిత్యంలో ఎన్నో మార్పులూ, ధోరణులూ వస్తున్నాయి. అయితే గత ఏడెనిమిది సంవత్స రాలనుంచీ తెలుగు కథ అభివృద్ధిలో స్తబ్ధత గోచరిస్తోంది. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన దగ్గర్నుంచీ దాదాపు పాతికేళ్ల వరకూ తెలుగులో ఎన్నో మంచి కథలు వచ్చాయి. ఈ మధ్య కాలంలో అంతగా మంచి కథలు రావడం లేదు. కథల రాశి పెరుగుతూంది గానీ, నాణ్యత తగ్గిపోతోంది. వస్తువులో వైవిధ్యం, శిల్పంలో నవ్యత్వం, కథలో ప్రయోజనం – వీటి పట్ల కథలు వ్రాసేవారు శ్రద్ధ కనబర్చాల్సిన అవశ్యకత ఎంతైనా వుంది.

—తాళ్లూరు నాగేశ్వరరావు

# ప్రేమికుని ఆంతరంగిక ప్రపంచం

సాయంత్రపు సూర్యుడు మబ్బుల్ని ఎర్రగా వెలిగించి, ఆ కాంతి లోకంపై అందంగా పడుతూండగా, నిష్క్రమించటానికి ఆజీలుగా ఉన్నాడు.

ఆ సమయంలో హైదరాబాద్ ఆబిడ్ సర్కిల్ బస్సుస్టాప్ దగ్గర చిన్ననాటి మిత్రులు కాంతారావూ, ముత్యాలరావూ హఠాత్తుగా, ఆశ్చర్యంగా కలుసుకున్నారు. బందరులో కాలేజీ చదువు ముగించాక ఈ ఏడెనిమిది సంవత్సరాలలో వాళ్లెప్పుడూ ఒకళ్ళ కొకళ్ళు తటస్థపడలేదు. సభ్యతా నాగరికతలను మరిచి ఇరువురూ అమాంతంగా కౌగలించుకున్నంత ఆత్మీయతను చూపులద్వారా, మాటలద్వారా వెల్లడించుకున్నారు.

"ఏం చేస్తున్నావు ఇక్కడ?" అన్నాడు కాంతారావు.

"ఎ. జి. ఆఫీసులో యు. డి. సి. – మరి నువ్వో!" అన్నాడు ముత్యాలరావు.

"నేను ఎల్. ఐ. సి. లో అసిస్టెంటును" అన్నాడు కాంతారావు.

ఇద్దరూ దగ్గరలో ఉన్న ఓ పెద్ద హోటలుకు వెళ్ళారు. కాఫీ త్రాగుతూ ఓ పావుగంటసేపు కులాసాగా, పాత జ్ఞాపకాల్ని వల్లించుకుంటూ కబుర్లు చెప్పుకున్నారు. పొగబారిన తమ పూర్వ స్నేహానుబంధాన్ని చక్కగా తుడిచి అద్దం వలె పెట్టుకున్నారు.

"పిల్లలెంతమంది?" అన్నాడు కాంతారావు అతనికి పెళ్ళి అయివుంటుందనే ఉద్దేశంతో.

"ఒక అమ్మాయి. మరి నీకూ!" అన్నాడు ముత్యాలరావు.

"ఇద్దరు, ఒక అమ్మాయి, ఒక అబ్బాయి." అన్నాడు కాంతారావు.

కాఫీ బిల్లు యివ్వడానికి ముత్యాలరావే ముందంజ వేశాడు. కౌంటరు దగ్గర ప్యాంటు జేబులోంచి పర్సు తీసి, రూపాయి నోటు లాగుతూంటే, ఆ పర్సు

లోంచి ఓ చిన్న ఫొటో క్రిందబడింది. కాంతారావు గబుక్కున క్రిందకు వంగి ఆ ఫోటోను తీసుకొన్నాడు. ఆ ఫొటో ఒక యువతిది. లోకోత్తరమైన రూపు రేఖా విలాసాలతో ఆ యువతి అప్సరసవలె ఉంది. ఆ పరక్షణంలోనే ఆమె ఆ నవ్య సౌందర్య విశేషం అతని హృదయఫలకంపై బొమ్మ కట్టింది. ఆ ఫొటోను మిత్రునకిస్తూ, "ఎవరిదీ ఫొటో. మీ శ్రీమతిదా?" అన్నాడు కాంతారావు.

"ఊఁ" అన్నాడు ముత్యాలరావు.

"నువ్వు భలే అదృష్టవంతుడువోయ్! అందమైన భార్యను పొందా. నీవే బ్రతుకులో సుఖాలు తేనె సౌరలే!" అన్నాడు కాంతారావు హోటల్నుంచి బయటకు వస్తూ.

"మీ ఆవిడ అందంగా వుండదా" అన్నాడు ముత్యాలరావు అమాయకంగా.

"మా ఆవిడ సంగతి చెప్పు - పాత చింతపండు తొక్కు. పూర్వజన్మలో చేసుకున్న పాపానికి ఈ జన్మలో శాపంగా నా జీవితంలో అడుగుపెట్టిన శూర్పణఖ!" అన్నాడు కాంతారావు.

ముత్యాలరావు మొహం ముసి ముసి నవ్వులతో ముద్దుకట్టింది.

ఆ మిత్రు లిద్దరూ బస్సుస్టాపులో బస్సులు వచ్చి ఆగగానే విడిపోయారు.

బ్రహ్మదేవుడు ఆగ్రహావేశంతో సృష్టించిన వికృతరూపం ముత్యాలరావుది. తుమ్మబెరుడులాంటి శరీరఛాయ; పైగా చెదలు తిన్నట్టు గుంటలుబడ్డ మసూచికపు మచ్చలు; నుదురు వెడల్పు: ముక్కు వంకర; మూతి పొడుగు; చెంపలు అప్పడాలు; కళ్ళు పాతాళ గంగలు; జుత్తు జొన్న కంకులు. కాలేజీలో బి. కామ్ చదువుతున్న రోజులలో క్లాసు పిల్లలంతా ఎగతాళి పట్టిస్తూండేవారు. 'ఈ నల కూబరునికి ఏ రంభ భార్యగా లభిస్తుందని.' అల్లాగే నిజంగానే రంభలాంటి స్త్రీయే భార్యగా లభించింది; వివాహాలు కూడా సృష్టి రహస్య లీలా విశేషాలే! 'తన లాంటి అందగాడికి కురూపిలాంటి భార్యా!' అనుకున్నాడు కాంతారావు సిటీ బస్సులో.

నెల రోజుల పిమ్మట ఓ రోజు సాయంకాలం కాకతాళీయంగా మిత్రులిద్దరూ పబ్లిక్ గార్డెన్‌లో పచ్చగడ్డిపై కలుసుకున్నారు. ముత్యాలరావు వెంట ఓ నాలుగేళ్ల అమ్మాయి ఉంది. పుత్తడి బొమ్మ. చక్కని రూపుగల్గి అందాన్నంతా పుణికిపుచ్చుకుని జన్మ ఎత్తిన పిల్ల. ఆ అమ్మాయి అందచందాలకు తన కూతురు రూపురేఖలకూ బేరీజు వేసుకుని న్యూనతాభావంతో క్రుంగిపోయాడు కాంతారావు. ఆ అమ్మాయిని దగ్గరకు తీసుకుని మనసారా ముద్దాడి, నవ్వించి,

నవ్వుకుని ఆనందించాడు. తర్వాత ఓ నెమిలిపిల్ల రాగా దానితో ఆడుకోవటానికి ఆ అమ్మాయి పరుగెత్తింది. "షీలా! జాగ్రత్త! దూరం పోకు! మారుపడిపో గలవు" అని హెచ్చరించాడు ముత్యాలరావు.

"నీ అమ్మాయి ఎంత ముద్దు వస్తుందోయ్! అచ్చు మీ ఆవిడ పోలికలే" అన్నాడు కాంతారావు.

చిన్నగా నవ్వుకున్నాడు ముత్యాలరావు. ఆ నవ్వులో గర్వం కిరణంలా పొడుచుకొచ్చింది.

"నువ్వు పిల్లల్ని ఇట్లా షికారుకు తీసుకురావా?" అన్నాడు ముత్యాలరావు.

"కారు చింతపండు సరుకు, వాళ్ళను తీసుకు వస్తే నా పరువు మర్యాదలు పారిపోవాల్సిందే!" అన్నాడు కాంతారావు.

ముత్యాలరావు ఒక్కసారిగా పెద్ద పెట్టున నవ్వాడు. కాంతారావు విస్మయంగా అతనికేసి చూశాడు.

నవ్వుతూ నవ్వుతూనే హఠాత్తుగా ఆ నవ్వును ఆపి, గుండెను చేత్తో పట్టుకుని బరువుగా అదుముకున్నాడు.

"ఏమిటోయ్!" అన్నాడు కాంతారావు అదుర్దాగా.

ముత్యాలరావు కొంచెం తమాయించుకుని, "కొంచెం గుండె నొప్పిగా ఉంది. తగ్గిందిలే, కాదు.... నీ మాటలకు నవ్వొచ్చి...." అన్నాడు.

దూరంగా ధాలియా పువ్వుల మీదనుంచి సూర్యుడు దిగిపోతున్నాడు. నారింజపండు రంగులాంటి సూర్యుని ఆఖరి మెత్తని కాంతికి పబ్లిక్ గార్డెన్‌లోని రంగు రంగుల పువ్వులు ఆనందోజ్జ్వలంగా వీడ్కోలు చెబుతున్నట్టున్నాయి.

"ఒకసారి మా యింటికి రావోయ్! నువ్వే చూద్దువుగాని - మా ఆవిడనూ, పిల్లలనూ," అన్నాడు కాంతారావు. తన అడ్రసు చెప్పాడు.

కాని ముత్యాలరావు తన అడ్రసు చెప్పి, మిత్రుణ్ణి తన ఇంటికి రమ్మనమని ఆప్యాయంగా ఆహ్వానించలేదు. కాంతారావు మనస్సు కలుక్కుమన్నది. స్త్రీ అందం నయాగరా జలపాతం, హిమాలయ సానువులు తాజ్‌మహల్ సౌందర్యాల వలె ప్రజలందరికీ సంబంధించినవి కాదు గదా! తన భార్య అందాన్ని ఎదుటివాడు ప్రత్యక్షంగా మెచ్చుకోవడాన్ని ఏ భర్తా సహించలేడు. అందులో అందవిహీనుడికి అందమైన భార్య లభిస్తే అతని మానసిక ప్రపంచం వేరు. అది నర్మాదా నది కంటె ఇరుకైనది. అందుచేతనే ముత్యాలరావు తనని తన ఇంటికి రమ్మనమని ఆహ్వానించలేదని కాంతారావు సులభంగా ఊహించాడు. అయినప్పటికీ అతను ఉండబట్టలేక నోరు తెరిచి అడిగాడు.

"నువ్వెక్కడ వుంటున్నావ్ ? అడ్రసేమిటి ?"

గుటక గొంతులోకి జారని అయిష్టంతోనే తన అడ్రసు చెప్పాడు ముత్యాల రావు: "బర్కత్‌పురా, ఆంధ్ర యువతీమండలి ఎదురుగల్లీలో." ఆ అడ్రసును డైరీలో వ్రాసుకున్నాడు కాంతారావు.

కనిచీకటి ప్రవేశించడంతో, మిత్రు లిద్దరూ పబ్లిక్ గార్డెన్ నుంచి విడిపోయారు.

* * *

ఓ పక్షం రోజులు గడిచాక, ఆదివారంనాడు ముత్యాలరావు ఏదో పని వుండి శాంతినగర్ కాలనీకేసి వెళ్ళితే, అక్కడ హఠాత్తుగా కాంతారావు కనబడ్డాడు. మిత్రుణ్ణి తన ఇంటికి తీసికెళ్ళేవరకూ వూరుకోలేదు కాంతారావు.

ఒక డాబాలో చిన్న పోర్షన్ - దానికే తొంభై రూపాయిలు అద్దె చెల్లిస్తున్నాడట. తన భార్యనూ పిల్లల్నీ ఎదురుగా నిలబెట్టి మిత్రునికి పరిచయం చేశాడు కాంతారావు.

"మా ఆవిడ మీ ఆవిడలాగా అందగత్తె కాదు. మా పిల్లలు కూడా మీ అమ్మాయిలాగా ముద్దు వచ్చేవాళ్ళుకాదు" అన్నాడు కాంతారావు నిర్మొహమాటంగా.

"అఁ అందాన్ని కోసుకు కూర వండుకుంటామా ?" అన్నాడు ముత్యాలరావు పైమాటకు.

ఆయన కూడా అందంలో తన తరగతికి చెందినవాడే ననుకున్నది కాంతారావు భార్య ముత్యాలరావును చూసి.

మిత్రు లిద్దరూ "నెస్‌కేఫ్" సేవించి, ఓ అరగంటసేపు హాయిగా కబుర్లు చెప్పుకున్నారు. కాంతారావు విసరిన ఓ జోకుకు పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వుతూ ముత్యాలరావు గుండెను గట్టిగా అరిచేతులతో పట్టుకుని, "నొప్పి, నొప్పి" అంటూ కేక వేశాడు.

భయోత్పాతంతో కాంతారావుకు ముచ్చెమట్లు పోశాయి.

ముత్యాలరావు పేం కుర్చీలో కూర్చున్న పాటుగానే వాలిపోయాడు.

వెంటనే మిత్రుణ్ణి దగ్గరున్న హాస్పిటల్లోకి చేర్చాడు కాంతారావు. కాని అంతకు రెండు నిమిషాల క్రితమే ముత్యాలరావు గుండె పనిజేయడం మాని వేసింది.

మిత్రుని అకాల మరణానికి దుఃఖోద్వేగంతో కాంతారావు బెంబేలుపడి పోయాడు. కొన్ని నిమిషాలపాటు కాలూ, చేయీ ఆడలేదు. మనస్సు మేటవేసి పోయింది. ఆ దుర్వార్తను అతని భార్యకు ఎట్లా తెలియబర్చడం?

టాక్సీ చేసుకుని కాంతారావు బర్కత్‌పురా వెళ్ళాడు. ఆంధ్ర యువతీ మండలి ఎదురు గల్లీలో వున్న ఓ డాబా దగ్గరకు వెళ్ళి ఇంటి నెంబరు పోల్చుకున్నాడు. అదే ముత్యాలరావు వుండే ఇల్లు అయి ఉంటుందని నిశ్చయించుకున్నాడు. అందుకు తగినట్టుగానే ముత్యాలరావు భార్య వాకిట్లో నిలబడి ఉంది. కూతురు లోపల బొమ్మలతో ఆడుకుంటూ కనబడింది. ఫొటోలో చూసిన అతని భార్యనూ, పబ్లిక్ గార్డెన్‌లో చూసిన అతని కూతురునూ సులభంగా గుర్తించాడు కాంతారావు.

ఆమె దగ్గరకు వెళ్ళి, మబ్బులు పట్టిన ఆకాశపు మొహంతో దిగాలుపడి నిలబడ్డాడు కాంతారావు, ఆ దుర్వార్తను ఎట్లా అందజేయాలలో నోరు ముందుకు రావడంలేదు.

"ఎవరికోసం ? ఏం పనిమీద వచ్చారు ?" అన్నదామె సౌమ్యంగా.

"మీకో దుర్వార్త చెప్పడానికి భయపడుతున్నాను." అన్నాడు కాంతారావు దుఃఖంలో ధైర్యాన్ని చిక్కబట్టుకుని.

ఆమె అప్రతిభురాలైంది.

"ఏమిటది ?"

"ముత్యాలరావుగారు గుండెపోటుతో హఠాత్తుగా మరణించారు. శవం హాస్పిటల్లోనే ఉంది." అన్నాడు కాంతారావు బొంగురుపోయిన గొంతుతో.

"అయ్యో ? పాపం.... అప్పుడే నూరేళ్ళు నిండాయా ? ఎంత దారుణం ! అతని తలిదండ్రులకు తెలియజేయండి.... వాళ్ళు ఎక్కడ వుంటున్నారో కూడా నాకు తెలియదండీ !" అన్నదామె గాఢ సంతాపాన్ని తెలియబరుస్తూ.

కాంతారావు నిర్విణ్ణుడైనాడు.

"ఆయనకు భార్యా, ఒక అమ్మాయి...."

"ఆయన కింకా పెళ్ళి కాలేదండీ. మా ఇంటి పై పోర్షనులో ఉంటున్నాడు. గుండెజబ్బుకు మందులు తీసికోమని మా వారు ఎంత చెప్పినా వినేవాడు కాదు...." అన్నదామె సానుభూతిగా.

---

వచ్చే సంచికలో

ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారి

## నాకు నచ్చిన నా కథ

# జీవనఘోష

## యామినీ సరస్వతి

మనిషి జీవించటానికో వృత్తి కావాలి.

వృత్తి ఒక్కోసారి ప్రవృత్తిపై ఆధారపడి వుంటుంది. మరోసారి మన ప్రవృత్తికి సరిపోకున్నా జీవనంకోసం ఏదో ఒక వృత్తిని చేపట్టవలసి వుంటుంది. మనిషి బ్రతకడానికి వృత్తి ఆలంబనం. ఉద్యోగం, వ్యవసాయం, వ్యాపారం యివన్నీ వృత్తికి పర్యాయ పదాలే। అయితే ఒక్కో వృత్తికి గౌరవం వుంటుంది. రత్నాల వ్యాపారికున్న గౌరవం వంటచెరుకు అమ్ముకునేవారికి వుండదు. కానయితే డిగ్నిటీ ఆఫ్ లేబర్ దృష్ట్యా పారిశ్రామికుడు, పాకీవాడూ ఒకటే.

కానీ కొన్ని వ్యాపారాలు సమాజానికి ఎంత అవసరమయినా అవి అభిశప్తాలే। అవి అందరికీ అవసరమే అయినా ప్రతి వాళ్లూ దాన్ని అసహ్యించుకుంటారు. మేదరి సుంకన్న చేసే వ్యాపారం అలాటిది. అది వాడి కులవృత్తి లాటిది. వాడు చిన్నప్పుడు సోమరిపోతై తనవాళ్లలాగా వృత్తి విద్య నేర్చుకోలేదు. చదువూ అబ్బలేదు. బుట్టలు, చాపలు, విసనకర్రలు లాటివి వాడికి అల్లటం రాలేదు. రికామిగా తిరిగి తిరికి ఆఖరికి ఓ అమ్మాయిని పెళ్లిచేసుకున్నాక వాడికి తనలో లోపమేమిటో తెలిసొచ్చింది.

దాంతో వాడు ఆలోచించింది తన కాపరాన్ని దగ్గర్లో వున్న టౌన్‌కి మార్చేడు. అక్కడే తన వృత్తిని ఏర్పరచుకున్నాడు. మాంస విక్రయం అసహ్యం కాదు. కానీ సుంకన్న చేపట్టిన వృత్తి మాత్రం వళ్లు జలదరింపచేస్తుంది. అలా అని ఎవరికీ అది అవసరం కాదనలేం. ప్రతి వ్యక్తికీ ఎప్పుడో ఒకప్పుడు సుంకన్నతో, వాడి పనితో అవసరం రాకపోదు. ఇంతకీ వాడు చేసేది పాడుకట్ల సవారీ తయారీ। అంటే ఇంకేం లేదు రేడీమేడ్‌గా 'పాడె'లు తయారుచేసి అమ్మటం.

'ఈ వూళ్లో రెండు లక్షల మంది జనం వున్నారు. రోజూ ఒకరో యిద్దరో చావకుండా వుండరు. మనిషి పోయినాక

పాడెక్కటలకు. పెతుక్కోక తప్పదు. అప్పటి కప్పుడు కట్టుకోటం కష్టం. కష్టమే కాదు బాధ! కొత్త వెదుర్లు తేవాలి. వాటిని నరకాలి. శాస్త్ర ప్రకారంగా కట్టాలి. బంధువులు—తల్లో, తండ్రో, అన్నో, తమ్ముడో, భార్యో, భర్తో పోయిన దుఃఖంలో ఏడుస్తూ కూచుంటారా? ఈ పాడెకడుతూ కూర్చుంటారా?

అందుకని యిది రెడీమేడ్‌గా వుంటే మన ముఖాన పదిరూపాయలు పడేసి కొనుక్కు వెళతారు! రోజూ అడవికి వెళ్ళి వెదుళ్ళు కొట్టుకరావచ్చు. ఎంత! బస్సులో వెళితే గంట ప్రయాణం. పొద్దున్న పోతే మధ్యాన్నానికి రావచ్చు. రోజుకి రెండు జతలు చెయ్యొచ్చు. పది రూపాయలు ఖర్చు పోయినా, మనకు దాదాపు ముప్పై మిగులుతాయి! దీన్ని ఎవరూ బేరం చెయ్యరు. చెప్పిన ధరకు కొనుక్కు పోతారు!

టౌనుకి పోయేముందు భార్యకి వివరంగా చెప్పాడు సుంకన్న. వాడి మాటల్లో నిజాన్ని గుర్తించింది సుంకమ్మ. దానికి మొగుడి బీకారీగా తిరుగుతూ కుటుంబంలో, తన వాళ్ళల్లో వ్యర్థుడుగా వుండటం బాధగా వుంది. పైగా టౌను కాపరం అంటే దానికీ వుత్సాహంగా వుంది. సినిమాలు చూడొచ్చు! హోటళ్ళో బుద్ధిపుట్టినపుడు కోరిన తిండి తినొచ్చు. డబ్బుకి చూసుకోకపోతే టౌన్లో ఎంతయినా సుఖం వుంది అనుకుంది సుంకమ్మ.

అందుకే అందరూ ఎంత వారించినా వినకుండా భర్తతో టౌన్ చేరి కాపరం పెట్టింది. పింగు రంగా అంటూ కులాసాగా కాపరం సాగిపోతుంది.

సుంకన్న అంచనా తప్పు కాలేదు. రోజుకి ఒకటో రెండో అనుకున్నవి వాడికి ఒక్కోరోజు అయిదారు కర్చయ్యేవి. వాడి దృష్టిలో అదృష్టం కలిసొచ్చి, కలరా వస్తే ఇంకా ఎక్కువే ఖర్చయ్యేవి. వారంలో ఏదయినా ఒక రోజు ఖర్చు కాకున్నా ఆ లోటు పూడేట్టుగా మరో రోజు ఖర్చయ్యేది. వాడు రోజూ కొండకు వెళ్ళి వెదుళ్ళు తెచ్చేవాడు. మధ్యాహ్నానికల్లా వాటిని తయారు చేసేవాడు. సాయంకాలం అంతా విశ్రాంతి. జల్సాగా నాటుసారా కొట్టేసి భార్యతో చిలకాగోరింకల్లాగా గడిపేవాడు.

అయితే వాడికి కొత్తలో యీ వ్యాపారం జోరుగా సాగినా అప్పటికే టౌన్‌చేరిన వాడి కులస్థులు అంతదాకా విసనకర్రలు, బుట్టలు, చేటలు అల్లి బ్రతికేవాళ్ళు వీడికి పోటీగా తయారయ్యారు. అయినా వీడికి తిండికి లోటు జరగలేదు.

* * *

వారం రోజులైంది.

ఒక్కటైనా అమ్ముడు పోలేదు. ఈ



వారం రోజులుగా రోజూ అడవికి బస్సులో వెళ్లి వెదుర్లు తెచ్చి వాటిని తయారు చేస్తూనే వున్నాడు. దాదాపు ముప్పై నలభై 'పాడెలు' తయారు చేశాడు.

వాటిని అలా చూసినప్పుడల్లా వాడికి గుండెల్లో జల్లుమంటోంది ఇప్పుడు.
'వారమైంది! ఒక్కటి కూడా ఖర్చు కాలేదు!' విసురుగా నిరాశగా అన్నాడు వాటివైపు చూస్తూ.

సుంకమ్మ బదులు చెప్పలేదు.

'ఇంత టౌన్లో ఎవడూ చావలేదా?'

'ఏమో ! చస్తే ఎందుకు రారు ?'

'అదేం మాటలే ! మన అంగడేనా వుండేది. ఇంత వూళ్లో ఎవరూ యిన్ని రోజులుగా చావటం లేదంటే చిత్రంగా వుండదూ ! ఎక్కడో కొనుక్కు-పోతుంటారు !'

సుంకమ్మ ఏమీ అనలేదు.

'గంజయినా చేసినావా ?'

'గంజెందుకులే ! అన్నం వండినా ! మనింటికి నాలుగిళ్ల వతల సెట్టి గారుం డలే ! వాళ్లంగడిలో బియ్యం బాకీ తెచ్చినా ! రేపిస్తానని చెప్పినా ?'

'రేపెట్లా యిస్తావే ?

'దేవుడి దయ ! మన అదృష్టం ! ఒక్కటి ఖర్చయినా ఆ అప్పు తీరి పోతుంది !'

నిట్టూర్చాడు సుంకన్న 'ప్చ్! సుంకీ! ఊరి నిండా డాక్టర్లేనే ! ఎట్లాంటి జబ్బు కయినా మందిస్తున్నారు. బాగుచేస్తున్నారు. డబ్బులు గుంజుతున్నారు. వాళ్లు బాగుపడు తున్నారు!"

'మనోళ్లెట్లో దుమ్ము కొడతన్నారు. దేశంలో జనం పెరిగిపోతన్నారు. తిండి సాలంటలా! బట్ట ల్సాలటంలా ! పిల్లలు కనద్దు అనకపోతే చచ్చే జనాన్ని సావ నివ్వకూడదూ ! దరిద్రం తీరిపోద్ది. ఎక్కడ సూసినా ఆస్పత్రులు ! డాక్టర్లు! ఏందో ! అంతా యిసిత్రం యవ్వారం !'

'ఈ మాట గవర్నమెంటుకు ఎవరు చెప్తారు ? చెప్పినా వాళ్లింటారా ? ఇంతే ఓట్లు పడొద్దూ?'

'సర్లే ! ఈ యవ్వారం యిప్పట్లో తెగదు. అన్నం తిందువు కాని రా !'

నిరాశగా లేచాడు సుంకన్న.

* * *

మరి రెండు రోజులు గడిచాయి. ఈ రెండు రోజులూ స్టాకు పెరగటమే కానీ ఒక్క శాల్తీకూడా పోకపోవడంతో ఒక్కటి కూడా ఖర్చు కాలేదు. రెండు రోజుల క్రితం తెచ్చిన అప్పు సరకులు అయిపోయాయి. పైగా అడవికి వెళ్ల టానికి మరో నాలుగయిదు రూపాయలు ఎదురింట్లో అప్పు తేవలసివచ్చింది.

'ఛ ! ఛ ! పాడు మనషులు ! లోకంలో పాపం రోజురోజుకి పెరుగు తుంది. అందుకే మనషులంతా బాగు న్నారు. పుణ్యాత్ములయితే గదా మంచాన పడకుండా పోవడానికి. అవ తలి వీధిలో పొరతమయ్యా భార్య జబ్బుతో వుంది. ఒక్కనాడా ? ఒక్క నెలా ? ఒక్క యాడాదా ? రెండేండ్ల యింది ? మంచంలో వున్న మనిషి మంచంలోనే వుంది. చావదు. బతకదు.

నిన్న గొరగొర మంటోందని అంతా గొల్లుమన్నారు. అయ్యగారు కూడా నన్ను ఎచ్చరించినారు. ఎన్నాళ్లని అలా బరువుమోస్తారు. వాళ్లకీ విసుగొచ్చింది. అయితేనేం ? ఈయాల పొద్దున్నించీ కళ్లు తెరిచి, మాట్లాడి తిండి తింటుందట!'

'ఏం చేస్తాం మన కర్మ !'

'ఎట్టనే బతికేది ?'

'నేనూ విసనకర్రలు అల్లి తీసుకుపోయినా! మన యాపారం దెలుసు కాబట్టి ఎవరూ కొనలా! వాటయా తీసుకోలా! ఏం జేస్తాం

నిట్టూర్చాడు సుంకన్న 'ఇదిగో సుంకీ! నాకు పిచ్చిరేగిపోతుంది. ఎక్కడన్నా దొంగతనంచేద్దామా అనిపిస్తోంది!'

'అయ్యయ్యో! ఎంత పాడుమాటన్నావు? దొంగతనమా? ఛ! ఛ! మనకేం కర్మ! మనం కష్టపడుతున్నాం. బతుకుతున్నాం. కష్టం చేయలేని దొంగనాయళ్లు ఆ పని చేయాలి! మనమా?' అసహ్యం అంతా సుంకి ముఖంలో మాటల్లో కనిపించింది.

సుంకన్న మాటాళ్లేదు. "ఒసే!" అన్నాడు హఠాత్తుగా ఏదో తోచినట్టై.

'ఏం?'

'ఎవరినన్నా సంపేస్తేనో!'

'ఛ! ఛ! నీకు ఆకల్తో బుద్ధి పోయినట్టుంది. మన కడుపు కోసం యితర్లని చంపాల్నా? భగవంతుడిచ్చిన పాణాన్ని తీసే హక్కు నీకెక్కడిది? ఎవరి కర్మ ఎట్టా వుంటదో! మన మెందుకు పానం దీసి పాపం గట్టుకోవాల! ఇయ్యాల కాకుంటే రేపు సస్తారు ఎవరో ఒకరు! ఇంత వూరుంది! ఎవరో చావకపోతారా! మనకు గిరాకీ రాదా? అంతవరకూ ఓపిక పడదాం. అప్పో సప్పో చేసి బతుకుతుందాం! అయినా నీ బుద్ధి ఏందిట్టా మారిపోతంది?'

కిక్కురుమన్లేదు సుంకన్న. సుంకమ్మ బజారుకు వెళ్ళి సరుకులు అప్పుదెచ్చి ఆ రోజు గడిపింది

* * *

మరో రెండు రోజులు గడిచాయి. ఒక్కటీ ఖర్చు కాలేదు. సుంకన్నలో నిరాశ ఎక్కువైంది. స్టాకువైపు దిగాలుగా చూస్తూ వుండిపోయాడు. సుంకమ్మ మాత్రం ఆశతో అప్పులు చేస్తోంది తను తింటూ భర్తకి వండిపెడుతోంది

ఆ రాత్రి వర్షం పట్టుకుంది. నింగీ నేలా ఏకమయ్యేట్టుగా కురిసింది. తెల్లగా తెల్లారినా ఆ ముసురు విడవలేదు. సుంకన్న అడవికి పోలేదు. అలా నాలుగు రోజులు గడిచాయి. అప్పుచేయటం. పగల్లా యింటిముందు దిగాలుగా కూర్చోవటం సుంకమ్మ తెచ్చింది తినటం. సాయంకాలం యీ బాధ మరిచేందుకు అప్పుగా సారా తాగటం వెచ్చగా పడుకోవటం.

సుంకన్నకి ధైర్యం చెపుతున్నా పదిహేను రోజులుగా అప్పుచేస్తూ సంసారాన్ని లాక్కొస్తోన్న సుంకమ్మకీ భయంగానే వుంది. 'ఈ నూర్రూపాయల అప్పు తీరటం ఎట్లా? వరదొచ్చినట్టుగా అవి ఖర్చయితే తప్ప ఈ గండం గడిచేదెట్లా? ఏ కలరానో వస్తేతప్ప ఈ కరువు తీరదు!' భర్త పక్కలో ముడుచుక పడుకుని అనుకుంది.

దిగులుతో ఆలోచనలతో ఎప్పుడో

నిద్రలోకి జారిపోయింది. తెల్లగా తెల్లారేవరకూ మెళకువ రాలేదు.

బయటికిరాగానే వీధివిధంతా కలవర పడుతున్నట్టుగా అనిపించి పక్కింటి పుల్లమ్మని అడిగింది 'ఏమిటక్కా? అంతా అంత అయిదిగా వున్నారు?'

'నీకు తెల్దా! వీధి చివర్లో ఎంకట సామికి కలరా తగిలింది. వూర్లో బాగా నేదంట! వానలొచ్చినయ్ గదా! కలరా తగులుకుంటే యిడసదు, జాగర్త గుండాల. నానొకం తినకూడదు. సద్దీ బొద్దీ పారెయ్యాల. తినకూడ్దు!' భయం భయంగా చెప్పింది పుల్లమ్మ.

ఆ మాటలు వినగానే ఒళ్లంతా జలద రించినట్టయింది. వెన్నెముక గుండా చలి నరనరాన వ్యాపించినట్టయింది. భయం నరం ఇంజక్షన్ చేసినట్టుగా కమ్ము కుంది 'రాత్రి తను అనుకుంది తెల్లారేవ గానే అది తమ వీధిలోనే కనిపిం చింది. తనెంత చెడుగా ఆలోచించింది!'

'ఏమిటే?' బయటికి వచ్చి అడిగాడు సుంకన్న.

'వెంకటస్వామికి కలరా తగిలిందట!'

'ఏడుకొండలవాడా! నువ్వెంత మంచి వాడివి. గిరాకీ తగిలించు నాయనా!' చప్పున మొక్కాడు సుంకన్న.

'ఛ! ఛ! ఏం మనిషివి? ఎంకట స్వామి బంగారంలాంటి మనిషి! మన అవసరంకోసం ఆయన చావు కోరు కుంటామా? పాపం ఆయన భార్య బాలింత. లేకలేక కొడుకు పుట్టినాడు. భగవంతుడా! ఆయన్ని కాపాడు! పాడు మనిషి! ఎంత మాటన్నాడు! స్వామీ! మా తప్పు కాయి! ఆయనకు బాగుచెయ్!' నిర్మలమైన మనస్సుతో ప్రార్థించింది సుంకమ్మ.

సుంకన్న దిర్వెరపోయి చూశాడు భార్యవైపు. వాడికి ఆమె మనస్సు అర్థంకాలేదు.

* * *

దేవతల దయో, వెంకటస్వామి అదృ ష్టమో, ఆయన భార్యా, లేకలేక కలిగిన కొడుకుచేసుకున్న పూర్వజన్మ పుణ్యమో సుంకన్న నిస్వార్థంగా చేసిన ప్రార్థనా ఫలితమో వెంకటస్వామి కలరాగండం గట్టెక్కాడు.

అక్కడా అక్కడా ఒకటో రెండో శాస్త్రీలు బొల్చి తన్నేసినా ఆ గిరాకీ సుంకన్నకి రాలేదు.

ఏ బాధ అయినా కొత్తలో కలిగించి నంత వ్యథ, కొంత అలవాటుపడ్డాక కలి గించలేదు. ఈ మూడు వారాలుగా అల వాటుపడిన సుంకన్నకి యీ కష్టం అలవాటైపోయింది.

అప్పుచేసుకుంటూ భార్య తెచ్చిపెడు తోన్న తిండితో కాలం గడిపేస్తున్నాడు సుంకన్న.

ఆ రోజు వెంకటస్వామి భార్య సుంకమ్మని పిలిచి పాయసం, చిత్రాన్నం, అన్నం, పప్పు, గారలు పెట్టియిచ్చింది.

'సుంకమ్మా! అయ్యగారు దేవుని దయ వల్ల గండం గట్టెక్కినాడు. ఈ రోజు వేంకటేశ్వరస్వామికి చేసుకున్నాం. మీరూ తినండి!'

సుంకమ్మ ముఖం వికసించింది. చాలా రోజుగా మంచి తిండి తినని భర్త ముఖం గుర్తుకివచ్చింది. సంబరంగా తీసుక పోయి భర్తకు పెట్టింది. ఆ రాత్రికి, మరురోజు ఉదయంకూడా తిన్నారు.

సుంకన్నకి గిరాకి మాత్రం తగ్గ లేదు.

* * *

సాయంకాలం సారా అంగటినుంచి నేరుగా యింటికివచ్చాడు సుంకన్న. వాడికి కడుపులో ఏదో గందరగోళంగా వుంది. ఇంటికి రాగానే వెదురుమంచానికి అడ్డంపడ్డాడు. ఇల్లంతా గిర్రున తిరుగు తున్నట్టుగా వుంది. కళ్లు బైర్లుకమ్ము తున్నాయి. 'సుంకీ' బలహీనంగా కేకేశాడు.

'ఏమిటి?' దిగాలుగా బయటికి వచ్చింది సుంకమ్మ.

'నా కెల్లాగో వుందే' అంటూ వుండ గానే భళ్లున కక్కుకున్నాడు. వెంట వెంటనే రెండుసార్లు వమనమయింది.

'నానాకం తిని వుంటావు. వద్దన్నా నాటుసారా తాగివుంటావు. నీకిదేం పోయే కాలమో!' విసుక్కుంది.

అంతలో విరోచనమూ అయింది. పంచె మార్చింది.

మరోసారి వాంతికి అయింది.

'ఇదో నీళ్లు పుక్కిలించు'

నీళ్లు పుక్కిలిస్తూ వుండగానే విరో చనం అయింది.

'అజీర్ణమేమో!'

సుంకన్న బదులు చెప్పలేదు. వాడికి చాలా బలహీనంగా వుంది. కాళ్లు తేలి పోతున్నాయి. కళ్లు మూసుకపోతున్నాయి. మరోసారి వమనం అయింది.

సుంకమ్మకి భయంవేసింది. మరోసారి వమనమూ, విరేచనం కాగానే 'ఏమయ్యోయ్! ఇది అజీరణం లాగా లేదు. డాక్టర్ దగ్గరికి పోదాం పద!' విపరీతమయిన దుర్గంధం కడుపులో దేవుతూ వుండగా అంది సుంకమ్మ.

సుంకన్న బలహీనంగా చూశాడు భార్యవైపు.

కేకలువేసింది సుంకమ్మ. ఇరుగు పొరుగు జతయ్యారు. ఆ స్థితి, ఆ వాంతులు, ఆ విరేచనాలు, ఆ దుర్వాసనా గమనించగానే 'కలరానేమో!' అంది పుల్లమ్మ.

ఆ మాటలకి అంతా వులికిపడ్డారు.

గొల్లుమంది సుంకమ్మ.

ఒక్కతే భర్తను గుర్రపుబండిలో వేసుకుని బయలుదేరింది. ప్రభుత్వం ఆసుపత్రిలో చేర్చేసరికే వాడి పరిస్థితి ఘోరంగా వుంది. చేర్చిన గంటకంతా ప్రాణంపోయింది.

వెంటనే శవాన్ని అప్పగించారు సుంకమ్మకి.

నిద్రలోకి జారిపోయింది. తెల్లగా తెల్లారేవరకూ మెళకువ రాలేదు.

బయటికిరాగానే వీధివిధంతా కలవర పడుతున్నట్టుగా అనిపించి పక్కింటి పుల్లమ్మని అడిగింది 'ఏమిటక్కా? అంతా అంత అయిదిగా వున్నారు?'

'నీకు తెల్దా! వీధి చివర్లో ఎంకట సామికి కలరా తగిలింది. వూర్లో బాగా నేదంట! వానలొచ్చినయ్ గదా! కలరా తగులుకుంటే యిడనదు, జాగర్త గుండాల. నానొకం తినకూడదు. సద్ది బొద్దీ పారెయ్యాల. తినకూడ్దు!' భయం భయంగా చెప్పింది పుల్లమ్మ.

ఆ మాటలు వినగానే ఒళ్లంతా జలద రించినట్టయింది. వెన్నెముక గుండా చలి నరనరాన వ్యాపించినట్టయింది. భయం నరం ఇంజక్షన్ చేసినట్టుగా కమ్ము కుంది 'రాత్రి తను అనుకుంది తెల్లారేవ గానే అది తమ వీధిలోనే కనిపిం చింది. తనెంత చెడుగా ఆలోచించింది!'

'ఏమిటే?' బయటికి వచ్చి అడిగాడు సుంకన్న.

'వెంకటస్వామికి కలరా తగిలిందట!'

'ఏడుకొండలవాడా! నువ్వెంత మంచి వాడివి. గిరాకీ తగిలించు నాయనా!' చప్పున మొక్కేడు సుంకన్న.

'ఛ! ఛ! ఏం మనిషివి? ఎంకట స్వామి బంగారంలాంటి మనిషి! మన అవసరంకోసం ఆయన • చావు కోరు కుంటామా? పాపం ఆయన భార్య బాలింత. లేకలేక కొడుకు పుట్టినాడు. భగవంతుడా! ఆయన్ని కాపాడు! పాడు మనిషి! ఎంత మాటన్నాడు! స్వామీ! మా తప్పు కాయి! ఆయనకు బాగుచెయ్!' నిర్మలమైన మనస్సుతో ప్రార్థించింది సుంకమ్మ.

సుంకన్న దివ్వెరపోయి చూశాడు భార్యవైపు. వాడికి ఆమె మనస్సు అర్థంకాలేదు.

* * *

దేవతల దయో, వెంకటస్వామి అదృ ష్టమో, ఆయన భార్యా, లేకలేక కలిగిన కొడుకుచేసుకున్న పూర్వజన్మ పుణ్యమో సుంకన్న నిస్వార్థంగా చేసిన ప్రార్థనా ఫలితమో వెంకటస్వామి కలరాగండం గట్టెక్కాడు.

అక్కడా అక్కడా ఒకటో రెండో శాల్తీలు బాల్చీ తన్నేసినా ఆ గిరాకీ సుంకన్నకి రాలేదు.

ఏ బాధ అయినా కొత్తలో కలిగించి నంత వ్యథ, కొంత అలవాటుపడ్డాక కలి గించలేదు. ఈ మూడు వారాలుగా అల వాటుపడిన సుంకన్నకి యీ కష్టం అలవాటైపోయింది.

అప్పుచేసుకుంటూ భార్య తెచ్చిపెడు తోన్న తిండితో కాలం గడిపేస్తున్నాడు సుంకన్న.

ఆ రోజు వెంకటస్వామి భార్య సుంకమ్మని పిలిచి పాయసం, చిత్రాన్నం, అన్నం, పప్పు, కూరలు పెట్టియిచ్చింది.

'సుంకమ్మా ! అయ్యగారు దేవుని దయ వల్ల గండం గట్టెక్కినాడు. ఈ రోజు వేంకటేశ్వరస్వామికి చేసుకున్నాం. మీరూ తినండి !'

సుంకమ్మ ముఖం వికసించింది. చాలా రోజులుగా మంచి తిండి తినని భర్త ముఖం గుర్తుకువచ్చింది. సంబరంగా తీసుకపోయి భర్తకు పెట్టింది. ఆ రాత్రికి, మరురోజు ఉదయంకూడా తిన్నారు.

సుంకన్నకి గిరాకి మాత్రం తగల్లేదు.

* * *

సాయంకాలం సారా అంగటినుంచి నేరుగా యింటికివచ్చాడు సుంకన్న. వాడికి కడుపులో ఏదో గందరగోళంగా వుంది. ఇంటికి రాగానే వెదురుమంచానికి అడ్డంపడ్డాడు. ఇల్లంతా గిర్రున తిరుగుతున్నట్టుగా వుంది. కళ్లు బైర్లుకమ్ముతున్నాయి. 'సుంకీ' బలహీనంగా కేకేశాడు.

'ఏమిటి?' దిగాలుగా బయటికి వచ్చింది సుంకమ్మ.

'నా కెల్లాగో వుందే' అంటూ వుండగానే భళ్లున కక్కుకున్నాడు. వెంటవెంటనే రెండుసార్లు వమనమయింది.

'నానాకం తిని వుంటావు. వద్దన్నా నాటుసారా తాగివుంటావు. నీకిదేం పోయేకాలమో !' విసుక్కుంది.

అంతలో విరోచనమూ అయింది. పంచె మార్చింది.

మరోసారి వాంతికి అయింది.

'ఇదో నీళ్లు పుక్కిలించు !'

నీళ్లు పుక్కిలిస్తూ వుండగానే విరోచనం అయింది.

'అజీర్ణమేమో !'

సుంకన్న బదులు చెప్పలేదు. వాడికి చాలా బలహీనంగా వుంది. కాళ్లు తేలిపోతున్నాయి. కళ్లు మూసుకపోతున్నాయి. మరోసారి వమనం అయింది.

సుంకమ్మకి భయంవేసింది. మరోసారి వమనమూ, విరేచనం కాగానే 'ఏమయ్యోయ్ ! ఇది అజీరణం లాగా లేదు. డాక్టర్ దగ్గరికి పోదాం పద !' విపరీతమయిన దుర్గంధం కడుపులో దేవుతూ వుండగా అంది సుంకమ్మ.

సుంకన్న బలహీనంగా చూశాడు భార్యవైపు.

కేకలువేసింది సుంకమ్మ. ఇరుగు పొరుగు జతయ్యారు. ఆ స్థితి, ఆ వాంతులు, ఆ విరేచనాలు, ఆ దుర్వాసనా గమనించగానే 'కలరానేమో !' అంది పుల్లమ్మ.

అ మాటలకి అంతా వులికిపడ్డారు.

గొల్లుమంది సుంకమ్మ.

ఒక్కతే భర్తను గుర్రపుబండిలో వేసుకుని బయలుదేరింది. ప్రభుత్వం ఆసుపత్రిలో చేర్చేసరికే వాడి పరిస్థితి ఘోరంగా వుంది. చేర్చిన గంటకంతా ప్రాణంపోయింది.

వెంటనే శవాన్ని అప్పగించారు సుంకమ్మకి.



జటాక్ాలో యింటికి చేర్చారు.

కులస్తులు అంతా గుమికూడి దుఃఖి స్తోన్న సుంకమ్మకి చెప్పి తర్వాత కార్య క్రమానికి పూనుకున్నారు.

సుంకన్న స్వయంగా తయారుచేసు కున్న పాడెమీదే వాడిని బిగించికట్టారు.

'పది పదిహేను రోజులుగా ఒక్కటీ ఖర్చుకాలేదు. ఆఖరికి వాడి పాడెకట్టె వాడికే ఉపయోగపడింది.' ఎవరో అన్నారు.

సుంకమ్మ గుండెల్లో దేవినట్టయింది. భర్త ఆవేదన, ఆరాటం గుర్తుకివచ్చింది.

'ముదనష్టపు వ్యాపారం! ఈ మృత నష్టం వ్యాపారం యిక నాకొద్దు. ఇది వాడితోనే పూర్తిగా తగలబడిపోనీ. ఊరికి మంచి కోరుకోవాల. రోజూ ఎవరో ఒకరు చనిపోవాలా అని ఆశతో, ఎవరైనా చనిపోవాలని దురాశతో ఎదురు చూడటం నీచం- పాపం. అందరూ బాగుండాలని కోరుకోవాల. ఇదేం యాపారం? ఇక యిది నాకొద్దు. కాయ కష్టం చేసుక బతుకుతా! ఇవన్నీ వీడి తోనే తగలబడిపోనీ!' అనుకుంది.

భర్త యీ పదిహేను రోజులుగా తయారుచేసిన పాడెకట్టెలన్నీ స్మశానానికి చేర్చింది సుంకమ్మ. భర్త శవంతో పాటే వాటినీ తగలేసింది. తగలబడు తున్న శవాన్ని చూసి గొల్లున ఏడ్చి మూర్ఛబోయింది సుంకమ్మ.

———



# హంస మంజీరాలు

(గత సంచిక తరువాయి)

"వెళ్ళమంటే నా మీద వొట్టే అని నేనే ముందుగా అనివుంటే" అన్నాడు కొంటెగా.

రాధ చేతులెత్తి మొక్కింది.

"దయచేసి వెళ్ళండి. తొలిరేయే ఆమెను అలా ఒంటరిగా వదిలి రావడం దారుణం" అంటూ అతన్ని బయటకు నెట్టి తలుపులు మూసింది రాధ.

మూసిన తలుపులకే జారబడి కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది.

కృష్ణమరాయుడు తలుపుల బయట— రాధ లోపల.

"ఒకప్పుడు నా తలపులతో మనసు నింపుకొని ఈ తలుపులు నాకోసం తెరచి వుంచేదానివి. యీనాడు తలుపులు మూసి

సి యస్ రావు & శివదత్త్

యింటికివచ్చిన నన్ను వెళ్ళమంటున్నావు" అన్నాడు కాస్త నిష్ఠూరంగా.

రాధ కిటికీదగ్గరకు వచ్చి నీళ్ళునిండిన కళ్ళతో చేతులెత్తి దండంపెట్టి "యీ తలుపులు మూయగలిగానేగాని మనసులోని తలపులను తుడిచేసుకోలేను. యీ మూడురోజులూ నాకోసం అక్కడే వుండండి," అంది.

"ఇవి మూడు రోజులు కావు రాధా, మూడు యుగాలు" అని కాస్త కోపంగా అక్కడనుంచి వెళ్ళిపోయాడు కృష్ణమరాయుడు.

రాధ తన తలను తలుపుకు కొట్టుకొని ఏడుస్తూ అక్కడే కూలబడింది.

## 26

రాధ తనమీద ఒట్టువేసుకోవడం మూలంగా కృష్ణమరాయుడు మూడు రోజులూ యింటిపట్టునే వున్నాడు. మనసు బిగపట్టుకొని వున్నాడేగాని, ఆ మూడు రాత్రులు రాధ ఆశించినట్టు గడపలేక పోయాడు. లక్ష్మి గదిలోకిరాగానే ఏవో ఆ కబురూ యీ కబురూ చెప్పి, లక్ష్మిని నిద్రపుచ్చి బయటపడేవాడు. రాధను తాను తొలిసారి కలిసిన మండపంలోనూ, ఆలయ వుద్యానవనంలోనూ రాత్రివేళ గడిపి తెలతెలవారుతున్నవేళ యింటికి చేరేవాడు. లక్ష్మి అమాయకత్వం తెలియనితనం కృష్ణమరాయుడు అల్లరిపడకుండా కాపాడాయి.

ఆ అమాయకత్వమే జరిగిన విషయాన్ని తల్లికీ- అత్తగారికి తెలియపరిచింది కూడా.

ఆ మూడు రోజుల్లోనూ ఒక్క రాత్రి కూడా లక్ష్మిని కృష్ణమరాయుడు మనసారా పలకరించిన లేదన్న సంగతి తెలుసుకున్న కామక్షమ్మ మనసు కుతకుత వుడికిపోయింది.

పార్వతమ్మ కామాక్షమ్మను ఓదార్చింది. "రోజులు గడిస్తే వాళ్ళే దగ్గరౌతారు. కాస్త ఓపికపట్టు వదినా" అని బతిమిలాడింది.

"అన్నీ తెలిసి తెలిసి బిడ్డగొంతు కోసానేమో అనిపిస్తోంది" అంది కామాక్షమ్మ పార్వతమ్మతో.

"నే నుండగా నీ బిడ్డకు అన్యాయం జరగనివ్వను. లక్ష్మి నాకు కోడలే అయినా కన్నబిడ్డ కంటె ఎక్కువ. కళ్ళల్లో పెట్టుకుని చూసుకుంటాను. నా మాట నమ్ము వదినా" అని పార్వతమ్మ కామాక్షమ్మ చేతులు పట్టుకుని బతిమాలింది.

"ఏమో పార్వతమ్మా నా కూతురి కాపురం కుదటపడేదాకా నేను దాన్ని వదిలి వెళ్ళను వెళ్ళలేను." అంది కామాక్షమ్మ.

"నిన్ను ఎవరు వెళ్ళమన్నారు. నీ యిష్టం వచ్చినంత కాలం వుండు. ఆ ముచ్చట చూసుకునే వెడుదువు గాని" అని పార్వతమ్మ కామాక్షమ్మకు ధైర్యం చెప్పింది.

మూడు రాత్రులూ ముక్కు మూసుకొని గడిపేసి కృష్ణమరాయుడు నాలుగవ రాత్రి రాధ యింటికి వెళ్ళిపోయాడు.

మూడు రాత్రులూ ఎలా గడిచాయో తెలుసుకోవాలన్న కుతూహలంతో రాధ "ఆవిడగారు ఎలా వున్నారు" అని వుపక్రమించింది.

"ఇప్పుడు ఆ సంగతులన్నీ ఎత్తకు" అని కృష్ణమరాయుడు రాధను వారించి దగ్గరకు తీసుకున్నాడు.

రాధ కాదనలేకపోయింది.

అది మొదలు రోజూ కృష్ణమరాయుడు పూరు మాటుమణిగే వేళకి రాధ యింటికి చేరుతున్నాడు. తొలికోడి కూసాక యింటికి వెడుతున్నాడు.

అలా రోజులూ, వారాలూ గడిచాయి. మూడు మాసాలు గడిచాయి.

లక్ష్మి ఒకనాటి రాత్రి "రోజూ నన్ను ఒక్కర్తినీ వదిలేసి ఎక్కడికి వెళ్ళిపోతున్నావు బావా ?" అంది.

"మొగవాళ్ళకి తొంభై పనులుంటాయి. అవన్నీ నువ్వు అడక్కూడదు." అన్నాడు కృష్ణమరాయుడు.

"రాధ యింటికేనా" అందామనుకుంది. కాని భయమేసి అనలేకపోయింది.

లక్ష్మి రోజురోజుకీ దిగాలుపడిపోయి ఏదోలా వుంటోంది.

లక్ష్మిని చూస్తే కామాక్షమ్మ మనసూ, పార్వతమ్మ మనసూ తరుక్కుపోతున్నాయి. కృష్ణమరాయుని నిలదీసి అడగ


కన్నతల్లి అనురాగానికి
ప్రతిరూపం

లేకపోతున్నారు. కామాక్షమ్మ నోటి కొచ్చినట్లు రాధను తిడుతోంది పార్వతమ్మ ముందు.

రాధను తిట్టడం పార్వతమ్మకు నచ్చడంలేదు. కాని ఆ దినగారిని ఏమీ అనలేకపోతోంది.

మార్గం తోచక సతమతమౌతున్నారు పార్వతమ్మ, కామాక్షమ్మ కూడా.

చివరికి కామాక్షమ్మ ఓ నిర్ణయానికి వచ్చింది. రాధను కలవాలనుకుంది.

రాధ యింటికే స్వయంగా వెళ్ళడానికి కామాక్షమ్మ మనసు అంగీకరించలేదు. ఆ వాడకు వెళ్ళడం మర్యాద కాదనుకుంది.

"ఆలయానికి రోజూ ఏ వేళప్పుడు వస్తుంది రాధ" అని పార్వతమ్మను అడిగింది కామాక్షమ్మ.

"సూర్యోదయానికి ముందు వస్తుందట. పూర్ణయ్యగారు చెప్పారు" అంది పార్వతమ్మ.

"సరేలే" అంది కామాక్షమ్మ.

"ఆ పిల్ల మర్యాదస్తురాలే" అంది పార్వతమ్మ, కామాక్షమ్మ రాధను ఏం చేయబోతుందోనన్న భయంతో.

"తేనె పూసిన కత్తులు అలాగే కనపడతారు" అంది కామాక్షమ్మ వెటకారంగా

## 27

ఆ రోజు అమావాశ్య. వెలుగురాకుండానే కామాక్షమ్మ ఆలయానికి వచ్చింది. పూజారి పూర్ణయ్య కూడా యింకా రాలేదు. గుడి తలుపులు తెరవలేదు.

కామాక్షమ్మ మాత్రం ముందుగానే వచ్చి ఆలయవనంలో పొగడచెట్టు కింద మాటువేసుకొని కూర్చున్న వేటగాడిలా కూర్చుంది.

ముందుగా పూజారి పూర్ణయ్య వచ్చి తలుపులు తెరిచారు. దేవుడి ముందున్న మాలిన్యాన్ని ఎత్తి పారబోసి, శుభ్రం చేసాడు.

పూజ ప్రారంభించాడు.

రాధ భీముడుని వెంటబెట్టుకుని వచ్చింది.

సరాసరి స్వామి సన్నిధికి వెళ్ళి పూలసజ్జ పూర్ణయ్యగారికి అందించింది. పూజ నిరాటంకంగా జరిగిపోయింది. ప్రసాదం తీసుకున్నారు భీముడూ రాధాను. స్వామికి నమస్కరించి తిరిగి వెళ్ళబోతున్నారు

ఎదురుగా కామాక్షమ్మ ప్రత్యక్షమైంది. కామాక్షమ్మను రాధ పెళ్ళిలో చూసింది. కామాక్షమ్మ తన కెదురుగా నిలబడగానే రాధ వణికిపోయింది—

"నమస్కారమమ్మా" అంది రాధ తేరుకుని.

బదులు పలుక లేదు కామాక్షమ్మ.

"పూజ అయిందా అమ్మా" అంది వెటకారంగా కామాక్షమ్మ.

"అయిందమ్మా" అంది రాధ ఎంతో వినయంగా.

జుట్టుకు
సిల్కువంటి మృదుత్వము
నిచ్చుటకు నైసర్గిక
ఉపాయము...



శుద్ధమైన షీకాయిలోని సహజ లాభకర గుణములు
స్వస్తిక్ షీకాకాయ్ సబ్బులో నింపబడినవి
వాడడానికి అనువైనది శీకాయ్ షాంపూ కంటే
ఎంతో పొదుపైనది



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును
మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది
మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగ లాడేలా
వుంచుతుంది తాజా సువాసన సిల్కు వంటి
మృదుత్వాన్ని ఒసగుతుంది

SHIKAKAI

ఈ స్వస్తిక్
# షీకాకాయ్ సబ్బు

ఇందులో షీకాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు
పారంపర్యమైన రహస్యము

shilpi dm 25/79 tel

"సిగ్గులేకపోతే .సరి. అయిందట అయింది. చెప్పేవి శ్రీరంగ నీతులూ దూరేవి దొమ్మరిగుడిశలూ అన్నట్టు, పొద్దున్నే గుడిలోని లింగాలను కొలవడం రాత్రిళ్ళు తోటి ఆడదాని కొంపను ముంచడమూను. నా కూతురు నీకు ఏమి అపకారం చేసిందనే దాని మొగుడ్ని దానికి కాకుండా చేస్తున్నావ్ ?" అని విరుచుకు పడింది కామాక్షమ్మ.

రాధ బదులు పలకలేదు. అలాగే బొమ్మలా నిలబడిపోయింది.

"తోడి ఆడదాన్ని యింత ఉసురు పెట్టిన నీలాంటి ఆడది మరో పది జన్మ లెత్తినా తోటి ఆడదే అసహ్యించుకునేలా యిలాగే పుడతుంది."

భీముడు కుతకుత వుడికిపోతున్నాడు కామాక్షమ్మ మాటలకి-ఇక వుండబట్టలేక పోయాడు.

"అమ్మా" అని అరిచాడు.

"ఏరా బెదిరిస్తున్నావా ?" అని కళ్ళు ఎర్రజేసింది కామాక్షమ్మ.

"మావయ్యా" అంటూ భీముడ్ని వారించింది రాధ.

బదులు చెప్పకుండా కామాక్షమ్మని తప్పించుకొని భీముడ్ని తీసుకొని వెళ్ళి పోయింది రాధ.

"నువ్వు ఏం తప్పుచేసావని అలా అడిపోసుకుంటుంది ఆవిడగారు. నువ్వు తలుచుకోకపోతే అసలు ఆవిడ కూతురుని కృష్ణమరాయుడుగారు పెళ్ళాడేవారా" అన్నాడు ఆవేశంగా భీముడు.

"మావయ్యా- తిట్టింది కామాక్షమ్మ గారు కాదు. తల్లి మనసు. ఆవిడ స్వతహాగా మంచివారే" అని వారించింది భీముడ్ని రాధ.

"ముంగిలా బదులు చెప్పకుండా పోతోంది" అంది కామాక్షమ్మ రాధ వెళ్ళిన వైపే చూస్తూ ఆలయంలో నిలబడి.

"మనసు కాస్త వూరటపడిందా కామాక్షమ్మగారు" అన్నాడు పూర్ణయ్య ఆమె వెనకనే నిలబడి.

కామాక్షమ్మ వెనక్కి తిరిగి పూర్ణయ్య గారిని చూసింది.

"నాకు వూరట ఎక్కడిదండీ ? గుండెలు మండిపోతూ వుంటేనూ" అంది కామాక్షమ్మ.

"నోరు జారితే ప్రయోజనం ఏమిటి ?" అన్నారు పూర్ణయ్య అనునయంగా.

"నేనేం తప్పు మాట్లాడాను ? ఉన్న మాటే అన్నాను. అందుకే నోరెత్తకుండా తలవంచుకొని పోయింది. ఎదురుచెబితే చెప్పేదాన్ని దాని సంగతి" అంది కామాక్షమ్మ ఆవేశంగా.

"నిండు సభలో యీ విగ్రహం పునఃప్రతిష్ట రోజున ఆమె నృత్యం చూసి అందరూ అభినందించారు. ఆ

# శుభ్రమైన తాజా శ్వాస...
# ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు



## కోల్గేట్
### డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనం కాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా మింట్ రుచివల్ల బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.

**నోటి దుర్వాసనను ఆపండి**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని ఎదుర్కోండి!**







DC G 74 TL

నాడూ ఆమె బదులుచెప్పలేదు. ఆమె పోగడ్తలకూ తిట్లకూ చలించేది కాదు."

"దాన్ని వెనకేసుకొస్తున్నారా ?"

"ఆమె సంస్కారం గురించి చెబుతున్నాను."

"అదీ మీరూ దేవుడిమీద బతికే వారేగా. ఒకే జాతి. అందుకే దాన్ని అంతగా వెనకేసుకొస్తున్నారు" అని విసురుగా అక్కడనుంచి యింటికెళ్ళి పోయింది కామాక్షమ్మ.

పూర్ణయ్య నవ్వుకున్నాడు. తిరిగి గర్భగుడిలోకి వెళ్ళి తన తతంగంలో తను మునిగిపోయాడు.

ఆ రాత్రి రోజులాగే కృష్ణమరాయుడు రాధ యింటికి వచ్చాడు. ఆ రాత్రి రాధతో ఎప్పటిలాగే గడిపాడు. రాధ ప్రవర్తనలో పిసమెత్తు కూడా మార్పు లేదు.

ఆనాటి ఉదయం ఆలయంలో తనకూ కామాక్షమ్మకూ మధ్య జరిగిన ఘర్షణ సంగతి అతనికి చెప్పలేదు. తనలో తానే ఏదో ఆలోచించుకుంటున్న సంగతికూడా కృష్ణమరాయునికి అంతుదొరకనివ్వలేదు. "నే నోమాట చెబితే మీకు కోపంరాదు కదా ?" అంది రాధ.

"కోకిల పాడితే ఏవగించుకోవడం కోపగించుకోవడం నాకు చేతకాదు" అన్నాడు కృష్ణమరాయుడు నవ్వుతూ.

"పొగడ్తలు తరువాత. మీరు ఒక రోజు యింట్లోను ఒకరోజు యిక్కడా వుంటే బాగుంటుంది."

"పగలు అక్కడా రాత్రి ఇక్కడా వుంటున్నాను కదా."

"అలా కాదు. ఒకరాత్రి ఆవిడగారి దగ్గర, ఒక రాత్రి నా దగ్గర" అంది రాధ.

కృష్ణమరాయుడు నిట్టూర్చాడు.

"రాధా! 'మందార మకరంద మాధుర్యమును గ్రోలు మధుపంబు చేరునే మదనములకు' అన్న పద్యం నీకు తెలుసా ?"

"ఎందుకు తెలీదు."

"మందారలోని మధువుని గ్రోలడానికి అలవాటుపడ్డ యీ మధుపం మదనముల జోలికి పోలేదు."

"అసలు మందారమే లేకపోతే ?"

"లేకపోవడం ఏమిటి. నా ముద్దు మందారం నా కళ్ళముందే వుండగా" అంటూ కృష్ణమరాయుడు రాధ ముఖాన్ని తన దోసిడి లోనికి తీసుకొని తన ముఖానికి చేర్చుకున్నాడు.

మరునాటి తెలతెలవారుతున్న వేళ బెరుకు బెరుగ్గానే ఆలయానికి వెళ్ళింది భీముని వెంటతీసుకొని.

కామాక్షమ్మ మళ్ళీ గుడిలో ఎదురౌతుందేమోనని భయంగానే వుందామెకు.

కాని కామాక్షమ్మ రాలేదు. పార్వతమ్మ కనిపించింది.

రాధ పాదాభివందనం చేసింది.

ఎక్కువ పొదుపు మరియు తెలుపు కావాలంటే
సబ్బుల మాట మరవండి, తెండి

# సూపర్ 777 డిటర్జెంట్ బార్

* సబ్బుకంటే $1\frac{1}{2}$ రెట్లు ఎక్కువ శక్తివంతమైనది, ఎక్కువ పొదుపునిచ్చునది!
* ఆప్టికల్ వైటనర్ తో కూడినది!!

ప్రపంచపు నం.1
డిటర్జెంట్
ఉతికే బార్
సూపర్ 777

మురికికి ముప్పు,
మెరుపుల
తెలుపు




Shilpi DM 13A/80 Tel

"లే అమ్మా.! నీ చేత మొక్కించు కుందుకు కాదు నేను వచ్చింది. జరిగిన దానికి క్షమార్పణ చెప్పుకోడానికి వచ్చాను." అంది పార్వతమ్మ.

ఆ మాటకు రాధ మనసు కరిగి పోయింది. "వారి తప్పు లేదమ్మా, తప్పు నాదే. సరిదిద్దుకుంటాను. కాస్త వ్యవధి యివ్వండి. ఒక్కసారిగా తరువు కూలి పోతే అల్లుకున్న లత ఏమైపోతుందోనన్న భయంతో కాస్త వెనకాడుతున్నాను" అంది రాధ.

ఒక్క క్షణం పార్వతమ్మ, రాధా ఒకరి ముఖాల్లోకి ఒకరు చూసుకున్నారు. రాధా భీముడూ వెళ్ళిపోయారు.

పార్వతమ్మ స్వామికి నమస్కరించి పూర్ణయ్య దగ్గర ప్రసాదం తీసుకొని బయలుదేరబోయింది.

"మంచితనంతో నమ్మించి విషం తాగించవచ్చు అన్న మాట యిప్పుడు నిజమే ననిపిస్తోందమ్మా" అన్నాడు పూర్ణయ్య.

"ఏంచేయమంటారు పూర్ణయ్యగారు. బాధ్యత ఆ పాపానికి కూడా ఒడికట్టేలా చేసింది నన్ను" అని పార్వతమ్మ అక్కడినుంచి వెళ్ళిపోయింది.

## 28

ఆలయంలో కామక్షమ్మ నానామాటలు అన్నసంగతి రాధ తన మనసులోనే దాచుకుంది. పార్వతమ్మ జరిగిన దానికి ఓదార్పుగా అన్న మాటనుల కూడా మనసులోనే దాచుకుంది.

కామాక్షమ్మ చీదరింపుకు కుంగిపోను లేదు. పార్వతమ్మ బుజ్జగింపుకు పొంగి పోనులేదు. ఈ విషయాలు ఏవీ రాధ ఏనాడు కృష్ణమరాయుడుతో చెప్ప లేదు. తెలియనివ్వలేదు కూడా కానీ రాధ మేనమామ భీముడు మాత్రం కామాక్షమ్మ రాధను అన్నమాటలు గురించి చాలా బాధపడ్డాడు. రాధ ఆదేశానుసారం కృష్ణ మరాయుడుకి ఆ సంగతి చెప్పలేదు. కానీ ఆ బాధను మనసులో దాచుకోలేక రాధ తల్లి పుష్పావతితో ఒకనాడు జరిగిన సంగతి చెప్పేసాడు.

పుష్పావతికి కృష్ణమరాయుని ముందు నిలబడి 'మీ అత్తగారు మా రాధను నానా మాటలు అందట' అని చెప్పే ధైర్యము లేదు. అందుకని నెమ్మదిగా ఒక రోజున కృష్ణమరాయుడు లేని సమయంలో రాధ చెంతకు చేరింది పుష్పావతి. నిజానికి జమీందారు వీరేంద్రరావు విషయంలో తనమాట కాదన్న నాటినుంచి పుష్పావతి రాధతో ఎడమొహం పెడమొహంగానే వుంటోంది. ఉన్నట్టుండి ఆ రోజున తన తల్లి తనతో అంత బుజ్జగింపుగా మాట్లా డటము, దగ్గరకు చేరడం, రాధకు వింత గానే తోచింది.

దీని వెనుక ఏదో వుండే వుంటుంది అనుకుంది.

"రాయంటి బిడ్డ లకంటి తల్లీ

# మంగళకరమైన వెన్నెల మోమును
# మెరుగు పరచటానికి



## ఐటెక్స్
## మాట్ ఫినిష్ తిలకం

దేశమంతటా నాగరిక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పుష్ప వదనాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే కన్నులకింపైన 14 రంగులలో దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు ఐటెక్స్ తిలకం చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు

**ఐటెక్స్** 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం




అరవింద్ లాబరేటరీస్ మద్రాసు 600033

Imageads AL 1240 R Tel

అన్నారు. నా మాట నీవు కాదన్నా నిన్ను ఎవరైనా పల్లెత్తుమాట అంటే నా మనసు విలవిల్లాడిపోతుంది. అది కాకపోయినా హేమాహేమీలు మన ఇంటికి వచ్చి మనల్ని పొగుడుతూ మన కాళ్ళదగ్గర పడివుండటం పరిపాటి. అలాంటిది పోయి ఈ కృష్ణమరాయుడుగారి సాంగత్యం మూలంగా అడ్డమైనవాళ్ళచేత, అడ్డమైన మాటలూ పడుతున్నావు. నీ పరిస్థితి తలుచుకుంటే గుండె తరుక్కుపోతోంది." అంది పుష్పావతి కంట తడి పెట్టుకుంటూ.

రాధ నవ్వుతుని "ఇప్పుడు నాకు యేమైందమ్మా ?" అంది.

'ఇంకా యేంకావాలమ్మా ! ఆ కృష్ణమరాయుడుగారి అత్తగారు గుడిలో నిన్ను పట్టుకొని అన్నమాటలు నాకు తెలియవు అనుకున్నావా ?'

"మావయ్య చెప్పాడా ?"

"కన్న బిడ్డవైన నువు నాకు చెప్పలేదు కానీ ఒకే కడుపున పుట్టినవాళ్ళం కావటంచేత వాడు మనసులో దాచుకోలేక చెప్పేసాడమ్మా నువ్వు వూరుకున్నావు కానీ నేనైతే...."

"యేంచేసేదానవు" అంది రాధ తల్లి మాట పూర్తికాకుండానే.

"నీ అల్లుడిని అదుపులో పెట్టుకోవడం నీకు చేతకాక నామీద విరుచుకు పడతావెందుకని ఆ కామాక్షమ్మని, మీ ఆడవాళ్ళనుకాస్త అదుపులో పెట్టుకోండని కృష్ణమరాయుడ్ని హెచ్చరించి వుండేదాన్ని" అంది పుష్పావతి.

"నువ్వు నాకంటె పెద్దదానవమ్మా కాస్త మర్యాదగా మాట్లాడటం నేర్చుకో"

"ఇప్పుడు నేను యెవరి గురించి అమర్యాదగా మాట్లాడాను ?"

"లేకపోతే కామాక్షమ్మ, కృష్ణమరాయుడు అంటూ ఏకవచన ప్రయోగమేమిటి ?"

"వారిముందు అన్నానా ఏమిటి ?"

"మనిషిముందు ఒకమాట మనిషి వెనుక మరోమాట మంచిదికాదు" అంది రాధ కాస్త చిరాకుగా.

"గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించింది అన్నట్టు యిన్నాళ్ళకు ఈ వయసులో నువు నాకు మర్యాదలు, మన్ననలు నేర్పుతున్నావు !" అంది పుష్పావతి వెటకారంగా.

"నిన్ను నొప్పించడం నా వుద్దేశం కాదమ్మా. ఎదుటివారు మనల్ని అవమానించినా, హేళనచేసినా మన్నించడం, మర్యాద యివ్వడం మన కులధర్మం. నువ్వు నన్ను ఒకమాట అంటె యెంత బాధపడతానో కామాక్షమ్మగారన్నా అంతే బాధపడతాను. నువు నా తల్లివి కామాక్షమ్మగారు లక్ష్మిగారి తల్లి. మీరిద్దరు నాకు కావలసినవారే." (సశేషం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది-చార్మినార్!

CHARMINAR

THE VAZIR SULTAN TOBACCO CO. LTD.

శాసనబద్ధమైన హెచ్చరిక:

సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం 1 రూపాయికి 10*

STATUTORY WARNING:

CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి

CASVS-238-182 TEL

మెయిన్ డీలరు  శ్రీ సత్యనారాయణ అండ్ కంపెనీ, విజయవాడ

